Ammanudi
Telugu Monthly
Volume-1
Issue-11
Rs.20/-
January 2016
Tenali, A.P



1993-2013 నడుస్తున్న చరిత్ర

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

జనవరి 2016

భారత గణతంత్ర
దినోత్సవ
శుభాకాంక్షలు



ఇద్దరు చంద్రుల కలయిక
తెలుగు ప్రజల మేలుకోసమేనా?

- అమ్మనుడిలోనే ప్రాథమిక విద్య
- మానవ భాషల ప్రాచీన చరిత్ర
- కళింగంలో తెలుగు ప్రాచీనత



సిల్హెట్‌లోని తెలుగువారితో తెలుగువాణి, తెలుగు భాషోద్యమ సమాఖ్య ప్రతినిధులు

# బంగ్లాదేశ్‌లో తెలుగువాళ్ళు రెండు లక్షలమంది!

## తెలుగు వ్రాయడం నేర్చుకోవాలని తపన

ఢాకాలో ఉన్న తెలుగువారి ఆహ్వానంపై 'తెలుగువాణి' ట్రస్టీ స.వెం.రమేశ్ బంగ్లాదేశ్ వెళ్ళివచ్చారు. ఆయనతో పాటు తెలుగు భాషోద్యమ సమాఖ్య ప్రతినిధి అడపాల సుబ్బారెడ్డి, రచయిత- పాత్రికేయుడు ఆర్.ఎం.ఉమామహేశ్వరరావు వెళ్ళారు. ఢాకాలో అక్కడి తెలుగు యువకుడు వేపాడ ఆనంద్ ఎదురొచ్చి వారిని తోడ్కొని వెళ్ళారు.

"ఢాకాలో 10 వేలమంది తెలుగువారు-వారిలో 80 శాతం హిందువులు, 20 శాతం క్రైస్తవులు ఉన్నారట. ఆరోజు క్రిస్మస్ కావడంతో చర్చికి తీసుకువెళ్ళారు. అక్కడ ప్రార్థనలు తెలుగులోనే జరుగుతున్నాయి. పాటలు తెలుగులో, బెంగాలీలో జరుగుతున్నాయి. అక్కడ కొందరు బెంగాలీలు చిన్నచిన్న అంగళ్ళు పెట్టుకొని బ్రతుకుతున్నారు. ఆర్థికంగా తెలుగువాళ్ళలో దిగువ, మధ్యతరగతి వారే ఉన్నారు. వారిలో నాలుగైదు కులాలున్నాయి. వాళ్లకు తమ ఇంటిపేర్లు అన్నీ తెలుసు. తెలుగు కులాల మధ్య పెళ్ళిళ్లు జరుగుతున్నాయి. కొన్ని వందల ఏళ్ళ నుంచి అక్కడే తాతముత్తాతలకు ముందునుండీ అక్కడే ఉన్నారు" అని బంగ్లాదేశ్ నుండి వెనుకకు వస్తూనే స.వెం.రమేశ్ ఫోనులో చెప్పారు. ఆయన ఇంకా ఇలా చెప్పారు : అక్కడి నుండి సిల్హెట్ రాష్ట్రానికి వెళ్లాం. అక్కడ 17 పల్లెల్లో తెలుగువాళ్లున్నారు. టీ తోటల్లో పని చేస్తారు. రెండు మూడు శతాబ్దాల క్రిందటే వచ్చి అక్కడే బ్రతుకుతున్నారు. ఢాకాలోని తెలుగువారికీ సెల్హెట్‌లోని తెలుగువారికీ ఇప్పుడిప్పుడే పరిచయాలు ఏర్పడుతున్నాయి. ఢాకాలోని వారిది నగరజీవితం కాగా సెల్హెట్ వారిది పల్లె జీవితం. మేం వెళ్ళిన ఊరిపేరు 'నరసన్న చైలా'. చైలా అంటే గ్రామం. లాంగ్లా గ్రామానికి కూడా వెళ్ళాం. ఇక్కడ మాత్రం కులాలెక్కువ. తెలుగులోనే పాడుతూ 'గెంతుభజన' అనే జానపద కళను ఆడి చూపారు. అద్భుతంగా ఉంది. ఎన్నో జానపదాలు, పెళ్ళిపాటలు తెలుగులోనే. ఢాకాలో సాయంత్రం పూట తల్లులు పిల్లలకు తెలుగు నేర్పుతున్నారు. సెల్హెట్‌లో ఇలా లేదు. తెలుగు నేర్చుకోవాలనే కోరికను వాళ్లలో కొందరు వెలిబుచ్చారు. అయితే అందుకు కావలసిన వనరులు అక్కడ లేవు. తెలుగు-బంగ్లా వాచకం కావాలనీ, తెలుగు పుస్తకాలు పంపించుమనీ అడిగారు. 'తెలుగువాణి' నుంచి తయారుచేసి పంపుతామని చెప్పాం.

బంగ్లాదేశ్‌లో ఇంకా 3 రాష్ట్రాల్లో తెలుగువారున్నారు. అంతా కలిపి రెండు లక్షల మందికి తక్కువ ఉండరని వారు చెప్పారు. మేం అక్కడ నాలుగు రోజులు (డిసెంబరు 24 నుండి 27 వరకు) మాత్రమే ఉండి సోమవారం ఉదయానికి భారతదేశంలోకి వచ్చేశాం

ఇదీ స్వాతంత్ర్యం ముందు వరకు మనదేశంలో భాగంగా ఉండి, దేశ విభజనతో పాకిస్తాన్ దేశంలో భాగమై, తర్వాత దాస్య విముక్తి కోసం పోరాటం జరిపి, భారతదేశ మద్దతుతో స్వాతంత్ర్యం పొందిన బంగ్లాదేశ్‌లోని తెలుగువారి గురించిన తొలి సమాచారం. తమ అమ్మనుడి కోసం పోరాటం జరిపిన బంగ్లావీరుల గురించి, తక్కిన విశేషాల గురించి ఫొటోలతో సహా వివరమైన వ్యాసాన్ని వచ్చే సంచిక- 'అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవ సంచిక'లో చదవండి.

**'అమ్మనుడి'** పత్రిక మీకు నచ్చితే, దయచేసి వెంటనే చందాదారులుగా చేరండి.

*చందా సొమ్మును మీరు ఈ క్రింది రీతుల్లో ఎలా వీలయితే అలా పంపించవచ్చు.*

- మనియార్డర్ ద్వారా పంపవచ్చు.
- ఆన్‌లైన్‌లో డబ్బు పంపేవారు NEFT / RTGS ద్వారా పంపించాలి.
- బ్యాంకు డి.డి. / మల్టీసిటీ చెక్ పంపవచ్చు.

*వివరాలు 4వపుటలో చూడండి.*

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిస్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. 3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రాన్ని స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తున్నది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.

3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైను)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

మళ్లీ కొత్త సంవత్సరం, తర్వాత సంక్రాంతి, ఆ తర్వాత గణతంత్ర దినోత్సవం...అన్ని సందర్భాలూ మార్పును, ముందడుగునూ సూచించేవే. ఐతే మన రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్రప్రభుత్వం, మన నేతలూ ప్రజల బ్రతుకుల్లో కొత్త వెలుగుల్ని నింపగల చేవను నిరూపించుకోగలరా అన్నదే మన ముందున్న ప్రశ్న




### లోపలి పుటలలో....


| | |
|---|---|
| **ఇవీ ముచ్చట్లు :** ........................................ | -51 |
| **సంపాదక హృదయం :** ప్రాథమిక విద్య అమ్మనుడిలో తప్పనిసరి | -7 |
| **భాషాశాస్త్రం :** మానవభాషల ప్రాచీన చరిత్ర **-ఆచార్య ఉమామహేశ్వరరావు** | -9 |
| **సాహితీరంగం :** బెంగుళూరులో సాహిత్యోద్యమం **- డా॥మధురాంతకం నరేంద్ర** | -12 |
| **పద్యసాహిత్యం :** వర్ణన రత్నాకరము **-డా॥ అద్దంకి శ్రీనివాస్** | -14 |
| **తెలుగమ్మ ఒడిలో బౌద్ధం :** మానవతకు ప్రతిరూపం..**-డా॥బొర్రా గోవర్ధన్** | -17 |
| **పిట్టచూపు :** ఇద్దరు చంద్రుల కలయిక....**-చలసాని నరేంద్ర** | -20 |
| **తెలుగు ప్రాచీనత :** కళింగంలో తెలుగు ప్రాచీనత**-డా॥తుర్లపాటి రాజేశ్వరి** | -22 |
| **జ్ఞాపకం :** ఆచార్య భావరాజు-కొన్ని జ్ఞాపకాలు**-డా॥ఇమ్మానేని సత్యసుందరం** | -25 |
| **శంకరభాష్యం :** గోవులొస్తున్నాయి జాగ్రత్త **-రాణిశివశంకరశర్మ** | -29 |
| **వైతాళికులు :** జాతీయ గ్రంథాలయం **-డా॥.జి.ఎ.ప్రసాదరావు** | -31 |
| **సాహితీ చరిత్ర :** పండితారాధ్యచరిత్ర... **-డా॥.జె.వి.సత్యవాణి** | -33 |
| **తెనుగులెంక సూక్తులు-6 :** .........**-నాగభైరవ ఆదినారాయణ** | -36 |
| **మనసులో మాట :** అవును..అసహనమే **-డా॥వావిలాల సుబ్బారావు** | -37 |
| **నివాళి :** కోస్తావాణి సంపాదకులు 'చింతల' **-సన్నిధానం నరసింహశర్మ** | -39 |
| **ఇతర రాష్ట్రాల్లో తెలుగు :** ....తెలుగు పాఠశాలలు **-బద్రి కూర్మారావు** | -41 |
| **అనువాదం :** అనువదింప వీలు కాని పదాలు **-దుగ్గిరాల రాజకిషోర్** | -42 |
| **సాహిత్యం:** గురజాడ నుడి-నానుడి **-పాలెపు బుచ్చిబాబు** | -43 |
| **స్మృతిమంజూష :** శ్రీశ్రీ, పంచాగ్నుల **-డా.ఆవంత్స సోమసుందర్** | -44 |
| **ప్రశ్నలు -జవాబులు :** .......................................... | -45 |
| **జనవాణి :** ................................................ | -46 |
| **పుస్తక పరిచయం :**............................................. | -47 |
| **చిత్తూరు కత :** అగ్గవ బతుకులు........**ఎండపల్లి భారతి** | |
| **కవితలు** | |
| జబ్బు ఎగిరిపోయింది..?..................**-డి.నటరాజ్** | -28 |
| వివక్షల కాడిని ఎగరదన్నే ఎద్దును........ **-కృపాకర్ మాదిగ** | -36 |
| ఎరుక.................................... **-శివ్** | -46 |



కైసేత-ముఖచిత్రం : **కలిమిశ్రీ**

రేఖాచిత్రాలు : **కిరణ్‌కుమారి**

ఫొటోలు : **టి.శ్రీనివాసరెడ్డి**

పకపకలు : **సరసి, శేఖర్**





**రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు : డాక్టర్ సామల రమేష్‌బాబు,** సంపాదకుడు, **అమ్మనుడి,**

జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com

దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

మాసపత్రిక

• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు **డా॥ సామల రమేష్‌బాబు**

శాలివాహన శకం 1937 : మన్మథనామ సంవత్సర మార్గశిర మాసము ***(ఈరాపి)** బహుళ సప్తమి శుక్రవారము నుండి పుష్యమి ***(తైందాపి)** బహుళ సప్తమి ఆదివారము వరకు

* **ఈరాపి** * **తైందాపి** : తెలుగు నెలలు


## చందా వివరాలు

| | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|
| శాశ్వత చందా : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**AMMA NUDI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **915020010550189**

**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆ వెంటనే దయతో – చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.


చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com


**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంప గలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు తప్పనిసరి సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ – పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. మీ చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాపీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలు మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి. మీ చిరునామా మారినట్లయితే వెంటనే తెలియజేయండి.

### శాశ్వత చందాదారులకు మనవి

'నడుస్తున్నచరిత్ర'కు రు.1000/- లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వత చందా రు.5000/-లకు గాను రు.4000/- లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన.

'అమ్మనుడి'కి శాశ్వత చందాదారులుగా కొనసాగలేని వారు సాధారణ చందాదారుగా చేరి పత్రికను తెప్పించు కోవచ్చును. దయచేసి సహకరించ గోరుతున్నాము.

## 'నడుస్తున్నచరిత్ర' చందాదారులకు...

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్న చరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్న చరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటి వరకూ సరిపోతుందో - పత్రికను పెట్టి పంపే కవరుపై చిరు నామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

### వెంటనే చందాలు పంపండి

అమ్మనుడి తొలి నాలుగు సంచికలను (మార్చి, ఏప్రిల్, మే, జూన్) నడుస్తున్నచరిత్ర చందా మిగిలి ఉన్నవారికి, అయి పోయిన వారికీ కూడా పంపించాము. ఆ తర్వాత చందా మిగిలి ఉన్నవారికి, కొత్త చందాదారులకు మాత్రమే పంపిస్తున్నాము. పైన ఇచ్చిన సూచనను కొందరు గమనించి ఉండకపోవచ్చు. చూసినప్పటికీ పనుల వత్తిడిలో చందా సొమ్మును పంపించక పోయి ఉండవచ్చు. అటువంటి వారు దయచేసి వెంటనే పత్రిక చందాను పంపించి సహకరించగోరుతున్నాం.

### విన్నపం

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపి స్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందా దారులుగా చేర్చి పత్రికను శక్తిమంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారు మాదిరి ప్రతి (శాంపుల్‌కాపీ)ని కోరినచో వారికి ఉచితంగా పంప గలము. **మీ చిరునామా మారితే దయచేసి మీ కొత్త చిరునామాను వెంటనే జాబు ద్వారా గానీ ఫోను సందేశంగా గానీ ఈమెయిల్ గాని పంపండి.**



## శ్రీ సి.ఆంజనేయరెడ్డి

సెల్ : 98667 06767

రాష్ట్ర డి.జి.పి.గా పదవీ విరమణ చేసిన శ్రీ సి.ఆంజనేయరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ పర్యాటక సంస్థ ఎం.డి.గా పనిచేశారు. ఆంధ్రప్రదేశ్‌లో బౌద్ధ కేంద్రాలకు పర్యాటక ప్రాచుర్యాన్ని కల్పించారు. అమరావతి, నాగార్జున సాగర్ (బుద్ధవనం) బౌద్ధ కేంద్రాల అభివృద్ధికి చారిత్రాత్మక కృషి చేస్తున్నారు. అవి ప్రపంచస్థాయి పర్యాటక కేంద్రాలుగా విలసిల్లుతున్నాయి. ఆర్ట్స్ అండ్ లెటర్స్, ధర్మదీపం ఫౌండేషన్‌ల ద్వారా తెలుగులో ఉత్తమ సాహిత్యాన్ని వెలువరించేందుకు కృషి చేస్తున్నారు. మిసిమి పత్రికకు ప్రధాన సంపాదకుడు, బుద్ధభూమి పత్రికకు వెన్నుదన్నుగా ఉన్నారు. తెలుగు భాషోద్యమానికి ఆయన సమర్థన ఎంతో ఉంది. 2012లో తొమ్మిది డిమాండ్లతో తెలుగు భాషోద్యమ సమాఖ్య చేపట్టిన కార్యక్రమానికి మార్గదర్శనం చేసి మద్దతు ఇచ్చారు. సమస్యను ప్రభుత్వ దృష్టికి తీసుకువెళ్ళేందుకు, తెలుగుకు ప్రత్యేక మంత్రిత్వశాఖ ఏర్పాటుకు ఎంతో తోడ్పడ్డారు. నడుస్తున్నచరిత్ర పత్రికను ఎంతో అభిమా నించిన శ్రీ ఆంజనేయరెడ్డిగారు తెలుగుజాతి ట్రస్టుకు ప్రోత్సాహకులుగా విరాళాన్నిచ్చి ఆశీస్సులందించారు. ❃

## డా॥కె.వి.రమణాచారి

ఫోను : 040-23306899



ఇప్పుడు తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సలహాదారుగా ఉంటున్న డా॥కె.వి.రమణాచారి గారు నిలువెత్తు సంస్కృతీమూర్తి. నాటకం, హరికథ, నృత్యకళ తదితర అన్ని తెలుగు సాంస్కృతిక రీతుల్ని ప్రోత్సహించడంలో ఆయనకు ఆయనే సాటి. తెలుగులో పద్యసాహిత్యం మీద పరిశోధన చేసి పిహెచ్‌డిని అందుకున్నారు. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధాల విభాగ కమీషనరుగా విశిష్టమైన సేవలను అందించిన వీరు తిరుమల తిరుపతి దేవస్థానంకు కమీషనరుగా సేవలందించారు. 2012లో తెలుగు భాషోద్యమ సమాఖ్య డిమాండ్లను ప్రభుత్వ దృష్టికి తీసుకెళ్లడంలో ఎంతో శ్రద్ధ వహించారు. సమాఖ్య అధ్యక్షుడికి నాటి గౌ॥ముఖ్యమంత్రితో ప్రత్యేకంగా సమావేశ పరచి ఉద్యమానికి తోడుగా నిలిచారు. ప్రపంచ సభలలో సమాఖ్య డిమాండ్లు కొన్నిటిని ఆమోదిస్తూ గౌ॥ముఖ్యమంత్రి గారు ప్రకటన చేయడం వెనుక వీరి మద్దతు ఉంది. నడుస్తున్న చరిత్ర పత్రికను, ఇప్పుడు 'అమ్మనుడి'ని ఎంతో అభిమానించి తెలుగుజాతి ట్రస్టుకు ప్రోత్సాహకులుగా విరాళాన్నిచ్చి ఆశీస్సులందించారు. ❃

# తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరిగింది. దానినే ఇప్పుడు **అమ్మనుడి** కొనసాగిస్తున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. కొన్ని కార్యక్రమాల్ని కూడా చేపట్టవలసివుంది. ఇందుకోసం ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నమోదు చేయించాము. (92/2014).

తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలోనే కాక ఇతర రాష్ట్రాల్లోనూ, ఇతర దేశాల్లోనూ వున్న తెలుగు ప్రజలకోసం ట్రస్టు పనిచేస్తుంది.

**పుస్తకాల ప్రచురణ:** తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. త్వరలో మరికొన్ని ప్రత్యేకమైన పుస్తకాలను వెలువరించ బోతున్నాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో ఏర్పరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.




**ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | | | |
|---|---|---|---|
| ప్రోత్సాహకులు | రు. 10,000/-లు | పోషకులు | రు. 25,000/-లు |
| విశిష్ట పోషకులు | రు. 50,000/-లు | రాజ పోషకులు | రు. 1,00,000/-లు |

దాత ఫోటోను, క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము. పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి. యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.

అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136 ట్రస్టీలు : **పారుపల్లి కోదండరామయ్య** 9505298565, **డా॥వెన్నిసెట్టి సింగారావు** 9393015584, **స.వెం.రమేశ్** 8500548142, **సామల లక్ష్మణబాబు** 9440448244

# తెలుగుజాతి ట్రస్టుకు 'ప్రోత్సాహకులు'గా విరాళం అందజేసిన పెద్దలు



## శ్రీ గోగినేని నాగేశ్వరరావు, కూచిపూడి (గుంటూరు జిల్లా) ఫోన్ :9490450064

శ్రీ గోగినేని నాగేశ్వరరావు గారు గుంటూరు జిల్లా నడింపల్లి గ్రామంలో 1930 ఆగస్టు 13న జన్మించారు. 1952లో మదరాసులో బి.ఏ.చేశారు. 1960 నుండి 84 వరకు గ్రామ మునసబుగా, 1966 నుండి 77 వరకు రాష్ట్ర గ్రామోద్యోగ సంఘ అధ్యక్షుడిగా, ఆంధ్రగ్రంథాలయ ట్రస్టు ఛైర్మన్‌గా, మునిస్వామినాయుడు మునిసిపల్ హైస్కూలు కరస్పాండెంటుగా పనిచేశారు. 1980లో త్రిపురనేని రామస్వామి చౌదరి పారిశ్రామిక శిక్షణా సంస్థను నెలకొల్పారు. 1984 నుండి అంగన్‌వాడి వర్కర్స్ ట్రైనింగ్ సెంటరును నడుపుతున్నారు. తల్లి దండ్రులు శ్రీమతి సీతారామమ్మ-శ్రీ వెంకటసుబ్బారావు. భార్య శ్రీమతి హేమలతాదేవి. పెద్ద కుమార్తె శ్రీమతి యశోద-నాగార్జున విశ్వవిద్యాలయంలో అసిస్టెంటు ప్రొఫెసరుగా, చిన్నమ్మాయి శ్రీమతి భారతి-ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా, కుమారుడు దిలీప్ అమెరికాలో మానసిక వైద్యనిపుణులుగా ఉన్నారు. తెలుగుభాషోద్యమం పట్ల, అమ్మనుడి పట్ల అభిమానంతో తెలుగుజాతి ట్రస్టుకు 'ప్రోత్సాహక' విరాళం అందజేశారు.



## శ్రీ పెనుబోతు వెంకటేశ్వరరావు, మచిలీపట్నం. ఫోన్ :9490300640

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ రాష్ట్ర కార్యదర్శి బాధ్యత వరకు ఎదిగి, రెండు దశాబ్దాలపాటు కృష్ణాజిల్లా శాఖ పటిష్టతకై కృషి చేసి సంఘం పేరునే ఇంటిపేరుగా చేసుకొన్న అరుదైన యోజకులు శ్రీ పెనుబోతు వెంకటేశ్వరరావు (యుటిఎఫ్) బోధనాపటిమ గల ఆదర్శ ఉపాధ్యాయుడు. పద్యం అంటే తన ప్రాణం అని భావించే వీరు ఏడాదికి 200 పద్యాలు రాసి 'నడుస్తున్నచరిత్ర' పేరుతో ఇప్పటికి మూడు పుస్తకాలు ప్రచురించారు. తెలుగు భాషోద్యమ సమాఖ్య స్థాపన నాటి నుండీ కార్యవర్గ సభ్యుడిగా ఉండి మచిలీపట్నం శాఖను స్థాపించి నిరంతరం ఎన్నో కార్యక్రమాలు నిర్వహించారు. ఉద్యోగ విరమణ తర్వాత కూడా మచిలీపట్నంలో భాషా సాంస్కృతిక కార్యక్రమాలతో మమేకమై సాహితీసేవ చేస్తున్నారు. నడుస్తున్న చరిత్రకు శాశ్వత చందాదారులు. పత్రిక 'అమ్మనుడి'గా రూపాంతరం చెందాక కూడా ఈ పత్రిక వర్ధిల్లాలని కోరుతూ తెలుగుజాతి ట్రస్టుకు 'ప్రోత్సాహక' విరాళం అందజేశారు.

## శ్రీ కోదారి నరసింహారావు, హైదరాబాదు. ఫోన్ :9000646471



చిన్నతనం నుండి తెలుగంటే మక్కువ కలిగి పుస్తకాలు చదివే అలవాటును పెంచుకొని ఒక సాంస్కృతిక జీవితాన్ని పెంపొందించుకున్నారు. వీరి తొలి కవిత 'అతడు' అమ్మనుడి డిసెంబరు సంచికలో వచ్చింది. వృత్తిరీత్యా చెస్ శిక్షకుడు(కోచ్)గా సికిందరాబాదులో 'టాక్టికా చెస్ అకాడమీ'ని నడుపుతున్నారు. వీరి వద్ద శిక్షణ తీసుకొన్న క్రీడాకారులు జాతీయ, అంతర్జాతీయ పతాకాలను సాధించారు. కళాశాలలో చదివే రోజుల్లో మిత్రుడు, తెలుగుభాషా ప్రియుడు అయిన శ్రీ బొందిలి శ్రీనివాస్‌తో ఏర్పడిన పరిచయం ఇప్పుడు అమ్మనుడితో భాషోద్యమంతో పరిచయానికి దారి తీసింది. "స్వార్థ గానము మానరా..ఓ కవీ! సార్థకానికి పూనరా!' 'లోకాలనూగించవా! ఓ కవీ! శోకాల తొలగించవా!" అని ప్రబోధించిన తాపీ ధర్మారావు గారి రచనలు తనకు కొండంత బలం అంటున్న శ్రీ నరసింహారావు 1971 మార్చి 8న గుంటూరులో పుట్టారు. అమ్మ సావిత్రి, నాన్న కొండయ్య, భార్య మాధవి, ఇద్దరు పిల్లలు. తెలుగుజాతిట్రస్టుకు ఎంతో ప్రేమతో 'ప్రోత్సాహక' విరాళం అందజేశారు.

**'అమ్మనుడి'**

(ఫిబ్రవరి ప్రత్యేక సంచిక

**అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం (ఫిబ్రవరి 21)సందర్భంగా ప్రత్యేక వ్యాసాలతో అమ్మనుడి పత్రిక ఫిబ్రవరి సంచిక వెలువడనుంది. ఇందులో ప్రచురణ నిమిత్తమై రచనలు పంపదలచిన వారు జనవరి 20వ తేదీలోపుగా వాటిని ఈ క్రింది చిరునామాకు పంపించవలసిందిగా కోరుతున్నాము.**

**డాక్టర్ సామల రమేష్‌బాబు** సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

సంపుటి : 1 సంచిక : 11
అమ్మనుడి
జనవరి 2016

సంపాదకీయం

# ప్రాథమిక విద్యను అమ్మనుడిలోనే తప్పనిసరి చెయ్యాలి

**అ**మ్మనుడి (మాతృభాష) మాధ్యమం (మీడియం) లోనే పిల్లల ప్రాథమిక విద్య ఉండితీరాలని, ఇతర భాషల్లో ప్రాథమిక విద్యను నేర్పడం పూర్తిగా అశాస్త్రీయం, అసంబద్ధం అని ఎన్నిసార్లు ఎందరు మొత్తుకుంటున్నా ప్రభుత్వానికి తలకెక్కడం లేదు. రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ ఈ పరిస్థితి భయంకరంగా ఉంది. పోటా పోటీగా రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులు, విద్యాశాఖ మంత్రులూ, ఆంగ్ల మాధ్యమంలోనే కె.జి.నుండి పి.జి.దాకా చదువులుంటాయని పదే పదే ప్రకటిస్తున్నారు. అందుకు తగ్గవిధంగా మొత్తం విద్యా వ్యవస్థను సిద్ధం చేస్తున్నారు. అటు తల్లిదండ్రులను, ఇటు ఉపాధ్యాయులను, విద్యారంగ అధికారుల్నీ ఇందుకు తగ్గట్లు ప్రభావితం చేస్తున్నారు. ఏ పార్టీ ప్రభుత్వమైనా దాదాపు 20 ఏళ్ళ నుండీ ఈ ధోరణిలోనే ముందుకు వెళ్తున్నది. కనీసం ప్రభుత్వ రంగంలోనైనా తెలుగు మాధ్యమాన్ని నిలబెట్టాలన్న విజ్ఞప్తుల్ని కూడా ప్రభుత్వం త్రోసిరాజంటున్నది. శాస్త్రీయ వాదనలు, ఉద్యమకారుల ఆందోళనలు, విద్యావేత్తల హెచ్చరికలు వేటినీ ప్రభుత్వనేతలు పట్టించుకోవటంలేదు.

వారికి చెంపపెట్టులాగా– తెలుగు రాష్ట్రాల్లో ఇటీవల జరిగిన రెండు సర్వేలూ తీర్పునిచ్చాయి. ప్రజల విస్తృతాభిప్రాయాన్ని సేకరించి సర్వేలు వెలిబుచ్చిన ఫలితాలు తెలుగు భాషోద్యమకారులకే గాక, సరియైన చూపుతో శాస్త్రీయంగా ఆలోచించే వారికి సంతోషాన్ని కలిగిస్తున్నాయి. డిసెంబరు నెలలో ఆంగ్ల పత్రిక 'ది హిందూ'తో సహా పత్రికల్లో వచ్చిన ఈ సమాచారాన్ని ఈ రెండు ప్రభుత్వాలు పట్టించుకొంటేనయినా వారి ఆలోచన మారుతుందేమో!

ఇండియన్ స్కూల్ ఆఫ్ బిజినెస్‌కు చెందిన భారతి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ పాలసీ వారు విస్తారంగా చేసిన అధ్యయనంలో– ప్రాథమిక విద్యలో విద్యార్థుల ముందడుగుకు, వారి అవగాహనాశక్తికి బోధనా మాధ్యమమే కీలకం అని తేలింది. ఇందుకోసం వారు తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లలోని 233 పాఠశాలల్లో 915 మంది ప్రాథమిక విద్యలో ఉన్న పిల్లల సామర్థ్యాన్ని, పురోగతిని అధ్యయనం చేశారు. ఇంగ్లీష్ మీడియంలో ఉన్న ప్రాథమిక విద్యార్థులకంటె తెలుగు మీడియంలో చదువుతున్న విద్యార్థులే అన్నివిధాలా మెరుగ్గా ఉన్నారని ఈ పరిశీలనలో తేలింది. పిల్లల సామాజిక ఆర్థిక స్థితితోపాటు 'గణితం'లో వారి సామర్థ్యాన్ని ఇందుకు కొలబద్దగా వారు అధ్యయనం చేశారు. తెలుగు మీడియం పాఠశాలల్లో విద్యార్థులకు సౌకర్యాలు, తగిన ఆహారపోషణ లేకపోవడం, తగినంతగా ఉపాధ్యాయులు లేక పోవడం వంటి నిరంతర సమస్యలున్నా ఈ విద్యార్థులు ఉత్తమస్థాయి జ్ఞానాన్ని పొందుతున్నారని, ఫలితాలను సాధిస్తున్నారని, ఆ అధ్యయనం ప్రకటించింది. వారి అమ్మనుడిలో వారికి చదువు అందడమే వారి పురోగతికి కారణం అని, గణితంతో సహా అన్ని బోధనాంశాలనూ (సబ్జెక్టులు) వారు బాగా అర్థంచేసుకోగలుగుతున్నారని ఆ అధ్యయనం తేల్చింది. ఈ అధ్యయనాన్ని పూర్తిగా శాస్త్రీయ, హేతుబద్ధ పద్ధతుల్లోనే నిర్వహించామని ఆ సంస్థ ప్రకటించింది. తెలుగు విద్యార్థుల కంటే ఇంగ్లీష్ మీడియం విద్యార్థుల సామాజిక ఆర్థిక స్థాయి ఎంతో ఎక్కువగా ఉందని, వారికి ఉపాధ్యాయుల సంఖ్య, బోధనాస్థాయి కూడా ఉన్నతంగా ఉందని, అయినా వారికంటె తెలుగు విద్యార్థులే జ్ఞానసముపార్జనలో ముందున్నారని ప్రకటిస్తూ, మెరుగైన, ఆహారపోషణ, సౌకర్యాలు, తగినంత మంది ఉపాధ్యాయులు లభిస్తే వారు ఇంకా ఉన్నతంగా రాణించేందుకు, తర్వాతి చదువుల్లో ఇంకా ముందడుగు వేస్తారని ఆ అధ్యయనం స్పష్టం చేసింది.

గత అక్టోబరు 22న పత్రికల్లో వచ్చిన వివరాలను బట్టి ఆంధ్రప్రదేశ్‌లో సాక్షాత్తూ ప్రభుత్వవిద్యాశాఖ రాష్ట్రవ్యాప్తంగా జరిపిన అభిప్రాయ సేకరణలో తేలిందీ ఇదే. అమ్మనుడి మాధ్యమంలోనే ప్రాథమిక స్థాయి విద్య ఉండితీరాలని 87 శాతం మంది స్పష్టం చేయగా, కేవలం 13 శాతం మంది మాత్రమే ఇంగ్లీష్ మీడియం ఉండాలన్నారు. అన్ని వర్గాల తల్లిదండ్రులు తమ పిల్లలని ఒకటో తరగతి నుంచే ఆంగ్ల మాధ్యమంలో చదివించాలని కోరుతున్నారని, అందువల్ల ప్రాథమిక విద్యలో ఒకటో తరగతి నుంచే ఆంగ్లమాధ్యమంలో తరగతుల నిర్వహణను ప్రవేశపెట్టే విషయమై విద్యాశాఖ జరిపిన అభిప్రాయ సేకరణలో తేలిన సత్యం ఇది. 13 జిల్లాల నుంచి సేకరించిన సమాచారాన్ని రాష్ట్రవిద్యా పరిశోధన

శిక్షణ సంస్థ క్రోడీకరించి రూపొందించిన నివేదిక ఈ ఫలితాలను ప్రభుత్వానికి నివేదించింది. ఇందువల్ల ప్రభుత్వం తీసుకోవలసిన చర్యల్ని కూడా ప్రజాభిప్రాయం ప్రకారం ఈ నివేదికలో వివరించారు.

కొన్ని ఉపాధ్యాయ సంఘాలు, విద్యా పరిరక్షణ వేదిక, తెలుగు భాషోద్యమ సమాఖ్య చేస్తున్న డిమాండ్లకు ఈ ప్రజాభిప్రాయం సేకరణ ఫలితాలు అద్దం పడుతున్నాయి. 1నుండి 5వ తరగతి వరకు తెలుగు మాధ్యమంలోనే చదువు సాగించాలని, 6వ తరగతి నుండి మాధ్యమాన్ని ఎన్నుకొనే స్వేచ్ఛను తల్లిదండ్రులకు విద్యార్థులకు ఇవ్వాలని, అయితే సమాంతరంగా ఇంగ్లీష్‌తో పాటు తెలుగులో కూడా బోధన సాగించాలని అందరూ కోరుతున్నారు. తగినంత మంది ఉపాధ్యాయులను నియమించి పాఠశాలల్లో సౌకర్యాలను, పిల్లలకు తగిన పోషకాహారాన్ని సమకూర్చి ప్రభుత్వం పట్టుదల చూపితే– తమ అమ్మనుడి–తెలుగులోనే తగిన శక్తి సామర్థ్యాలను సంపాదించి ఆ పునాదిపై తెలుగు పిల్లలు ఆ తర్వాత ఇంగ్లీషుతో సహా ఏ ఇతర భాషనైనా నేర్చుకోగల శక్తిని సంపాదిస్తారని, ఆ పరభాషల్లో జ్ఞాన సముపార్జనను, భావ వ్యక్తీకరణను బాగా చేయగలిగే స్థాయికి చేరుకుంటారని ఈ ప్రభుత్వాలు అర్థం చేసుకోవాలి. 'మత్తు పదార్థాలకు ప్రజలెక్కువగా మక్కువ చూపుతున్నారు గనుక వాటిని ఇంటింటికీ అందుబాటులోకి తెస్తామని' అనడం ఎంత తెలివి తక్కువ పనో పసితనం వీడని, తెలుగునేలపై తెలుగు తల్లిదండ్రులకు పుట్టి ఇక్కడి సమాజంలో పెరుగుతున్న బిడ్డలను వారి వికాసానికి ముఖ్యమైన అమ్మనుడికి దూరం చేస్తామనడం అంతకంటె క్షమించరాని నేరమే అవుతుంది. ఇప్పుడు ప్రభుత్వాలే ఈ నేరానికి పాల్పడుతున్నాయి. మన తెలుగు రాష్ట్రాల్లోని ప్రభుత్వ నేతలే కాదు, ప్రతిపక్షాల్లో ఉన్నవారు సైతం ఈ నేరానికి పాల్పడకూడదని, దీన్ని ఎదుర్కోవాలని భాషోద్యమకారులు కోరుతున్నారు.

ఈ సందర్భంలో మన రాజ్యాంగం ఏమంటున్నదో కూడా మనం పరిశీలించాలి. 350 ఎ– అధికరణం ప్రకారం "భాషాపరమైన అల్పసంఖ్యాక వర్గాల వారికి ప్రాథమిక స్థాయిలో వారి మాతృభాషలో విద్యాబోధన జరిగేందుకు అన్ని సదుపాయాలను, అవకాశాలను కల్పించడం స్థానిక రాష్ట్రప్రభుత్వాల, స్థానికసంస్థల బాధ్యత. ఇందుకు సంబంధించి రాష్ట్రాలకు రాష్ట్రపతి తగు ఆదేశములను జారీ చేయవచ్చు". ఇంత స్పష్టంగా రాజ్యాంగం ఎందుకు చెప్పిందో ప్రభుత్వాలు గమనించవద్దా? విద్య రాష్ట్రాల అధీనంలోని అంశం గనుక– రాష్ట్రప్రభుత్వాలు ఇందుకు అనుగుణంగా ఆలోచించాలి. పరరాష్ట్రంలో వున్న పిల్లలకు తమ అమ్మనుడిలో ప్రాథమిక విద్యను బోధించాలని రాజ్యాంగం నిర్దేశిస్తున్న నేపథ్యంలో అన్ని భాషారాష్ట్రాలూ తమ పిల్లలకు మాతృభాషలోనే ప్రాథమిక విద్యను అందించాలన్నది రాజ్యాంగపరంగా తప్పనిసరి అంశం అని ఎందుకు భావించరు? శాస్త్రీయంగా, హేతుబద్ధంగా, రాజ్యాంగ పరంగా కూడా ఆమోదించి తీరవలసిన ఈ అంశాన్ని ఎందుకు మనం త్రోసిపుచ్చుతున్నాం? ప్రభుత్వాలు, ప్రజలూ కూడా వెంటనే పూనుకొని, ఇంతవరకు జరిగిన తప్పును సరిచేసుకొని, జాతికి ప్రాణాధారమైన విద్యారంగాన్ని బలిష్ఠం చేసేందుకూ మన పిల్లల శక్తి సామర్థ్యాలను పెంపు చేసేందుకు– రాష్ట్రాలు, కేంద్రము కలిసి జాతీయస్థాయిలో ఒక విధానంగా 'అమ్మనుడిలో ప్రాథమిక విద్యాబోధనను తప్పనిసరి' చేస్తూ నిర్ణయం తీసుకోవాలి. అవసరమైతే ఇందుకు తగు రాజ్యాంగ సవరణను కూడా తీసుకురావాలి.

మనిషిగా మనుగడకు కీలకం భాష. ప్రపంచంలో అన్ని మాతృభాషలను కాపాడుకోవాలని యునెస్కో ఎందుకు పిలుపు ఇచ్చిందో అర్థం చేసుకొని, అందుకు తగిన విధానాలను అవలంబించకుండా, కేవలం లాంఛనంగా అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని (ఫిబ్రవరి 21) జరుపుకోవడం ఆత్మవంచనే అవుతుంది.

మళ్లీ మళ్లీ స్పష్టంగా చెప్పుకోవలసినది ఒకటే. వేలాది సంవత్సరాల చరిత్ర, భాష, సంస్కృతి, రాజకీయ మనుగడ గల జాతులు తమను తాము అన్ని విధాలా రక్షించుకోవాలి. ఇది జీవవైవిధ్యతను కాపాడుకోవడానికి, జాతుల సామరస్య మనుగడకు, బలోపేతానికి ప్రాతిపదిక. వారసత్వ రక్షణకూ, మనం మనంగా ముందడుగు వేయడానికి, విశ్వమానవులుగా ఎదగడానికీ కూడా ఇదే మార్గం. సరళీకరణ, ప్రయివేటీకరణ, అంతర్జాతీయకరణ (ఎల్.పి.జి) విధానాలు అంతర్జాతీయ అధిపత్యానికి, బలహీన జాతుల భాషల్ని, సంస్కృతిని, వారసత్వాన్ని కనుమరుగు చేయడమే లక్ష్యంగా పనిచేసే శక్తుల అధీనంలో ఉన్నాయి. అంతర్జాతీయంగానే కాదు, జాతీయస్థాయిలో, ప్రాంతీయ స్థాయిలో కూడా ఈ శక్తులు బలంగా పనిచేస్తున్నాయి. ఆ ప్రభావంలోనే రాజకీయ పార్టీలు, ప్రభుత్వాలు మునిగి తేలుతున్నాయి. దీన్ని నిరోధించాలి. ఇందుకై చేపట్టవలసిన కీలకమైన తొలి అడుగు–

అమ్మనుడిలోనే ప్రాథమిక విద్యను తప్పనిసరి చేయడం, ఇతర భాషను ఎంతగా నేర్చుకొన్నా, విద్య కొనసాగింపులోనూ అన్ని రంగాల్లోనూ అమ్మనుడిని కాపాడుకోవడం. ఇందుకోసం మనం పోరాడాలి.

**1-1-2016**

సామల రమేష్‌బాబు

భాషాశాస్త్రం

## ద్రావిడ-మంగోలు భాషల జన్యుసంబంధం

# మానవభాషల ప్రాచీన చరిత్ర

-ఆచార్య గారపాటి
ఉమామహేశ్వరరావు

**పరిచయం**

భూగోళం మీద సుమారు ఏడువేల భాషలు ఉన్నాయి. వాటిలో కొన్ని భాషలను కోట్లాది మంది మాట్లాడుతుంటే మరికొన్ని భాషలను కేవలం వేళ్లమీద లెక్కపెట్టదగినంత మంది మాత్రమే మాట్లాడుతున్నారు.

జపాను ద్వీపవాసులైన ఐనూ తెగవారూ, హిమాలయ పర్వత సానువులచెంత నివసించే కిరాంత తెగవారూ, ఇండోనేశియాలోని పపువాలో నివసించే దుస్నేరు తెగవారూ, అమెరికా వాసులైన చెమొహు ఏవి అమెరికనిండియను తెగ, అవేజాను అడవులలోని కైఖనా తెగ, బ్రెజిల్‌లోని అపియాక తెగ, పెరూలోని చమికురో తెగ, పసిఫిక్ మహా సముద్రంలోని వనువాతు ద్వీపవాసులైన లెమెరిగ్ తెగవంటి ఎన్నో తెగలలో ఐదూ పది కంటే ఎక్కువమంది మాతృభాషను మాట్లాడేవారు లేరు.

ప్రాచీన కాలంలో విస్తృతంగా వ్యవహారంలో ఉన్న కొన్నిభాషలు నేడు నామమాత్రానశిష్టాలు అయిపోయాయి. కొద్దిమంది మాత్రమే మాట్లాడే మరికొన్ని భాషలు. నేడు అతి విస్తృతంగా వ్యవహారంలోనికి వచ్చేశాయి. దీనికి కారణం తెలుసుకోవాలంటే మానవ జీవన మూలాలనూ వాటి క్రమవికాసాలనూ తప్పక పరిశీలించాలి.

మానవవికాస పరిణామక్రమంలో భాష కూడా అంతర్భాగమే. మానవ వికాసంతో బాటే మానవభాషా వికాసమూ జరుగుతోంది. వివిధ మానవ భాషలను వివరణాత్మకంగా, చారిత్రకంగా వర్గీకరించి పరిశీలించినప్పుడే మౌలికమైన వాస్తవాలు వెలుగులోనికి వస్తాయి. మానవ వికాసక్రమంలోని మూలాలను అన్వేషించే పరిశోధనలకూ, పరిశోధకులకూ ఇవే ప్రాథమిక లక్ష్యాలు.

భూగోళం మీద ఉన్న జీవ జాతుల వర్గీకరణలాంటిదే భాషా వర్గీకరణ కూడా. ఇది మానవ భాషల వంశ వృక్షాన్ని ఆవిష్కరిస్తుంది. ఇప్పుడు భూగోళంపై ఉన్న అన్ని మానవ జాతులూ (హోమో సేపియన్స్) బహుశా ఒకే మూలవంశం నుండి ఆవిర్భవించి ఉంటాయన్న అభిప్రాయం ఒకటి ఉంది. దీనిని మానవ భాషలకూ వర్తింపజేసి అవి కూడా ఇలాగే ఒకే మూలభాష నుండి పుట్టి ఉండవచ్చుననడానికి ఆస్కారం ఉంది. ఇట్లా అనుకోవడమే సహజం. ఐతే దీన్ని నిరూపించడం చాలా కష్టమే కానీ అసాధ్యంకాదు. అందుకు కొన్ని తులనాత్మక పద్ధతులు ఉన్నాయి. ఈ పద్ధతులు రెండు వందల ఏళ్ళుగా జరుగుతున్న చారిత్రక భాషాశాస్త్ర పరిశోధనలో భాగం. వాటిని ఉపయోగించి ఇక్కడ మానవ భాషా కుటుంబాన్ని "అధోశాఖలు ఉన్న వృక్షంగా" వర్గీకరించడం ఒక పద్ధతి, వివిధ నిర్దిష్ట మానవ సమూహాలు మాట్లాడే 'మాట'లను మాండలికాలుగా, వివిధ మాండలికాలను భాషలుగా, వాటిని భాషా కుటుంబాలుగా, కొన్ని భాషా కుటుంబాలను 'మహాకుటుంబాలు' గా వర్గీకరించవచ్చు. తిరిగి వీటన్నింటినీ కలిపితే అదే మూలభాషా మహావంశం. ఇదే మూలభాషా పునర్నిర్మాణ ప్రక్రియ. స్థూలంగా దీన్ని 'జాతిజన్య/జన్యజనక' పద్ధతి (ఫైలోజెనెటిక్) లేక జాతివర్గీకరణ (క్లాడిస్టిక్) పద్ధతి అనవచ్చు. ప్రస్తుతం వందకు పైగా భాషా కుటుంబాలూ పది పదిహేను భాషా మహా కుటుంబాలూ ఉన్నాయి. ఇంకా వెనక్కి వెళ్ళి వీటిని అన్నిటినీ కలిపి ఒకే మూల మానవ భాషను పునర్నిర్మించాలి. అయితే అంతటి పరిణతి నేటి శాస్త్ర పరిజ్ఞానానికి లేదు. దీనికి కొన్ని సహజ కారణాలు ఉన్నాయి. ప్రస్తుతం పుపర్నిర్మాణ పద్ధతిని అనుసరించి ఒకే భాష మాట్లాడే శాఖ నుండి వేరు పడిన ఏ రెండు భాషలైనా సరే సాధారణంగా 15,000 సంవత్సరాల తర్వాత అవి పైకి కనిపించే అన్ని సాధారణ లక్షణాలనూ దాదాపు కోల్పోవచ్చు. దీనికి కారణం భాషాపరిణామం. కనీసం 65,000 సంవత్సరాల నుండి మానవ భాషలలో మార్పులూ చేర్పులూ నిరంతరంగా అన్ని వ్యవస్థలలోనూ, శబ్ద, అర్థ, పద, వాక్యసహితంగా వస్తున్నందువల్ల మూలరూపాలు పునర్నిర్మాణానికి అందడం లేదన్నది కొంత మంది వాదన.

**నేపథ్యం :**

ఈ సమస్యను పరిష్కరించే దిశగా ప్రయత్నం జరగాలి. కానీ జరగవలసిన పరిశోధనలపట్ల ప్రస్తుతం భాషాశాస్త్రవేత్తలలో కొంత సంశయమూ మరికొంత విముఖతా రెండూ ఉన్నాయి. ఇవి అధిగమించలేనివేమీ కానేకాదని నమ్మే పండితులూ ఉన్నారు. అయితే యావత్ మానవ భాషాసమూహాన్ని కొన్ని మహా కుటుంబాలుగా వర్గీకరించడం సాధ్యమే. ఇది కొన్ని దశాబ్దాలుగా జరుగుతున్న పరిశోధనలు చెప్తున్న మాట. ఆ పరిశోధనల ప్రకారం ప్రపంచంలోని ప్రతి భాష ఏదో ఒక భాషా కుటుంబానికి చెందినదే. మహా అయితే అన్ని భాషలనూ కలిపి సుమారు రెండు డజన్ల మహా కుటుంబాలుగా వర్గీకరించవచ్చు. ఇది సాధ్యమే. దీన్ని సాధ్యం చేయడం కోసం కాల పరీక్షకు నిలబడ్డ ఒక ప్రామాణిక పద్ధతి ఉంది.

అదే, చారిత్రక భాషాశాస్త్రం అభివృద్ధి చేసిన తులన పద్ధతి. ఇది చాలా శక్తివంతమైన సాధనం. వివిధ వికాస దశలలోని అనేక మూల భాషల పునర్నిర్మాణానికి ఈ పద్ధతి వీలుకల్పిస్తుంది. సహజాత పదాల ఆధారంగా నేటి భాషలను ఒక క్రమపద్ధతిలో పోల్చి చూడటం ద్వారా ఇది సాధ్యం. గత 200 సంవత్సరాలుగా జరిగిన చారిత్రక తులనాత్మ పరిశోధనలు భాషలను కుటుంబాలుగా వర్గీకరించడం సుసాధ్యమేనని నిరూపించాయి. ఈ పరిశోధనలే ఇండో-యూరోపీయ మహా కుటుంబంతో సహా సైనో-థాయి, ఉరాలీయ, తుర్కీయ, మంగోలీయ, తుంగుస్-మంచూ, జాపనీయ, ఆస్ట్రో-ఆసియ, ఆఫ్రో-ఆసియ, ద్రావిడ, ఎస్కిమో-ఎల్యూటీయ, అమెరిండియ, న-దేనె, చుక్చి-కామచాత్కీయ, కాకసీయ, నైలో- సహారీయ, నైగర్-కార్డోఫానీయ, ఖోయసానీయ, ఆస్ట్రోనేశీయ, పపువ-ఆస్ట్రలీయ లాంటి ఎన్నో భాషాకుటుంబాల ఆవిష్కరణకు దారి తీశాయి. నేటి ఆధునిక భాషలైన ఇంగ్లీష్, హిందీల మధ్యా, తెలుగు, తుర్క్యుభాషల మధ్యా పోల్చుకోలేనంతగా తేడాలు కనపడుతున్నప్పటికీ వాటి మూలభాషలైన మూల జన్మానిక్, మూల ద్రావిడం, మూల-

హిందార్య భాషలూ, మూల తైర్క్యభాషల మధ్య ఎన్నో పోలికలు అనేక సందర్భాల్లో కనిపిస్తున్నాయి. ప్రత్యేకంగా వాటి లక్షణాలలోనూ పదజాలంలోనూ ఎన్నో సామ్యాలు ఉన్నట్లు స్పష్టమవుతోంది. అంటే ఈ సారూప్యతల ఆధారంగా 'మూల భాషా పునర్నిర్మాణ పద్ధతులను సైద్ధాంతికంగా విస్తరించుకొంటూ పోతే ప్రాచీన మానవ మూల భాషా పునర్నిర్మాణం సాధ్యమే అని అర్థమౌతోంది. నిజానికి, ఇట్లాంటి పరిశోధనలు ఇప్పటికే జరుగుతున్నాయి.

ఈ సైద్ధాంతిక పరిశీలనలకు ఆధారంగా, మానవ భాషల పరిణామంలో సంప్రదాయ తులనాత్మక పద్ధతికి అనుగుణంగా కంప్యూటరీకృత సహజాత పదకోశాల నిర్మాణమూ అలాగే మూలభాషల పునర్నిర్మాణమూ మొదలైన అనేక పరిశోధనలను చేపట్టారు. ఇటువంటివి అంతర్జాల సహజాతపద కోశాగారాలు ఇప్పటికే అందరికీ అందుబాటులో ఉన్నాయి. మరింత భాషా సమాచారాన్ని అందుబాటులోకి తెచ్చే పనిని వీటిలో వివిధ భాషా కుటుంబాలను నిర్వహించేవారు మరింత విశ్లేషణాత్మకంగా క్రమంగా విస్తరిస్తున్నారు. ప్రస్తుతం, తులనాత్మక హిందార్య భాషలూ (ఇండో యూరోపియన్), ఉరాలీయ, అల్టాయి ద్రవిడ, ఉత్తర కాకసీయ, యానిసేయియనూ, సైనో- టిబెటన్, ఆస్ట్రో -ఆసియాటిక్, చూక్సీ- కామచాత్కనూ, ఎస్కిమో, ఖోయసాన్, సెమిటిక్, ఇంకా అనేక కుటుంబాలు ఉన్నాయి. మరిన్ని సహజాత పదజాల కోశాలు ముఖ్యంగా ఆఫ్రికా అమెరికా ఖండాల భాషా కుటుంబాలకు చెందినవి తయారీ దశలోనే ఉన్నాయి.

కానీ ఈ పరిశోధనలలోని పెద్ద లోటు భాషా సంబంధిత సమాచారపు కొరత. ఈ కారణంగా మూలభాషల వివరణాత్మక పునర్నిర్మాణం కొంత కుంటుపడింది. అయినా ఈ పరిశోధనలు భాషాపరిణామం గురించిన పరిమిత నమూనాల నిర్మాణానికి కొంతవరకు అవకాశం ఇస్తున్నాయి.

అయితే దీనివలన సహజాత పదాల ఆధారంగా ఆయా భాషల మూల భాషను పునర్నిర్మాణం చేయడం సాధ్యం అవుతుందిగానీ పునర్నిర్మిత భాషాకుటుంబంలోని భాషల చావుపుట్టుకల కాలనిర్ణయం చేయడానికి వీలు పడదు. ఈ లోపాన్ని పూరిస్తూ మోరిస్ స్వాడిష్ అనే అమెరికన్ భాషాశాస్త్రజ్ఞుడు 1950-70ల మధ్య చేసిన రెండు దశాబ్దాల పరిశోధనల అనుభవంతో భాషా కాలక్రమణిక అనే పద్ధతిని ఆవిష్కరించాడు.

**మానవ భాషల జన్యు సంబంధం :**

పైకి వినపడేవి వేలకొద్దీ ఉన్నా అసలు వెనక ఉన్నది కేవలం ఒకటే భాష. ప్రపంచంలోని భాషలను చూసినప్పుడు, అవి దిగ్భ్రమపరచే విధంగా విభిన్నంగా ఉండవచ్చు. అయితే సాధారణ ప్రసార వ్యవస్థల కోణం నుండి పరిశీలిస్తే మాత్రం వాటిమధ్య ఎంతో సారూప్యత కనిపిస్తుంది. మనకు తెలిసిన అనేకానేక ఇతర జీవుల ప్రసార వ్యవస్థలకు భిన్నంగా ఉంటుంది మానవ భాష. హెర్రింగ్ పక్షులూ, తేనెటీగలూ, డాల్ఫిన్లూ లేదా ఇతర మానవేతర జంతువుల సమాచార ప్రసార వ్యవస్థలతో పోల్చి చూస్తే మానవ భాష ప్రేరణ- ప్రతిస్పందన పద్ధతులకు కట్టుబడని వ్యవస్థగా భిన్న సందేశాలను అపరిమిత పరిధులతో అనంతంగా అందించే వ్యవస్థగా కనబడుతోంది. ఇది తక్కువ ఆంశికాలతో పరిమిత వ్యవస్థతో క్రమానుగతంగానూ పునరావృతంగానూ కలగలిసి ఆపరిమిత అంశాల శబ్దార్థ శ్రేణులను సాధించే వ్యవస్థ. అర్థంలేని కొన్ని ప్రాథమిక శబ్దాల కూర్పుతో అర్థవంతమైన పదాలు ఏర్పడతాయి. మానవ భాష కొన్ని పదాలూ సూత్రాలతో కూడిన సమాచార ప్రసారణా వ్యవస్థ. **అర్థంలేని శబ్దాలనుండి ఏర్పడిన పదాలనూ వాటినుండి ఏర్పడిన పదబంధాలనూ వాక్యాలుగా ఒక పద్ధతి ప్రకారం కలిపితే అదే భాష.** ఇది సమాచార ప్రసారణకు ఉపయోగపడే మాటల రూపంలో వ్యక్తం చేయబడుతుంది. ప్రతి వ్యక్తి భాషావ్యవస్థా (తాను ప్రత్యక్ష అనుభవం ద్వారా నేర్చుకున్నదానికంటే కూడా) ఎంతో విలక్షణంగానూ వైయక్తికంగానూ ఉంటుంది. అయితే వ్యక్తుల భాషలలోని శబ్దాలూ, పదాలూ అర్థాలూ వాటి నియంత్రణ సూత్రాలు వాటినుండి ఏర్పడే అపరిమిత అవకాశాలూ (కొన్ని పరిమితులకు లోబడి) అందరికీ సమానమే. ఈ పద్ధతిలో, మానవ భాషలు ఎన్ని ఉన్నా వాటికి ఉన్న వ్యాకరణం ఒకటే. ఇది ప్రాకృతిక ప్రపంచంలోని ఇతర వ్యవస్థలకంటే కూడా చాలా భిన్నమైనది. భాష మానవుడి ఆవిష్కరణ కాదు. భాషే నరవానరాన్ని మనిషిగా నిలబెట్టింది. ప్రపంచవ్యాప్తంగా ఉన్న వివిధ భాషల వ్యాకరణాల మధ్య తేడాలు చాలా ప్రముఖంగా కనిపిస్తున్నాయి. అయినప్పటికీ అవి భాషాశాస్త్రవేత్తల దృష్టిలో సర్వసాధారణమైనవి. మాట్లాడే మనుషులనుబట్టీ భౌగోళికమైన తేడాలనుబట్టీ పరిసరాలనుబట్టీ ఇవి ఏర్పడతాయి.

**ద్రావిడ భాషలకు ఇతర భాషాకుటుంబాలతో జన్యు సంబంధం :**

ద్రావిడ భాషా కుటుంబం ఏర్పాటైన నాటి నుండే ద్రావిడ భాషలకు ఇతర భాషా కుటుంబాలతో జన్యుసంబంధం ఉందని నిరూపించడానికి చాలా ప్రయత్నాలు జరిగాయి. వాటిలో ప్రత్యేకంగా పేర్కొనదగినవి శిథియను, ఫిన్నో యుగ్రియను, అల్టాయి, ఏలమైటు, ఆఫ్రికన్- ఆస్ట్రేలియన్ భాషా కుటుంబాలు, ఉరాలీయ, తైర్కీయ, మంగొలీయ, తుస్గుస్కీయ ఉపకుటుంబ భాషలు గల ఊహాత్మక భాషా కుటుంబమే అల్టాయిక భాషాకుటుంబం. అయితే ఈ భాషలమధ్య జన్యు సంబంధం ఇప్పటివరకూ రూఢి కాలేదు. అలాంటిదే మరొకటి ఉంది. అది ద్రావిడ మరియు శిథియను భాషా కుటుంబాల మధ్య ఒక సుదూర జన్యు సంబంధం ఉంది అనేది. ఇది ఒకప్పటి ఊహ. ఒకప్పుడు ఈ రంగం గణనీయమైన సంఖ్యలో పరిశోధకుల దృష్టిని ఆకర్షించింది. (కాల్వెల్ 1857, బరో 1943, బౌదా 1953,డా. మెంజెశ్ 1969, వాచెక్ 1983, 86). అప్పటికే ఉరాలీయ అల్టాయిక కుటుంబాలమధ్య జన్యు సంబంధ ప్రతిపాదన తీవ్రమైన విమర్శలకు దారితీసింది. ఈ సందర్భంలో దాదాపు అర్ధ శతాబ్దం క్రితం ద్రావిడభాషల జన్యు ప్రకృతి గురించి బౌదా అనే ఫ్రెంచి భాషా శాస్త్రజ్ఞుడు మాట్లాడుతూ "అల్టాయిక లక్షణాలు కానివాటిని ద్రావిడ భాషలు- బహుశా భారతదేశం చేరిన తరువాత వచ్చిన ఇతర భాషా కుటుంబ ప్రభావం వలన గానీ పొంది ఉండవచ్చు" అని అన్నారు. అయితే ఇది పూర్తిగా ఊహజనితమైన ప్రతిపాదనే. నేడు ధ్రువీకరించాల్సి ఉంది. కిందటి మూడు దశాబ్దాలుగా సాగుతున్న దీర్ఘకాలిక జన్యుసంబంధాలను గురించిన తులనాత్మక పరిశోధనలు కొంతవరకు భాషా మహాకుటుంబాలను పునర్నిర్మించడానికి ఉపయోగపడతాయి. అంతేకాదు, చివరికి మానవ భాషలు అన్నీ ఒకే భాష నుండి వచ్చినవనీ లేదా ఒకే కుటుంబానికి చెందినవనీ చెప్పడానికి కూడా ప్రయత్నిస్తున్నాయి. ఇందులో భాషాశాస్త్రజ్ఞులు ఇంకా కృతకృత్యులు కాలేదనే చెప్పాలి. వీరికి వివిధ మానవ జాతులపై జరుగుతున్న జన్యుపరిశోధనలు కొంతవరకు ఉపయోగపడవచ్చు. మానవ జన్యు పరిశోధనలు తమ పరిశోధనలు వివిధ భాషా కుటుంబాలకు చెందిన భాషలు మాట్లాడే మానవ సమూహాలకు విస్తరిస్తున్నారు. భాషాకుటుం

బాల మధ్యనున్న పోలికలు, తేడాలను వారి జన్యు సారూప్యతలకు వ్యత్యాసాలకు అన్వయించి చూసే ప్రయత్నం ఇప్పుడిప్పుడే చేస్తున్నారు. వేల సంవత్సరాలుగా వలసలుగా వచ్చి చేరిన వివిధ మానవ సమూహాలూ వివిధ భాషా కుటుంబాలకు చెందిన వారి భాషలూ ఇవే నేటి భారతదేశ జన్యు పట రూపురేఖలకు కారణం. ఈ సమూహాల జన్యువులూ వారి భాషలమధ్య నిరంతరంగా జరుగుతున్న అభిసరణాత్మక పరిణామాలూ భాషల మధ్య తేడాలను తగ్గించి సారూప్యతలకు పెంచేందుకు తోడ్పడతాయి. ఇవే ఈ మానవ సమూహాల జన్యుపటాన్ని కూడా అనేక మార్పులకు లోనయ్యేటట్లు చేస్తున్నాయి. తమ (ద్రావిడ) భాషలకు మరో భాషా కుటుంబంతో సంబంధం ఉండి ఉండాలి అని అనుకోవడం మానవుడు నిరంతరంగా తన మూలాలను తెలుసుకోవాలనే తపనలో ఒక భాగమే. ద్రావిడ భాషాకుటుంబానికి వేరొక భాషాకుటుంబంతో గల సంబంధాన్ని నిరూపించే జన్యు సంబంధం వివాదానికి తావు లేకుండా ఉండాలి. అలా నిరూపించడానికి చేసే శోధన ఆచరణాత్మక వాస్తవిక దృక్పథంలో సాగాలి. దీనిని ఆలంబనగా చేసుకొని మంగోలీయ భాషాకుటుంబానికీ ద్రావిడ భాషా కుటుంబానికీ మధ్యన ఉన్న వాస్తవిక జన్యు సంబంధాన్ని ప్రామాణిక, చారిత్రక, తులనాత్మక పద్ధతుల ద్వారా నిరూపించాలి.

ద్రావిడ, మంగోలు భాషలనుండి వారసత్వంగా మాత్రమే వచ్చిన పదాలను సేకరించాలి. వాటికి మాత్రమే మూల రూపాలను నిర్మించాలి. వాటిని తులనపద్ధతుల ద్వారా మూలద్రావిడ- మంగోలు భాషారూపాలను పునర్నిర్మాణం చేయాలి. అప్పుడే ద్రావిడ, మంగోలు భాషల మధ్య ఉన్న వాస్తవిక జన్యు సంబంధాన్ని సమగ్ర సాక్ష్యాలతో స్పష్టంగా నిరూపించటానికి వీలవుతుంది. ఇదీ పద్ధతి. ఆ పద్ధతిలో సైద్ధాంతికంగా నిరూపించడానికే ఈ ప్రయత్నం. ఈ అధ్యయనంకోసం వివిధ ద్రావిడ భాషలనుండీ మంగోలీయ భాషలనుండీ రూపసామ్యం, అర్థసామ్యం కలిగిన మూడువందల యాభై సంభావ్య సహజాత పదాలతో (నామాలూ, సర్వనామాలూ, క్రియలూ మొ. వాటితో) ఒక వ్యుత్పత్తి పదకోశాన్ని తయారుచేశాం. దీని సామర్థ్యంపైనే ఈ అధ్యయనం మొత్తం ఆధారపడి ఉంటుంది.

**ద్రావిడ, మంగోలు భాషల జన్యు సంబంధం-పరిచయం :**

ద్రావిడ మరియు మంగోలు భాషల జన్యు సంబంధం గురించిన ఊహలు ద్రావిడ కుటుంబ ఆవిష్కరణం నుంచీ ఉన్నవే. ఇలాంటి చిక్కులను పరిష్కరించడానికి అనేక ప్రయత్నాలు జరిగాయి. (బౌదా 1953, మెంజేస్ 1964) ఇటీవల (వాచెక్ 1983, 1986, ఉమా మహేశ్వర రావు 2000, 2014) ప్రయత్నించారు. ప్రస్తుత గ్రంథం మంగోలీయ ద్రావిడం భాషల మధ్య 'జన్యు' సంబంధాన్ని నిరూపించే దిశలో తుల్య వర్ణ నిర్మాణంలోనూ, సహజాత పదాల గుర్తింపుతోనూ అక్రమ! సర్వాదేశ, పదాంశాల సంబంధాల రూపంలో ఆధారాలతో నిరూపించే దిశగా చేసిన మరొక ప్రయత్నం, దీనికి ఎంతో ఆసక్తికరమైన రుజువులూ లభ్యమయ్యాయి. ఇట్లా సేకరించిన ఆధారాలలో దేహాంగ వాచకాలూ, జంతువులూ వృక్షజాతుల పేర్లూ, చుట్టరికాలను తెలిపే పదాలూ అంకెలూ, దిగ్వాచకాలూ, ప్రాథమిక క్రియలూ, భావనలకు సంబంధించిన పదజాలం ఉన్నాయి. ఈ అధ్యయనం వలన కొన్ని కొత్త విషయాలు వెలుగులోకి వస్తున్నాయి. ముఖ్యంగా అవి- ఉత్తర ద్రావిడంలోని బ్రాహుయి స్థానానికి సంబంధించి కొన్నీ, ద్రావిడ, మంగోలు భాషల విశ్లేషణలో మరికొన్నీ.

ఈ అధ్యయనానికి స్వీకరించిన అనేక ప్రాథమిక వనరులలో కొన్ని ప్రధానమైనవి- ద్రావిడ వ్యుత్పత్తి నిఘంటువు (బరో మరియు ఎమెనో, 1984=ద్రావ్యని) ద్రావిడ భాషలు (కృష్ణమూర్తి, 2003, ఇంగ్లీషు) తులనాత్మక ద్రావిడ వ్యాకరణం- 1 (సుబ్రహ్మణ్యం, 2008) ద్రావిడ భాషల పదాంశ- వాక్యనిర్మాణం (సుబ్రహ్మణ్యం,2013) మంగొలీయ తులనాత్మక అధ్యయన పరిచయం (పపే, 1955=తుమంఅప) అల్టాయి భాషాశాస్త్ర పరిచయం (పపే.1965=అభప) మంగొలీయ-ఇంగ్లీషు నిఘంటువు (ఆల్టన్ గెరెల్ 1997=మఇని) కింగ్సయ్-గాన్సు మంగొలీయ వర్ణశాస్త్రం (నుగ్టెరెన్, 2011) అల్టాయ్ భాషల వ్యుత్పత్తి పదకోశం (స్తరోస్తిన్, దిబో, ముద్రక్, 2003=అభావ్యుప) మొదలైనవి సంవర్గశాస్త్ర పద్ధతి లేక వర్గీకరణ విధానపరంగా చూస్తే ద్రావిడ, మంగొలీయ భాషల నిర్మాణంలో కొన్ని సారూప్యతలు ఉన్నాయి, ఉదాహరణకు ర, ల లుగానీ సంయుక్తాక్షరాలుగానీ (స్మ, స్త, స్ప, క్ల, క్ర, త్ల, త్ర, ప్ల, ప్ర లాంటివి) పదాదిన రావు. పదాలలో వర్ణసమీకరణం ఉంటుంది (కుదురుతూ, కుదిరితివి, కుదరక లాంటివి) విభక్తులూ ఉపవిభక్తులూ ప్రత్యయాంత పదాలపై చేరడం, ప్రశ్నార్థకాలు వాక్యాంతంలో రావడం, ఇంగ్లీషులోలాగా నిర్దేశక పదాలు(ఏ,ఏన్,ది) లేకపోవడం, వాక్యంలో కర్త, కర్మ, క్రియలు ఈ పదక్రమంలోనే ఉండడం. భాషలమధ్య ఇట్లాంటి సామ్యాలు జన్యు సంబంధంతోనే గాక భౌగోళికంగా దగ్గరగా ఉండడం వలనగానీ, ద్విభాషా వ్యవహర్తల వలన గానీ ఒక భాషా కుటుంబం నుండి మరొక భాషాకుటుంబానికి సంక్రమించవచ్చు. ఉదాహరణకు, వేర్వేరు భాషాకుటుంబాలకు చెందిన ద్రావిడభాషలూ హిందార్య భాషలూ భిన్న సంవర్గ భాషలైనప్పటికీ భారత ఉపఖండంలో వేల సంవత్సరాలుగా కలిసివుండడం వలన అవి ఈనాడు ఒకే విధమైన లక్షణాలను సంతరించుకున్నాయి. ఈ కారణాలవలన సంవర్గ లక్షణాలు భాషల జన్యువర్గీకరణకు తోడ్పడవు.

-రచయిత ఫోను : 98661 28846



-డా॥మధురాంతకం నరేంద్ర

# బెంగుళూరులో సాహిత్యోత్సవం

**బెం**గుళూరు సాహిత్యోత్సవానికి ఆహ్వానం అందినప్పుడు వెళ్ళాలా వద్దా అన్న ప్రశ్నల మధ్య ఊగిసలాడక తప్పలేదు నాకు. అప్పటి సాహిత్య వాతావరణమే అందుకు కారణం. అభిప్రాయ భేదాలను సహించలేని మత దురహంకారానికీ, వాక్స్వాతంత్ర్యాన్ని తుడిచిపెట్టే హత్యలకూ నిరసనగా కొందరు రచయితలు సాహిత్య అకాడమీ అవార్డులను తిరిగి వ్వడమూ, అంతకుముందు కూడా జరిగిన మారణ హోమాలకు అదే రచయితలెందుకు స్పందించలేదని మరో వర్గం విరుచుకుపడటమూ, ఘర్‌వాపసీలాగా 'అవార్డు వాపసీ' అంటూ ప్రభుత్వమొక కొత్త నినాదాన్ని మొదలుపెట్టడమూ, వెరసి అదొక గందరగోళమైన పరిస్థితి. అయితే అటువంటి సంక్లిష్టమైన సమయంలో రచయితలెలా స్పందిస్తారో చూడ్డమూ, పాఠకుల ధోరణులను తెలుసు కోవడమూ కూడా అవసరమే. తీరా వెళితే ఎదురుచూడని రభస జరిగినా జరగవచ్చుననే అనుమానంతోనే డిసెంబరు 4వ తేదీ రాత్రికంతా



బెంగుళూరు పాత విమానాశ్రయం బాటలోని రాయల్ ఆర్కిడ్ హోటల్‌కు చేరుకున్నారు.

5వ తేదీ ఉదయం ప్రారంభోత్సవానికి అవార్డులను తిరగ్గొట్టిన వారిలో ముందున్న భారతీయాంగ నవలా రచయిత్రి శశిదేశ్ పాండేతో పాటు అకాడమీ ఉపాధ్యక్షులు చంద్రశేఖర్ కంబార ఉండడంతోనే అక్కడొక సామరస్య వాతావరణం వుందని అర్థమయింది. అనుకున్నట్టుగా శశిదేశ్ పాండే ప్రారంభోపన్యాసం అవార్డుల తిరస్కరణ అనే అంశం గురించే కొనసాగింది. "దేశమంతా చెలరేగుతున్న గోలలో రచయితల గొంతు బలహీనంగా వినపడుతోంది. దేశపు అనధికార శాసనసభ్యులైన రచయితల పట్ల ప్రభుత్వానికి అసహనం వుంటుంది. రచయితలను భయపెట్టడం కోసం హత్యల వరకూ వెళ్ళే అసహనాన్ని రచయితలెలా ప్రతిఘటించాలి? రచయితలు అవార్డులను తిరిగివ్వడం ఆ అవార్డులను అవమానించడం కాదు. అవార్డులను ప్రేమించని రచయితలుండరు. దురన్యాయాల పైన తమ నిరసనలను తెలియ జేయడం కోసం రచయితలు అవార్డులను తిరిగివ్వడం త్యాగమే. ప్రపంచాన్ని వెంటనే మార్చిపారేసే శక్తి రచయితలకు లేకపోవచ్చు. కానీ వాళ్ళు పాఠకుల ఆలోచనల పైన బలమైన ముద్రవేస్తారు. తద్వారా గొప్ప భావ విప్లవానికి బీజాలనందిస్తారు" అంటూ శశిదేశ్ పాండే నింపాదిగా, మెల్లగా మాట్లాడుతూనే తన తిరుగుబాటు బావుటా నెగరేశారు.

కొన్ని ప్రాచుర్యమున్న సమావేశాలు తప్ప మిగిలినవన్నీ రెండు వేదికలపైన సమాంతరంగా జరిగాయి. భారతీయాంగ్ల రచయితలకూ, పాత్రికేయులకూ వున్నంత ప్రాచుర్యం భారతీయ భాషా రచయితలకు లేదు. ఉపమాన్య ఛటర్జీ, శశిదేశ్ పాండేలకున్నంత పేరు ప్రఖ్యాతులు బైరప్పకూ, జయకాంతన్‌కూ వుండవు. ఒక్కోసారి పాత్రికేయ రచన లకూ, కల్పనలేని పరిశోధక రచనలకూ (non fiction) వున్న ప్రాముఖ్యత సాహిత్య రచనలకుండదు. 'నీ గీత(భగవద్గీత)ను నువ్వెలా వెతుక్కో గలవు?' అన్న చర్చలో పాల్గొన్నంతమంది ప్రేక్షకులు ఒక నవలా రచయిత రచనానుభవాలను వినాలనుకునే వారికంటే ఎక్కువ గానే వుంటారు. (గంటా అనే ప్రముఖ ఇంగ్లీషు పత్రికలో కథ ప్రచు రించబడటంతోనే ఓ రచయితకు పేరు ప్రతిష్టలు పెరిగిపోతాయి. దాదాపు పాతికేళ్ళుగా భారతీయ భాషలో రచనలు చేసిన గొప్ప రచయిత సైతం ఇటీవలే ఓ ప్రముఖ ఆంగ్ల ప్రచురణసంస్థ ప్రచురించిన తన రచనల అనువాద గ్రంథాన్నే కలికితురాయిగా ప్రదర్శించుకోవలసి వస్తోంది. ఇంగ్లీషు భాషలో అభినివేశం లేక పోవడంతో గొప్ప భారతీయ భాషా రచయితలు యెక్కడో మూలల్లో నక్కిపోతారు. పెద్దగా రచనలు చేయకపోయినా ఇంగ్లీషులో మాట్లాడే శక్తి వున్నవాళ్ళు రంగప్రవేశం చేసి ఒకేసారి అనేక పాత్రల్ని పోషించేస్తారు. భారతదేశంలో ఏ నగరంలో పుస్తకోత్స వాలు జరిగినా చివరకు ఇలాగే సాగుతుంది. మనకు మన పక్క నుండే ఇతర భారతీయ భాషల్లోని మహత్తరమైన రచయితల కంటే ఒకటి రెండు చిన్న పుస్తకాలు రాసిన ఇంగ్లీషు రచయితలే త్వరగా పరిచయమవుతారు.

దేశంలో పెరుగుతున్న అసహనాలపైనే చాలా సమావేశాలు జరిగాయి. విక్రమ్ సంపత్, సాభానక్వీ, సంచిత్ పాత్రాల చర్చంతా రచయితల భావస్వాతంత్ర్యం గురించే సాగింది. **ప్రముఖ పాత్రికేయుడు రామచంద్రగుహ మాట్లాడుతూ- ఇటీవల హత్యగావించబడిన కన్నడ రచయిత కల్బుర్గీ కంటే తానే ఎక్కువ ప్రభుత్వ వ్యతిరేకమైన మాటలు మాట్లాడాననీ, ఇంగ్లీషులో రాసే ప్రాచుర్యమున్న రచయితలకున్న అవకాశాలు భారతీయ భాషల్లో రాస్తున్న వాళ్లకు వుండవనీ మరో కొత్త పార్శ్వాన్ని విప్పి చూపాడు. విదేశీ పాలన నాటి పాత న్యాయసిద్ధాంతాలూ, తప్పుల తడకైన న్యాయవ్యవస్థా, వ్యక్తి పూజతో నిండిన రాజకీయాలూ, పోలీసు వ్యవస్థలోని లుకలుకలూ, సాహిత్యం పైన గౌరవం లేని రాజకీయ నాయకులూ, ప్రభుత్వ ప్రకటనలపైన ఆధారపడే పత్రికలూ, వ్యాపార ప్రకటనలపైన ఆధారపడే ప్రచార సాధనాలూ, స్వార్థ ప్రయోజనాలనే కోరుకునే రచయితలూ - ఈ ఎనిమిది అంశాలూ భావ స్వాతంత్ర్యానికి అడ్డంకిగా తయారయ్యాయని రామచంద్రగుహ**



**తేల్చి చెప్పాడు.**

'ఆధునికతకున్న సవాళ్ళు' అనే అంశంపైన ప్రసంగించిన రాజకీయవేత్తా, పాత్రికేయుడూ, యంజె.అక్బర్, తటస్థమైన మార్గాన్నే ఎన్నుకున్నాడు. భారతీయ రాజ్యాంగాన్ని ఆధునికతకు పర్యాయపదంగా నమ్ముతున్న అక్బర్ స్వేచ్ఛ, భావసమానత్వం, స్త్రీ పురుషుల సమానత్వం, ఆర్థిక సమానత్వం అనే అంశాలపైన ఆధునికత ఆధారపడి వుందని పేర్కొన్నాడు. రెండు రాజకీయ పక్షాలకు చెందిన సంచిత్ పాత్రా (భారతీయ జనతాపార్టీ) అశుతోష్ (అమ్ఆద్మీపార్టీ)ల సంవాదం ఆసక్తికరంగా సాగింది. ఇటువంటి సంవాదాలు జరిగినప్పుడే జొనాతన్ స్విఫ్ట్ 'గలీవర్ ట్రావెల్స్'లో సృష్టించిన రెండు రాజకీయ పార్టీల పరిస్థితి నుంచీ మనం పురోగామిస్తున్నామో, వెనక్కెళ్తున్నామో తెలిసి వస్తుంది. ప్రకటనల ప్రపంచం గురించి పీయూష్ పాండే 'భారతదేశాన్ని మళ్ళీ తొలినుంచీ ప్రారంభించడం' గురించి నందన్ నీలకనీ, విరళ్‌షాలు మాట్లాడినప్పుడు సహజంగానే పెద్ద స్పందనలు వెలువడ్డాయి.

ఇన్ని సమకాలీన రాజకీయ అంశాల మధ్యలో జరిగిన సాహిత్య చర్చలు కూడా అర్థవంతంగా సాగడమే బెంగుళూరు సాహిత్యోత్సవపు విశిష్టత. రచయిత ఎవరికోసం రాస్తున్నాడు? అనే ప్రశ్నకు మృదులగార్గ్ (హిందీ రచయిత) తాను రాస్తున్నప్పుడు పాఠకుడు గుర్తుండడంటే, జర్మన్ యువ నవలా రచయిత స్టీఫెన్ కోప్‌డ్‌స్కీ తన దేశం కోసమూ, చరిత్రను ఇష్టపడే తనదేశ ప్రజల కోసమూ రాస్తున్నానన్నాడు. ఇంగ్లీషులో రాసే శోభా నారాయణ్ ప్రత్యేకమైన పాఠకవర్గం కోసమే రాస్తానంటుంటే సిద్ధాంత ధన్వంత్ డబ్బుకోసం రాయటం ప్రారంభించానన్నాడు. 'నగ రంలో బాలిక' గురించి నలుగురు రచయిత్రులు మాట్లాడారు. రచనలో ప్రధానపాత్ర (Protagonist)ను సృష్టించడంలోని ఇబ్బందులను గురించి మరో నలుగురు రచయితలు చర్చించారు. హిందూత్వ భావ నను పునర్మిర్మించడంలోని వాస్తవాన్నీ, కల్పననూ చర్చించిన సమావేశం సంచలనంగానే కొనసాగింది. దేశ విభజనను చిత్రించిన సాహిత్యాన్ని గురించీ, ప్రపంచ యుద్ధాల ప్రభావాలను గురించీ, పుస్తక ప్రచురణలోని సాధక బాధకాల గురించీ, సాహిత్యానికీ, సినిమాలకూ వున్న సంబంధ బాంధవ్యాల గురించి, భారతీయ భాషల్లో కథానికను గురించి అపరాధ పరిశోధక రచనలను గురించీ సమావేశాలు జరిగాయి. ఇటీవలి కాలంలో బాగా సంచలనాన్ని రేకెత్తించిన నేతాజీ ఫైళ్ళ గురించీ, టిప్పు సుల్తాన్ దేశభక్తిని గురించి కూడా ప్రత్యేక సదస్సులు నిర్వహించారు. **బహుభాషా కవిసమ్మేళనంతోపాటు కన్నడ సాహిత్యానికి ప్రత్యేకమైన సమావేశాలు (రెండు మూడే అయినా) జరగడం మంచి పరిణామం. భారతీయార్ కవిత్వం గురించి, మాంటో సాహిత్యం గురించి సదస్సులు నిర్వహించిన బెంగుళూరు సోదరులు గురజాడ రచనల శతవార్షికోత్సవాలు జరుగు తున్న ఈ సమయంలో తెలుగు సాహిత్యానికివ్వవలసిన ప్రాముఖ్యత నివ్వకపోవడం పెద్ద లోటుగా స్పష్టంగా కనిపించింది.**

బెంగుళూరు సాహిత్యోత్సవం 2012లో షైనీ ఆంటోనీ (పిల్లల కథల రచయిత) విక్రమ్ సంపత్ (సాహిత్య అకాడమీ యువ పురస్కార గ్రహీత) శ్రీకృష్ణ రామమూర్తి అనే ముగ్గురు యువసాహిత్యకారుల చేత ప్రారంభించబడి అప్పటినుండి గత మూడేళ్ళుగా అంచెలంచెలుగా ఎదుగుతూ వస్తోంది. రచయితలకు స్ఫూర్తిదాయకంగానూ, పాఠకులకు ఉత్తేజకరంగానూ ఈ ఉత్సవాలు నిర్వహించడంలో ఈ ముగ్గురు మిత్రుల కృషి అభినందనీయమైంది. రాజకీయాలకు చోటులేని అచ్చమైన సాహిత్య ఉత్సవాలుగా నిర్వహించబడే ఈ ఉత్సవాలు కన్నడ ప్రజల సంస్కృతీ వైభవానికొక గొప్ప ప్రతీకగా నిలబడతాయి.

**భారతదేశంలో వివిధ నగరాల్లో నిర్వహించబడుతున్న పుస్తక మహోత్సవాల్లో భారతీయ భాషల సాహిత్యాలకు ఇంకా ఎక్కువ ప్రాముఖ్యత నివ్వవలసి వుంది. బెంగుళూరు నగరంలో వున్న తెలుగు వాళ్ళ శాతం గణనీయమైంది. అలాగే ఆ నగరంలో చాలామంది సుప్రసిద్ధులైన తెలుగు రచయితలు నివసిస్తున్నారు. వాళ్ళందరికీ సముచితమైన స్థానాన్ని ఇవ్వడం అవసరం. భారతీయ భాషలన్నీ పరస్పరం గౌరవించుకుంటూ వున్నప్పుడే మాతృభాషల అభివృద్ధి జరుగుతుంది. ఈ దిశలో కూడా ప్రయాణాన్ని ప్రారంభించిన బెంగుళూరు పుస్తకోత్సవం మరింతగా పురోగమించాలని కోరుకోవడంలో అత్యాశ లేదు.**


–మధురాంతకం నరేంద్ర

తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో

ఆంగ్లభాష ఆచార్యులు, కథా రచయిత,

విమర్శకులు, ఫోను :98662 43659




-డా॥అద్దంకి శ్రీనివాస్

తెలుగుకు తప్ప ప్రపంచంలో ఏ భాషకూ లేని గొప్ప సంకలన గ్రంథం

పద్య సాహిత్య కిరీటంలో కలికితురాయి

# వర్ణన రత్నాకరము

పద్యం తెలుగువాడి జీవనాడి. మేథాప్రతీకగా పద్యం పరుగు లెత్తాలి. ఈ మాటలు వేదికలపై బావుంటాయి. కానీ ఆచరణలో కన్పించవు. ప్రపంచంలోని ఏ భాషకూ లేని ప్రతిభా ప్రదర్శన పద్యకవిత్వ సంపదలో ఉంది. ఇది ఒక్క తెలుగుభాషకే సొంతం. ఛందోబందోబస్తు అన్నది పద్యవిద్య తెలియని వారి అపోహ. ఎటువంటి భావాన్నైనా పద్యంలో ఎంతో అందంగా చెప్పవచ్చు. వెయ్యేళ్ళ పద్యసాహిత్యం ఇది నిరూపించింది.

అటువంటి పద్యానికి పట్టం కట్టిన సంకలన గ్రంథరాజం 'వర్ణన రత్నాకరము. ఇది 8200 పద్యాల సంకలనగ్రంథం. నాలుగు సంపుటులుగా వచ్చింది. ఒకే ఒక ముద్రణకు నోచుకొంది. అదీ 80 ఏళ్ళ క్రితం. 600 పైగా కవుల వర్ణనలు అకారాదిక్రమంలో...ఇదీ ఈ సంకలనం విస్తృతీ విశేషమూ, ప్రపంచంలోనే ఇటువంటి గ్రంథం మరెక్కడా లేదు. ఇంతటి కృషి ఒక్క చేతిపై ఏ సాంకేతికత. దన్నూ లేని కాలంలో జరిగింది. నమ్మటం సాధ్యమా! ఒక జీవితకాలం వెచ్చించి సాధ్యమేనని చేసి చూపించిన ఘనుడు దాసరి లక్ష్మణస్వామినాయుడు. ఇతడే ఈ 'వర్ణన రత్నాకరము' నిర్మాత. వేంకటరామకృష్ణకవుల ప్రోత్సాహం, పన్నాల మల్లికార్జున శాస్త్రి తోడ్పాటు, తేవప్పెరుమాళ్ళయ్య, శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగార్ల పరిష్కరణలతో వర్ణన రత్నాకరం, అవిర్భవించింది. పేరు పెట్టింది తేవప్పెరుమాళ్ళయ్యగారే, శ్రీరాజారావు వెంటకకుమార మహీపతి సూర్యారావు బహద్దూరుగారు కృతి భర్త, ఆయన "సముద్రానికి ఏతమెత్తడమే ఈ కృషి" అన్నారట. పిఠాపురం రాజావారి గ్రంథాలయం, సూర్యరాయాంధ్ర నిఘంటు గ్రంథాలయం, కందుకూరి వారి పుస్తక భండాగారం వీరి పద్యసేకరణకు ఉపయోగపడ్డాయి. వేంకట రామకృష్ణ కవులు (వేదుల రామకృష్ణకవి- ఒలేటి వేంకట రామశాస్త్రి, పిఠాపురం అస్థాన గురువులు) లక్ష్మణస్వామి గురువులు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, వావిలికొలను సుబ్బారావు, సముద్రాల రంగాచార్యులు, గాడేపల్లి వేంకటశాస్త్రి, వేంటకశేషాద్రి కవులు ( గంపలగూడెం ఆస్థాన పండితులు) శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రి, మహామహోపాధ్యా శ్రీపాద కృష్ణ మూర్తి శాస్త్రి వంటి ఉద్ధండ పండితుల సాహచర్యం వీరి సాహిత్య అభిరుచికి సానపెట్టింది. దీనిని చూసి సమకాలీన సాహితీ ప్రపంచం అబ్బురపాటు పొందింది. సాహిత్యవేత్తల ప్రశంసలు వెల్లువెత్తాయి. అంత గొప్పదనం ఏ ముందీ గ్రంథంలో అంటే...

అనితరసాధ్యమైన కృషి కాలగర్భంలో కలసిపోకుండా కాపాడిందీ గ్రంథం. క్షీణయుగమని మనం పక్కనపెట్టిన కాలంలోని అక్షీణ ప్రతిభనీ సృజననీ దివిటీ పట్టి చూపించింది. కవుల ప్రతిభ, కృతులూ అనుకృతులూ, భిన్నకాలాలోని సామాజికశాస్త్రాలు ఇబ్బడిముబ్బడిగా దొరుకుతాయి. అత్యాధునిక సామాజికశాస్త్ర ఆధ్యనాలకు ఈ గ్రంథం ముడి సరుకు, నూతన పదనిర్మాణాలకు దిక్సూచి, కవితాభావ దారిద్ర్యాలకు




చెంపపెట్టు. అచ్చతెలుగు వెలుగు కిరీటానికి వజ్రకాంతి, భాషాకాల క్రమణిక మూలాలకు తల్లివేరు. పద్యశిల్పరీతులకు గాంధర్వకళ, సంస్కృతకావ్యాలలో సైతం స్పష్టంగా నిరూపితం కాని శాస్త్రీయ అంశాలకు కాణాచి.

భాషావేత్తలకూ, సాహిత్యవేత్తలకూ నిఘంటుకారులకూ, విమర్శకులకూ, సామాజిక, సాంకేతిక, వైద్య, ఆరోగ్య, సంక్షేమ, కర్మానుష్ఠాన, ధార్మిక, ఆధ్యాత్మిక, నైయాయిక, తార్కిక, ఖగోళ, జ్యోతిష, యంత్ర, తంత్ర, మంత్ర, ఉపాసక, రాజకీయ, సాంస్కృతిక, ఆర్థిక వేత్తలెందరికో ఇది కొంగుబంగారం, వారి వారి ఆలోచనలకు పదునుపెడుతుంది. పరిశోధనలకు కావలసిన ముడిసరుకునంతా ఒక చోటుకి చేర్చి అందిస్తుంది. పరిశోధకుల పని సులువైపోతుంది. శిల్పం, అభివ్యక్తి, భాష, శైలి, ఇత్యాద్యంశాలన్నీ నన్నయ నుంచి ఎలా పరిణమించాయని పరిశీలించడం ద్వారా సాహిత్య విమర్శలో కొంగొత్త ద్వారాలనూ త్వరితంగా సమగ్రంగా తెరవడానికి వీలు చిక్కుతుంది. భిన్నకాలాలలో భిన్న సంస్కృతి సంప్రదాయాలు, వాటి ఎత్తు పల్లాలు, సామాజిక స్థితిగతులు, బలాలు బలహీనతలూ ఒకటేమిటి... ఏరుకున్న వాడికి ఏరుకున్నంత, ఇన్ని సుగుణాలు ఉన్నందువల్లనే దిగ్దంతులైన ఆనాటి సాహిత్య వేత్తలందరూ ఈ గ్రంథాన్ని ఏకకంఠంతో ప్రశంసించారు.

'ఆంధ్ర సాహిత్యముకురమ్ము నాంధ్రకవిత యనెడి పైడి వన్నెలంగొనఁగషమ్ము
కవులకును రసికులకును గల్పకమ్ము ప్రథిత వర్ణన రత్నాకరమ్ము సుమ్ము'

అన్నారు జయపూర్ మహారాజు శ్రీవిక్రమదేవర్మ. శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో మేనేజరుగా ఉన్న దేవేప్పెరుమాళ్ళయ్య మనమందరం కలిసి చేసిన పనిని లక్ష్మణస్వామి ఒక్కడే చేశాడన్నారు. వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి గారు వెన్నుతట్టారు.

వీరి కష్టాన్ని గుర్తించిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారు– "నేను చాటు పద్యములను సంపాదించుటకే మిక్కిలి శ్రమ చెందితిని. మీరీ గ్రంథ సంకలనమునకై అత్యంత శ్రమ చెందియుందురని తలంచుచున్నాను. మీరు మొట్టమొదటి గ్రంథమంతయు ఒక పద్ధతిగా తయారు చేసి పిమ్మట ఆ విధమంతయు మార్పు చేసి కవికాలక్రమము ఆశ్వాస పద్య సంఖ్యాదులు సమకూర్చుట యెంతకష్టమో సామాన్య జనులూహింప జాలరు" అన్నారు. ఇది వారి కృషికి మెచ్చుకోలు. ఇది ఓలేటి వేంకట రామశాస్త్రి గారి ఆనందం. 'తెలుగుభాషను బెంపు నొందింపఁజేయ వలయు పనులెన్నొ యున్నవి వానిలోన నొకటి కావించి నీవు ధన్యుండ వైతి సూక్ష్మ బుద్ధిని దాసరి లక్ష్మణకవి' ఇది మంత్రిప్రెగడ భుజంగరావు గారి ఉబ్బితబ్బిబ్బు కాదు. సత్యం.

అల రత్నాకరమేమి యిచ్చు వలవేయన్ వల్లెవేయంగ ని
మ్ముల రత్నాకరమిద్ది యిచ్చు సమృతంబున్ బద్యరత్నంబులన్
బలుభంగంబుల కాలయం బది విపద్భంగంబు గావించు ను
జ్జ్వల రత్నాకర మిద్ది దీన దరియింపన్ జాలు లోకంబొగిన్

తాపీ ధర్మారావు, తుమ్మల సీతారామమూర్తి చౌదరి లేఖలు రాసి మరీ ఈ గ్రంథాన్ని తెప్పించుకొన్నారు. కాశీనాథుని నాగేశ్వరరావుగారు తన ఆంధ్రపత్రికలో దీనిని విశేషంగా ప్రకటించారు, విక్రమదేవవర్మ తదుపరి భాగాల కోసం ఎదురు చూస్తున్నానన్నారు, వర్ణన రత్నాకరాన్ని చూడడమే పుణ్యమన్నారు జనమంచి వేంకటకృష్ణశర్మ.

దేవప్పెరుమాళ్ళయ్య గారితో సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో పండితులుగా ఉన్న శ్రీ పురాణపండమల్లయ్యశాస్త్రి శ్రీ కూచి నరసింహం, పేరి పేరయ్య శాస్త్రి– దాసరి వారి కృషి అద్వితీయమన్నారు. ప్రోత్సహించారు. జయంతి రామయ్య పంతులుగారు సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయంలో సైతం దొరకని గ్రంథాలు దాసరి లక్ష్మణ స్వామి దగ్గర దొరుకుతాయన్నారు. ఈ గ్రంథం వల్ల తెలుగువారికీ తెలుగు సాహిత్యానికి భాషకూ ఒనగూరే ప్రయోజనాలను పెద్దలు ఇలా చెబుతున్నారు.

పూర్వోక్త గ్రంథముల కంటె వర్ణన రత్నాకరములో ననేక విశేషములు గలవు. ఉద్ధృత పద్యముల కాకరములు (location) ఆశ్వాస పద్యసంఖ్యలు– గలవు, కవి కాలక్రమానుసార సంకలన మానుషంగిక కవితా విమర్శకులకుఁ గవితా పరితామ విచారకులకుఁగరం బుపకారకము, అనన్య సామాన్యమగు లక్ష్మణకవి భగీరథ ప్రయత్న మత్యంతాభివంద్యము. **– ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు ఆంధ్ర గీర్వాణ సాహిత్య పరిషదధ్యక్షులు, విజయనగరము.**

My Dear Sir, Many thanks for the copy of your valuable book "Varnana Ratnakara" which you were good enough to present to me. It is an admirable compilation which will give people a fairly good idea of the range and beauty of Telugu poetry.

**– కట్టమంచి రామలింగారెడ్డి,**
వైస్ ఛాన్సలర్, ఆంధ్ర విశ్వవిద్యాలయము.

వీరేరి తీసిన పద్యములన్నియును రత్నములవలె ప్రకాశించుచు మనోహరముగ నున్నవి. ఈ గ్రంథము బహు గ్రంథముల సంపుటిగ నున్నది. గ్రంథమును కలిగియున్న వారందఱును మహాకవుల సాంగత్య లాభము బొందఁగలరు **– దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు,** ఆంధ్రపత్రికాధిపతులు.

ఈ యుద్యమము యొక్క ప్రయోజనము కష్టమెఱుఁగని వారికి తెలియదు. ఇట్టి గ్రంథమొకటి నాకు చిరకాలమునకు మున్ను దొరికి యుండిన మదీయ నైషధవ్యాఖ్యకు ఆముక్తమాల్యదావ్యాఖ్యకును మిక్కిలి సాయమయి యుండును.

**– వేదము వేంకటరాయశాస్త్రులు,** మహామహోపాధ్యాయ.

ఇందనేకములు రసవంతములగు పద్యములు గలవు. దీనివలన నాంధ్రకవిత్వము కాలక్రమమున నెట్లు మాఱినదో తెలిసికొనుట కవకాశము కలుగునని నా యభిప్రాయము, ఉద్యమము మంచిది.

**– జయంతి రామయ్య పంతులు,** శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు సంపాదకులు.

ఇది బాల కవులకే ప్రౌఢ కవులకును భావమార్గ ప్రదర్శనంబునను సూచనలయందును మిక్కిలి తోడు పడఁగలదు–

**వావిలకొలను సుబ్బారావు,** ఆంధ్ర వాల్మీకి.

ఈ పుస్తకము తెలుఁగు బాసలోఁ బాండిత్యము సంపాదించుకోఁ గోరు భావి విద్యార్థులకుఁ, గవులకు విమర్శకులకు నత్యంతోపకారకం బని ఇదివఱకు నభిప్రాయములొసఁగిన పండితుల యభిప్రాయముల యందలి సంగతులతో నేను గూడ నేకీభవించుచున్నాను.

**– చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి,** శతావధానులు.

ఇయ్యది కవులకు, విమర్శకులకు, చరిత్ర ప్రియులకు, భాషాభిమానులకు మిగుల సాహాయ్యకారిగా నుండటయేగాక పామర జనులకుఁగూడ నానందదాయకమ్మును, వివేకప్రదమ్మును నై యలరారు చుండును. సారస్వత విషయములగు సర్వ విశేషములును గల యిట్టి యుద్గ్రంథము, లిదివఱ కాంధ్రదేశమున లేవు. నేఁటికా కొఱంత తీరినదని చెప్పుట కెంతయు సంతసముగనున్నది

**– కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి**

ఈ గ్రంథ మొక్కఁడు చే నిడికొన్నఁ గవుల గ్రంథములన్నియుం జదివిన ఫలంబు గలుగక మానదు. కవులకును గవితాప్రియులకు నిది కల్పవృక్షము **– శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి,** కవి సార్వభౌమ.

ఇయ్యది కవిత్వముఁ జెప్పఁదలచినవారికిఁ గల్పవృక్షము వంటిద నుటకు సందేహము లేదు. వాఙ్మయ చరిత్రయు, ఆంధ్రకవిత్వాభివ్యక్తి యెట్లయినదియుఁ దెలిపికొనఁ గోరు వారికిని ఈ గ్రంథము ఎక్కువగా నుపయోగించు ననుటకు సందేహము లేదు

**– కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు.**

ఆంధ్ర కావ్యమహోదధి నుండి యేరిన జాతిరత్నములీ వర్ణనలు. ఇవి పలు విధములై ఆంధ్ర కవితా చరిత్ర పరిణామమును సూచించును

**– బుఱ్ఱా శేషగిరిరావు**

ఆంధ్ర కవితా సరస్వతి నేకముఖంబు గావించిన యీ వర్ణన రత్నాకరము మహాత్ములగు నాంధ్రమహాకవుల నందఱనొక్కచోఁ బ్రదర్శించు దివ్యజ్ఞానదీపము **– వేంకటపార్వతీశ్వర కవులు**

అనేక నూతనాలంకారములతో విరాజిల్లుచున్న యాంధ్రసారస్వత మున కిట్టి మహాగ్రంథము లేకపోవుట గొప్ప లోపము

**– చిలకమర్తి లక్ష్మీనరసింహము.**

ప్రబంధ సముద్రములో వర్ణన పద్యములు రత్నములె. అట్టి రత్నముల నుద్ధరించి యాంధ్రభాషాసేవకులకుఁ బంచి యొసంగ సాహసించి కృతార్థుఁడైన యీ లక్ష్మణస్వామిగారు ఆంధ్ర లోకమున శాశ్వత

కీర్తిఁగడించిరి. **–శేషాద్రి రమణకవులు**

ఈ గ్రంథమును మిక్కిలి జాగ్రత్తగాఁ జూచినచో నించుమించుగా నాంధ్ర గ్రంథముల రచించిన మహాకవులందఱ యాశయములు గ్రహింపవచ్చునని నా యభిప్రాయము

**– పురాణపండ మల్లయ్యశాస్త్రులు,** పిఠాపుర సంస్థాన పండితులు.

చదువరులకీ గ్రంథరాజము చదువుపట్ల స్ఫురింపఁజేయును. ఇది క్రొత్తవారికి నాంధ్రగ్రంథములయెడ నభిరుచి జనింప జేయును, కవులకును, వ్యాఖ్యాతలకును, బరమ ప్రయోజనకారి.

**–పప్పు మల్లికార్జునరావు**

ఈ గ్రంథమువలన నాంధ్రలోకమున కింకొక గొప్ప మేలు గలదు. ఏ కవియైన, దేనింగూర్చియైన నేదియొనొక పద్దెమును రచింపవలెనను తలంపుఁగొనుచో, నిందు లేని క్రొత్తభావమునకై యా కవి యన్వేషించు నట్లు చేయుచు, వినూత్న భావములు గల పద్యము లాయా కవులచే రచియింపఁబడునట్లు చేయుచు, నాంధ్రభాషాదేవిని నవనవాలంకార కలితను జేయునట్లీ గ్రంథ మొనర్పఁగలదని హృదయానంద పూర్వ కముగఁజెప్పుచున్నాను. **–చెలికాని లచ్చారావు**

వర్ణన రత్నాకరముఁ జదివినచో వర్ణనవిషయమునఁ జదువరుల కన్యగ్రంథపఠన మనవసరమనియు వర్ణనరత్నాకరముఁ జదువనిచో నన్యగ్రంథపఠన పరిశ్రమము వ్యర్థమనియుఁదలఁతురు.

**–పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి.**

దీని ఉపయోగాలు ఇవే కాక చాలా ఉన్నాయి. ఉదాహరణకు కొన్ని చూద్దాం.

సోమదేవరాజీయం– కూచిమంచి జగ్గకవి, యాదవ రాఘవ పాండవీయం– నెల్లూరి రాఘవకవి, మత్స్యపురాం– హరిభట్టు, భల్లాణ చరిత్రం –పోచిరాజు వీరన్న, షట్చక్రవర్తి చరిత్రము– మల్లారెడ్డి, ఒడయనంబి విలాసం– అజ్జరపు పేరయ్యకవి, మూర్తిత్రయోపాఖ్యానం– దంతులూరి బాపిరాజు, శ్రీరంగ మాహాత్మ్యం– కట్టావరదరాజు, నల్లాన నృసింహాచార్యులు, భైరవికవి (విడివిగా) కవిచకోరచంద్రోదయం– అల్లమరాజు రామకృష్ణకవి, కవిజన చకోర చంద్రోదయం– నారపరాజు కాంతకవి, కార్తిక మాహాత్మ్యం– కుందుర్తి వేంకటాచలకవి, కార్తిక మాస మాహాత్మ్యం– మండపాక కామేశ్వరకవి, కాళిందీ పరిణయం– శొంఠి భద్రాద్రి రామకవి, కిరాతార్జునీయం– గోపాలుని సింగయ్య, కుచేలో పాఖ్యానం– గట్టు ప్రభువు, కుబ్జాకృష్ణ విలాసం– అక్కిన ప్రగడ ప్రగడ హరిదాసు, కుమార నృసింహము–కొక్కొండ వెంకటరత్నశర్మ వంటి పేరు కూడా వినిపించని ఎందరో కవుల ప్రతిభకో గుర్తింపు... మెచ్చు కోలు. భావంలో కొత్తదనం, అభివ్యక్తిలో చురుకుదనం ఉంటేచాలు. ఏ చిన్న కవినీ వదల్లేదు. అవి లేని పెద్దకవినీ పట్టించుకోలేదు. ఇది విజ్ఞత, సంస్కారం మేళవింపుతో చేసిన సంకలనం. కవులపట్లగానీ, యుగాలపట్లగానీ, ప్రక్రియలపట్లగానీ పక్షపాతం శూన్యం, కుల, వర్గ, ప్రాంత భేదాలకు అతీతం, ప్రతిచోటా పాఠాంతరాలు చూపారు. స్పష్టంగా లేని చోట ప్రశ్నార్థకాలూ ఉంచారు.

అష్టాదశ వర్ణనానుక్రమంలో ఉన్న ఈ సంకలనంలో వర్ణనాంశా లను ఎంచుకోవటంలో దార్శనికత ఉంది. ఈ సంకలనంలో దాసరి వారి సంస్కారమూ ప్రతిఫలిస్తోంది. అశ్లీలత మచ్చుకైనా కన్పించదు. స్త్రీ అవయవబోధక పదాల స్థానంలోనూ చుక్కలే కన్పిస్తాయి. ఒక పండగకి ఒక పిండివంట మాత్రమే తినటం కావ్యం. ఒకే పండక్కి అన్ని రకాల పిండివంటలూ తినటం వర్ణన రత్నాకరం.

అడవిపందులు, ఆటవికులు, ఆటవికపల్లె, ఆటవిక వస్తువులు, స్త్రీలు, ఎఱుకసాని, కుమ్మరి, కోడికూత, కోళ్ళపందెము, గోఱియలు– మేకలు, గొల్లలు, గోవులు, గ్రామములు, చండాలుడు, చండాలవాటిక, చాకలి, చాకలి యిల్లు, జంగములు, జంగమురాలు, దాసర్లు, నూలు వడకుట, నేతగాడు, నేతగాని యిల్లు, బలిజెగృహము, బలిజెశెట్టి, వేట, వేటకాండ్రు, వేట సాధనములు, వేటకుక్కలు, వేటకుక్కల పేళ్ళు, శిల్పకుడు, శూద్రులు, సంత, సవారిబోయలు, సాతాని మొదలైనవెన్నో, ఇవన్నీ సామాజికాలే, ప్రాచీన కవులలోనూ సామాజిక స్పృహ, వృత్తుల పట్ల ఆటవికుల పట్ల ఆదరణ ఉందని నిరూపించడానికే దాసరివారీ పని చేశారేమోననిపిస్తుంది.

మలిముద్రణకైనా నోచుకోని ఇంతటి ఉత్కృష్టమైన గ్రంథం ఇప్పుడు పాఠకమిత్ర వ్యాఖ్యతో ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారి సంపాదకసారథ్యంలో ఈనాటి సామాన్యపాఠకుడు సైతం చదువుకొని ఆనందించే శైలిలో 15 సంపుటాలు సిద్ధమై అందుబాటులో ఉన్నాయి. ఎందరో సుప్రసిద్ధులూ, ప్రతిభావంతులూ ఈ వ్యాఖ్యాన రచనలో పాలు పంచుకొన్నారు. అన్ని సంపుటాలు యూనికోడ్‌లోనే సర్వాంగసుంద రంగా ముద్రించడం అదనపు సుగుణం. అటువంటి ఈ వర్ణన రత్నా కరం ఇప్పుడు అందరికీ కరతలామలకంలా సిద్ధంగా ఉంది. ప్రాచీన తెలుగు – అధ్యయన కేంద్రం, యూనివర్శిటీ ఆఫ్ హైదరాబాదు వారు, ఎమెస్కో–హైదరాబాదు వారు కలిసి ప్రచురించిన ఈ పుస్తకాలు అన్ని సంపుటులు కలిపి రు.3000/–లు. మొత్తం సెట్టును తీసుకున్నవారికి రు.1500/–లకే లభిస్తాయి. కావలసినవారు ఎమెస్కో బుక్స్, హైదరాబాదు–040–23264028ని గాని, సాహితీ ప్రచురణలు –విజయవాడ–0866–2436643ని గాని సంప్రదించాలి.

*–రచయిత ఫోను : 98488 81838*



## చిల్లర భవానీదేవి గారికి పురస్కారం

ప్రముఖ కవయిత్రి, రచయిత్రి శ్రీమతి చిల్లర భవానీదేవి గారికి తప్తశిల కథా సంపుటికి గుంటూరు జిల్లా రచయితల సంఘం –2015 డిసెంబరు 13 ఆదివారం నాడు గుంటూరులో పురస్కార ప్రదానం చేసింది. ఈ సభలో పెనుగొండ లక్ష్మీనారాయణ, సోమేపల్లి వెంకటసుబ్బయ్య, డా॥పి.వి.సుబ్బారావు, కొప్పర్తి, కోసూరి రవికుమార్, బొమ్ము ఉమామహేశ్వరరెడ్డి, బండికల్లు జమదగ్ని, ఎస్.ఎం.సుభాని ముందుగువారు పాల్గొన్నారు.

# మానవతకు ప్రతిరూపం-బౌద్ధశిల్పం

-డా॥బొర్రా గోవర్ధన్

**బౌద్ధశిల్పకళ :**

శిలల్ని ప్రతిమలుగా మలచడం పురాతన మానవ సమాజాల్లోనే కన్పిస్తుంది. 30 వేల సంవత్సరాల నాటి నియాండర్తల్ మానవులు మలచిన జంతువులు, మానవరూపాల ప్రతిమలు తవ్వకాల్లో దొరికాయి. మనదేశంలో కూడా భోపాల్ సమీపంలో 'భీంభెటక్' గుహల్లో 30 వేల నాటి గుహాచిత్రాలు దొరికాయి. అంటే మానవ నాగరకతా వికాసంతో పాటే మానవునిలో కళా నైపుణ్యం వికసిస్తూ వచ్చిందన్నమాట.

మానవులు రాళ్ళమీద, చెక్కమీద శిల్పాలు చెక్కేవారు. చెక్క శిల్పాలన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి. రాతిశిల్పాలు ఈనాటికీ ఆనాటి చరిత్రను మన కళ్ళకు చూపిస్తూ నిలిచిపోయాయి.

అలా గతకాలపు ప్రాభవాన్ని మనముందు నిల్పిన శిల్పసంపదలో బౌద్ధశిల్పాలే ముందుంటాయి. బౌద్ధం కంటే ముందే సింధూ నాగరకతలోని హరప్పా శిల్పాలు దొరికాయి. కానీ వారు చెక్కను ఎక్కువగా వాడటం వల్ల అవేవీ దొరక్కుండానే పోయాయి.

బౌద్ధ శిల్పకళ పుట్టే నాటికి ఈజిప్టు, గ్రీకు, రోమ్‌లలో శిల్పకళ ఉంది.కానీ భారతీయ బౌద్ధ శిల్పకళకున్న నైపుణ్యం, సృజన ఆనాటి మరే శిల్పకళలో కానరావు.

బౌద్ధ శిల్పకళా ఆవాసాలన్నీ చైత్యాలూ, స్తూపాలూ, ఆరామాలే. దుర్మార్గుల దౌష్ట్యానికో, లేక కాలం చూపిన నిర్లక్ష్యానికో కనుమరుగు కావాల్సిన ఈ వెలకట్టలేని సంపదని నేలతల్లి తన ఒడిలో ఛిద్రం కాకుండా భద్రంగా దాచుకుంది. ఇలా దాగిన ఈ స్తూపాలు, విహారాలు తమతోపాటు ఎనలేని శిల్పకళాసంపదని మన కందించాయి. ఇందుకు...మన తెలుగునేలతో పాటు...అఖండ భారతఖండంతో పాటు, ప్రపంచం కూడా బౌద్ధానికి జేజేలు పలకాల్సిందే.

బౌద్ధులు ఈ శిల్పకళను తమ ధమ్మవ్యాప్తిలో ఒక భాగంగా చూశారు. రాళ్ళకు భావాలు అద్ది ధమ్మ వ్యాప్తి కావించారు. అశోకుడు ఈ శిల్పకళ ద్వారా బౌద్ధ ప్రచారాన్ని ముమ్మరం చేశాడు. ఆ తర్వాత ఎందరో బౌద్ధాన్ని ప్రేమించిన రాజులు, చక్రవర్తులు తమ తమ వంతుగా శిల్పకళా సంప్రదాయాన్ని కొనసాగించారు. అశోకుని తర్వాత ఒక వెయ్యి సంవత్సరాలు బౌద్ధశిల్పకళతో ఈ దేశం కళకళలాడింది. ఈనాడు మనం సగర్వంగా చెప్పుకునే శిల్ప సంపదంతా దాదాపుగా ఆనాటిదే.

శరీర ధాతువుల మీద స్మృతిచిహ్నాలు నిర్మించే సంప్రదాయం బుద్ధుని ధాతువులతోనే మొదలుకాలేదు. ఈ సంప్రదాయం మన తెలుగు నేలమీద రాక్షసగుళ్ళ రూపంలో ఉండేదని గతంలో చెప్పుకున్నాం. ఐతే ఈ సంప్రదాయం బౌద్ధంతో పెద్ద పెద్ద స్మృతిచిహ్నాల నిర్మాణానికీ, వాటిని శిల్పాలతో అలంకరించే సంప్రదాయానికీ తెరతీసింది.

బౌద్ధంలో ఈ చిహ్నాలు ప్రధానంగా మూడు రకాలు. 1) స్తూపాలు, 2) చైత్యాలు, 3) ఆరామాలు.



*వైశాలిలో బుద్ధ ధాతువుల మీద లిచ్ఛవులు నిర్మించిన మట్టి స్తూపం (క్రీ.పూ. 5వ శతాబ్దం)*

**బౌద్ధశిల్పకళా రీతులు**

ఇతర ప్రాంతం లాగా మన తెలుగునేల కూడా వీటి నిర్మాణంలో ముందుంది.

మొత్తం బౌద్ధ శిల్ప కళారీతులు ప్రధానంగా మూడు. అవి అశోకుని కాలం నాటి గాంధార శిల్పరీతి. ఇది ఇండో గ్రీకు శిల్పరీతుల కలయిక గాంధార శిల్పకళ. ఆ తర్వాతది మధుర శిల్పకళ. మూడోది అమరావతి శిల్పకళ. ఈ అమరావతి శిల్పకళలో మొదట్లో గాంధార శిల్పకళా రీతులు కొద్దికొద్దిగా కన్పించినా క్రమంగా తెలుగు బౌద్ధశిల్పులు తమకంటూ ఒక ప్రత్యేక శిల్పకళారీతిని రూపొందించుకున్నారు. ఆ తర్వాత ఈ అమరావతి శిల్పకళా సంప్రదాయం బౌద్ధంతోపాటు ప్రపంచ వ్యాపితం అయ్యింది.

**బుద్ధుని ధాతువుల కోసం...**

బుద్ధుడు కుసీనగరంలో పరినిర్వాణం పొందాడు. ఇది మల్లుల రాజధాని. ఆ నాటికి రెండు రకాల రాజ్యాలుండేవి. ఏక కేంద్రరాజ్యాలు, గణతంత్ర రాజ్యాలు. చక్రవర్తుల నియంతృత్వంలో ఉన్నవి ఏకకేంద్ర రాజులు. అవి మగధ, కోసల అనే రెండు రాజ్యాలు. ఇక ప్రజాస్వామ్య రాజ్యాలుగా ఉన్న మల్ల, లిచ్ఛవి, కొలియ, శాక్య రాజ్యాలు. ఇవి పద్నాలుగు గణరాజ్యాలు. ఈ పద్నాలుగు గణరాజ్యాల్లో బుద్ధుని కాలం నాటికి దాదాపుగా పదిగణరాజ్యాలు స్వయం ప్రతిపత్తిని కోల్పోయాయి. ఈ గణరాజ్యాలపై కోసల, మగధ రాజ్యాల ఏలుబడి పరోక్షంగా కొనసాగుతూ ఉండేది. వైశాలి (లిచ్ఛవి), మల్ల రాజ్యాలు రెండు మాత్రం ఏకకేంద్ర రాజ్యాల్ని ఎదిరించి గట్టిగా నిలబడ్డాయి.

బుద్ధునికి ప్రజాస్వామ్యం, గణతంత్ర విధానాలంటే ఎంతో ఇష్టం. వ్యక్తి నియంతృత్వంతో నడిచే ఏకకేంద్రాల పాలనా విధానానికి వ్యతిరేకి. కాబట్టి తన మరణం గణతంత్ర రాజ్యంలోనే జరగాలని ఆయన కోరిక.

అందుకే ఆరోగ్యం క్షీణించిన వెంటనే మగధ నుండి వైశాలికి వచ్చేవాడు. వైశాలిలో కొంతకాలం ఉండి , అక్కడి నుండి మల్లరాజ్యం వచ్చి, దాని రాజధాని కుసీనగరంలో తన ఆఖరి సందేశం వినిపించి నిర్వాణం పొందాడు.

బుద్ధుడు తన పార్థివ దేహాన్ని దహనం చేయమని చెప్పాడు. బుద్ధుని మరణవార్త విని 7 రాజ్యాల వారు వచ్చారు. అందరూ వచ్చే వరకూ వారం రోజులు ప్రత్యేకమైన తైలంలో బుద్ధుని దేహాన్ని భద్ర పరిచారు. ఈ ఏడుగురు రాజులకూ 'దహనం' విషయంలో గొడవలు వచ్చాయి. 'మా రాజ్యంలో దహన సంస్కారాలు జరగాలంటే..మా రాజ్యంలో జరగాలని' తగాదా పడ్డారు. చివరికి ద్రోణుడు అనే పండి తుడు వారందరికీ మధ్యవర్తిగా ఉండి, దహనం తర్వాత వచ్చే అస్థికలను సమానంగా పంచుకునే ఒప్పందం చేస్తాడు. ఇలా తగాదా నివారించి నందుకు తనకూ ఒక వాటా కోరాడు. అలా బుద్ధుని అస్థికల్ని ఎనిమిది మంది పంచుకున్నారు. (ఈ విషయం మీద పూర్తి సమాచారం కావలసిన వారు డా॥ఈమని శివనాగిరెడ్డి గారి 'బుద్ధుని చివరి రోజులు' పుస్తకం చూడగలరు)

ఈ పంచుకొన్న అస్థికల మీద మొట్ట మొదటగా స్తూపాలు నిర్మించారు. వీటిలో ఈనాటికి బయల్పడిన అతి ప్రాచీన స్తూపం వైశాలిలో లిచ్ఛవులు నిర్మించిన మట్టిస్తూపం. మిగిలిన ఏడు ఎవరు అస్థికల్ని పంచుకుని తీసుకెళ్ళారో తెలిసింది గానీ, వారు నిర్మిం చిన స్థూపాలు ఎక్కడెక్కడున్నాయో ఇంకా బైటపడలేదు. అయితే ఆ తర్వాత అశోకుడు ఈ ఎనిమిది స్తూపాలలో ఉన్న బుద్ధుని అస్థి కల్ని సేకరించి వాటితో వేలాది స్తూపాలు నిర్మించాడు. అశోకుడు త్రిపిటకాల్లో ఉన్న 84 వేల గాథలకు(శ్లోకాలకు) చిహ్నంగా 84 వేల స్తూపాలు నిర్మించాడు. ఇవన్నీ బుద్ధుని నిజమైన అస్థికల మీదే నిర్మించారా అనేది సంశయమే. ఈ 84 వేల స్తూపాల్లో ఐదు స్తూపాలు మహాస్తూపాలు. అవి సారనాథ్, సాంచి, బార్హుత్, భట్టిప్రోలు, అమరావతి. ఈ ఐదింటిలో రెండు తెలుగు నేలమీదే ఉండటం విశేషం.

**బుద్ధ ధాతువుల్ని పంచుకున్న వారు.**

1. వైశాలికి చెందిన లిచ్ఛవులు
2. మగధ రాజు అజాతశత్రు.
3. కపిలవస్తుకు చెందిన శాక్యులు
4. అలకప్పకు చెందిన బులియులు
5. రామగ్రామానికి చెందిన కొలియులు
7. పావా, కుసీనగరలకు చెందిన మల్లులు
8. మధ్యవర్తిగా వ్యవహరించిన ద్రోణపండితుడు

**స్తూపాలు :**

'స్తూప్' అంటే ప్రోగు చేయడం అని. అంటే శరీర ధాతువుల్ని ప్రోగుచేసి వాటిమీద ఇటుకలతో నిర్మించిన కట్టడం అని. మట్టితో, కొండల్ని తొలిచి నిర్మించిన స్తూపాలు కూడా ఉన్నాయి. ఈ స్తూపాలు 4 రకాలు.

**1. ధాతుగర్భాలు :** వీటిని శారీరక స్తూపాలు అంటారు. బుద్ధుని శరీర ధాతువుల మీద గానీ, లేదా ప్రసిద్ధ బౌద్ధభిక్షువుల శరీర ధాతువుల మీద గానీ నిర్మించిన స్తూపాలు. 'ధాతుగర్భం' అనే పదమే బర్మా, శ్రీలంక ప్రాంతాల్లో 'డాగోబా'గా మారింది. మనం దిబ్బ అంటాం. మన తెలుగునేలమీద ప్రసిద్ధి పొందిన భట్టిప్రోలు, అమరావతి, ఆదుర్రు లాంటి స్తూపాలు ధాతుగర్భాలే.

**2. పారిభోజకాలు :** బౌద్ధ భిక్షువులు ఉపయోగించిన వస్తువుల మీద నిర్మించిన స్తూపాలు.

**3. స్మృతిచిహ్నాలు :** నిర్వాణం పొందిన భిక్షువులకు గుర్తుగా 'వారి పేరుతో' నిర్మించిన స్తూపాలు.

**4. ఉద్దేశికాలు :** బౌద్ధారాధకులు 'మేము ఒక స్తూపం నిర్మిస్తాం' అని మొక్కుకుని' అలా బౌద్ధక్షేత్రాల్లో నిర్మించిన స్తూపాలు.

**స్తూప నిర్మాణం :**

ఈ స్తూపాలు గట్టి పునాది మీద విశాలమైన వేదికను నిర్మించే వారు. అది వృత్తాకారంగా ఉంటుంది. దాని మధ్య నుండి అన్ని చివర్లకు చక్రం ఆకారంలో బలమైన పునాది గోడలు నిర్మిస్తారు. ఆ గోడలమధ్య మట్టితో గానీ, రాళ్ళతో గానీ గట్టిగా దిమ్మెస వేసి చదును చేస్తారు. ఇలా నిర్మించిన వేదికమీద అర్థవృత్తాకారంలో (బోర్లించిన గిన్నెలా) డోమ్ నిర్మిస్తారు. వివిధ స్తూపాల్లో ఈ డోమ్‌ల ఎత్తు ఐదారు అడుగుల నుండి వంద అడుగుల వరకూ ఉన్నాయి.

ఈ డోమ్ మీద ఒక చిన్న గదిలాంటి నిర్మాణం చేస్తారు. దీన్ని 'హర్మిక' అంటారు. దీనిలో ధాతువుల్ని పేటికల్లో (పెట్టెల్లో) ఉంచి భద్రపరుస్తారు. హర్మిక మీద గొడుగు నిర్మాణం ఉంటుంది. స్తూపం చుట్టూ ప్రహరీ ఉంటుంది. దానికి 4 ప్రవేశ ద్వారాలుంటాయి.

అన్ని స్తూపాలూ ఇలానే ఉండాలని లేదు. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క రకంగా ఉన్నాయి. ఉత్తర భారత దేశంలో స్తూపానికి ఉన్న ప్రవేశ ద్వారాలు 'తోరణాలు' ఆకారంలో ఉంటాయి. అంటే అటూ ఇటూ స్థంభాలు. ఆ రెండు స్థంభాల మీద ఒక దూలం లాంటి నిర్మాణం. కానీ, తెలుగునేల మీద ఉన్న ప్రవేశ ద్వారాలు మరో విధంగా ఉన్నాయి. అటూ ఇటూ ఉన్న స్థంభాల మీద 'సింహం' శిల్పాలున్నాయి. అందుకే వీటికి 'సింహద్వారాలు' అనే పేరు వచ్చింది.

**బౌద్ధచిహ్నం 'సింహం' :**

బౌద్ధక్షేత్రాల్లో 'సింహం' ప్రతీకలు ఉంటాయి. బుద్ధుణ్ణి 'శాక్య సింహుడు' అంటారు. బుద్ధుడు యువరాజుగా (సిద్ధార్థునిగా) ఉన్నప్పుడు స్వయంవరంలో విలువిద్యలో గెలిచి యశోధరను వివాహం ఆడాడు. బుద్ధుని విల్లు పేరు 'సింహహనువు'. అలాగే బుద్ధుడు పడుకునే రాతిబల్ల పేరు 'సింహశయ్య'. బుద్ధుడు నిద్రించే భంగిమ 'సింహభంగిమ'. సార నాథ్‌లో అశోకుని స్తూపం నాలుగు సింహాల స్తూపం. ఈనాటి మన జాతీయ ముద్ర అదే.

ఇలా సింహంతో బుద్ధుణ్ణి ఎందుకు పోల్చారు?

అడవిలో సింహనాదం విన్నాక అడవి నిశ్శబ్దం అయిపోతుంది. ఏ జంతువూ చప్పుడు చేయదు. అలాగే...బుద్ధుడు ప్రబోధం చేస్తుంటే ఎన్ని వేలమంది ఉన్నా సరే..సభ నిశ్శబ్దంగా ఉంటుంది. ఆయన చెప్తుంటే అంత మధురంగా ఉంటుంది. ఎలాంటి వారికైనా అనుమానాలు రావు. ఆయన చెప్పిన విషయం పైన వాద వివాదాలు ఉండవు. అంత మధుర మైన, గంభీరమైన కంఠం. పైగా ఆ రోజుల్లో ఆరుగురు తాత్విక గురు వులు ఉండేవారు. బుద్ధుని ప్రబోధాల ముందు అవన్నీ వెనక్కి పోయాయి. అందుకే బుద్ధుణ్ణి 'సింహం'తో పోలుస్తారు. సింహంలా అడ్డంకులు లేకుండా ఈ 'ధర్మం' నాలుగువైపులకూ నడిచిపోవాలని సారనాథ్‌లో నాలుగు సింహాలతో స్థంభం నిర్మించాడు అశోకుడు.

అసలు బుద్ధుణ్ణి 'సింహం' ప్రతీకగా తొలిగా చూపింది తెలుగువారే

అయ్యుండొచ్చు కూడా.

ఎందుకంటే, భట్టిప్రోలు స్తూపం క్రీ.పూ. 3-4 శతాబ్దాల నాటిది. అంటే అశోకుని కంటే పూర్వందే.

**ఆయక స్థంభాలు :**

ప్రతి స్తూపం ప్రవేశ ద్వారానికి ఎదురుగా ఒక వేదిక ఉంటుంది. దాని మీద పొడవైన ఐదు స్థంభాలు నిలబెట్టి ఉంటాయి. వీటినే ఆయక స్థంభాలంటారు. ఆయక అంటే ఎదురుగా, అడ్డంగా అని అర్థం. ఈ స్థంభాల మీద బుద్ధుని జీవితంలోని ప్రధానమైన ఐదు ఘట్టాలు (జననం, గృహత్యాగం, జ్ఞానోదయం, ధర్మచక్ర ప్రవర్తనం, పరినిర్వాణం) చెక్కి ఉంటాయి.

భారతదేశంలో అతిపెద్ద స్తూపం అమరావతి. దీని చుట్టుకొలత 600 అడుగులు. వ్యాసం 138 అడుగులు. ఎత్తు 100 అడుగులు. ప్రస్తుతం ఈ కొలతలతో అదే సైజులో నాగార్జునసాగర్ దగ్గరి 'బుద్ధ వనం'లో ఈ స్తూప నమూనాను నిర్మించారు. (ప్రముఖ బౌద్ధ ఉపాసకులు చెన్నూరు ఆంజనేయరెడ్డి గారు ఈ బుద్ధవన రూపశిల్పి)

ఈ ఆయక స్థంభాల మీద, ముఖద్వారాల మీద, చివరికి స్తూపం మీద కూడా శిల్పాలతో శిల్పాలు చెక్కారు. శిల్పాలు చెక్కిన రాళ్ళతో పొదిగారు.

ఇలా శిల్పాలతో పొదిగిన స్తూపాల్లో అమరావతి స్తూపానిది అగ్ర స్థానం. తెలుగు శిల్పులు తమకంటూ ఒక ప్రత్యేక శిల్ప రీతిని సృష్టించుకొని చెక్కిన శిల్పాలివి. అందుకే ఈ శిల్పకళారీతి 'అమరావతి' శిల్పకళా రీతిగా ప్రాచుర్యం పొందింది.

**అమరావతి శిల్పకళ:**

తెలుగు నేలమీద నుండే బౌద్ధం ప్రపంచ వ్యాపితం అయ్యింది కాబట్టి, దానితో పాటే ఈ అమరావతి శిల్పకళ కూడా ప్రపంచం నలు మూలలకీ చేరింది. ఇలా బౌద్ధం వల్ల తెలుగువారి శిల్పకళా నైపుణ్యం జగత్ విఖ్యాతి పొందింది.

విశాఖపట్టణం జిల్లా శంకరంలో (సంఖారం, సంఘారం, శంఖరం, శంఖారం) ఉన్న స్తూపం కొండని మలచిన స్తూపం. శంఖారంలో కొండని చిన్న చిన్న స్తూపాలుగా మలచిన తీరు అద్భుతం. చాలాకాలం ఆధునికులు వీటిని 'శివలింగాలు'గా భావించారు. జావా ద్వీపంలో ప్రపంచ ప్రసిద్ధి గాంచిన 'బోరోబుదురు' బౌద్ధాలయం శంఖార స్తూపాన్ని పోలినదే.

ఇలా ధాతువుల మీద స్తూపాలు నిర్మించిన తొలివారు తెలుగువారే. కాగా, వాటిమీద శిల్పాలతో అలంకరణ చేసినవారూ తెలుగువారే. అలాగే ఈ స్తూప ప్రాంతాలకి తీర్థయాత్రలు చేయడం మొదలుపెట్టిన వారూ అంధక భిక్షువులే. అంటే ఆంధ్రభిక్షువులే, తెలుగు భిక్షువులే.

తీర్థయాత్రికులుగా వచ్చిన ప్రజలకి బౌద్ధధమ్మాన్ని చెప్పాలని బుద్ధుని జీవిత విశేషాల్ని, బౌద్ధ జాతక కథల్ని శిల్పాలుగా మలచే ప్రక్రియ అవసరం అయ్యింది. ఈ విధంగా బౌద్ధ ధర్మవ్యాప్తికి 'శిల్పం' ఒక ప్రధాన కారణం అయ్యింది.

**తెలుగు బౌద్ధం, అమరావతి శిల్పకళా నైపుణ్యానికి ఎలా మెరుగులు దిద్దిందో... వచ్చే సంచికలో...**

*రచయిత ఫోను : 93906 00157*

## డా॥ఎన్.గోపి గారికి బొంబాయి ఆంధ్ర మహాసభ 'జీవన సాఫల్య పురస్కారం



కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం పూర్వపు ఉపకులపతి, కవి డా॥ఎన్.గోపి గారికి 'ది బొంబాయి ఆంధ్ర మహాసభ అండ్ జింఖానా' వారు జీవన సాఫల్య పురస్కారాన్ని ప్రదానం చేశారు. 2015 డిసెంబరు 26 శనివారం నాడు బొంబాయి ఆంధ్రమహాసభ ప్రాంగణంలో ఈ ప్రదానోత్సవ కార్యక్రమం జరిగింది. స్థానిక శాసనసభ్యులు కాళిదాస్ కొలంబ్కర్, మహాసభ అధ్యక్షులు సంఘం ఏకనాథ్, సాహిత్య విభాగం అధ్యక్షులు సంగెవేని రవీంద్ర, డి.గంగాధర్, వేముల మనోహర్, అనుమల రమేశ్, యాపురం వెంకటేశ్వర్, కొత్తపల్లి రమేశ్‌బాబు ముఖ్యఅతిథులుగా పాల్గొన్నారు. డా॥గోపి రచించిన 'పురివిప్పిన ఊపిరి' కవితా సంపుటిని ఈ సభలో ఆవిష్కరించారు.

## నశీర్ అహమ్మద్‌కు సావిత్రిబాయి పూలే పురస్కారం



పదిహేనేళ్లుగా భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను వివరిస్తూ తెలుగులో పన్నెండు పరిశోధనాత్మక చరిత్ర గ్రంథాలను, భారత ఉపఖండంలోనే వినూత్నం అని ప్రశంసలను పొందిన 'చరితార్థులు' ఆల్బమ్‌ను వెలువరించి, ఈ అంశం మీద తొలి తెలుగు చరిత్రకారుడుగా మన్ననల నందుకొంటున్న సయ్యద్ నశీర్ అహమ్మద్‌కు 'జీవిత సాఫల్య పురస్కారాన్ని' విశాఖపట్నంకు చెందిన 'సావిత్రీబాయి పూలే ఎడ్యుకేషనల్ అండ్ ఛారిటబుల్ ట్రస్టు అధ్యక్షులు డా॥గూడూరు సీతామహాలక్ష్మి ప్రకటించారు. ఈ సత్కారాన్ని హైదరాబాదులో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో జనవరి 3న ఇవ్వనున్నారు.

–చలసాని నరేంద్ర

# ఇద్దరు చంద్రుల కలయిక తెలుగు ప్రజల మేలుకోసమేనా?

రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు సంఘర్షణ రాజకీయాలకు స్వస్తి పలికి, సామరస్య పలకరించులకు దిగడం సంతోషించాల్సిన పరిణామం. ఒకరి అంతు మరొకరు చూస్తాం అని భీకర ప్రతిజ్ఞలు చేసే దశ నుండి ఒకరికి మరొకరు మర్యాదపూర్వక ఆహ్వానాలు అందించుకొనే స్థాయికి చేరుకోవడం, రాకపోకలు సాగించడం రెండు రాష్ట్రాల ప్రజలకు ఒకింత ప్రశాంతతను కలిగించే అంశాలే.

వివిధ కారణాల చేత రాజకీయంగా రెండు రాష్ట్రాలుగా మారినా, పరస్పర సహకారంతో తెలుగు ప్రజల అభివృద్ధి. వికాసం కోసం రెండు ప్రభుత్వాలు పనిచేయగవని ఆశించాం. అయితే తొలి సంవత్సరంలో రెండు రాష్ట్రాలలో ఏర్పడిన ప్రభుత్వాలు అభివృద్ధి అంశాలను గాలికి వదిలివేసి, ప్రజల భవిష్యత్తు గురించి పట్టించుకోకుండా, వ్యక్తిగత అజెండాలతో ముందుకు వెళ్ళడం రెండు ప్రభుత్వాలమధ్య తీవ్ర విఘాతం ఏర్పడటానికి దారితీసింది. పలు మౌలిక అంశాలు వివాదాస్పదం కావడంతో రెండు రాష్ట్రాల ప్రజల మధ్య శతృత్వధోరణులను రెచ్చగొట్టుకొనే పరిస్థితులు ఏర్పడ్డాయి.

నదీజలాల పంపకం కావచ్చు, ఉద్యోగుల విభజన కావచ్చు, ఎంసెట్ పరీక్షలు కావచ్చు. రాష్ట్రస్థాయి సంస్థల భవిష్యత్ కావచ్చు. చివరకు హైదరాబాద్ ఉమ్మడి రాజధానిగా కొనసాగడం కావచ్చు... రెండు రాష్ట్రాలు పరస్పరం విరోధ భావనతో వ్యవహరించడంతో ఆందోళనకర పరిస్థితులు నెలకొన్నాయి. పరస్పరం సంప్రదింపులతో సామరస్యంగా సమస్యల పరిష్కారం కోసం ప్రయత్నం చేయకుండా ప్రతి అంశంపై కేంద్రానికి ఫిర్యాదులతో గడపడం, పలు సందర్భాలలో న్యాయస్థానాలను ఆశ్రయించడం జరిగింది. అదంతా సమస్యలు మరింత జటిలం కావడానికే దారితీసింది. గవర్నర్ ఇ యస్ యల్ నరసింహన్ సమక్షంలో ఇరువురు ముఖ్యమంత్రులు యన్.చంద్రబాబునాయుడు, కె.చంద్రశేఖర రావులు రెండు, మూడు సార్లు రాజ్‌భవన్‌లో కలుసుకున్నా పరస్పర అవగాహనతో, సామరస్యంగా సమస్యల పరిష్కారానికి ఎటువంటి ప్రయత్నాలు చేయలేదు. ఒక విధంగా తమ పాలనా వైఫల్యాల నుండి ప్రజల దృష్టిని మళ్ళించడం కోసం పొరుగు రాష్ట్రం పట్ల రెచ్చగొట్టే ధోరణులతో వ్యవహరిస్తున్నారా అనే అనుమానాలు కలిగాయి.

ఇదే సమయంలో యం.యల్.సి. ఎన్నికల సందర్భంగా టి.ఆర్.యస్ సభ్యులను కొనుగోలు చేసే ప్రయత్నం తెలుగుదేశం వారు చేస్తూ చిక్కడంతో రెండు రాష్ట్రాల మధ్య సంబంధాలు మరింతగా బెడిసి కొట్టాయి. ముఖ్యమంత్రులు పరస్పరం కేసులు నమోదు చేసే స్థాయికి చేరుకున్నారు.

బ్రహ్మరుద్రాదులు ఏకమైనా చంద్రబాబునాయుడును ఎవ్వరూ కాపాడలేరని, జైలుకు వెళ్ళడం ఖాయం అని అంటూ చంద్రశేఖర రావు బహిరంగ సభలోనే గర్జించారు.

అందుకు ప్రతిగా తన టెలిఫోన్‌లను ప్రక్క ప్రభుత్వం ట్రాప్ చేస్తున్నదని ఆరోపిస్తూ చంద్రబాబు నాయుడు ఢిల్లీ నగరవీధులలో నానా హంగామా చేశారు. ముఖ్యమంత్రుల మధ్య ఈ ఘర్షణలో ఇరు రాష్ట్రాల అధికారులు కూడా పరస్పరం అనుమానంతో చూసుకొనే పరిస్థితులు నెలకొన్నాయి. హైదరాబాద్‌లో తమ రాష్ట్ర పోలీస్ స్టేషన్‌లు ఏర్పాటు చేస్తాం అంటూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రకటించింది. విభజన చట్టం ప్రకారం హైదరాబాద్‌లో శాంతి భద్రతలను గవర్నర్ పర్యవేక్షించాలని అంటూ చంద్రబాబునాయుడు డిమాండ్ చేశారు. అదెట్లాగు జరుగుతుందో చూస్తాం అంటూ తెలంగాణ ప్రభుత్వం సవాలు చేసింది.

ప్రజాస్వామ్యంలో వివాదాల పరిష్కారానికి సంప్రదింపులే అత్యుత్తమ మార్గం. న్యాయస్థానాల ద్వారా, కేంద్ర ప్రభుత్వం ద్వారా రాష్ట్రాల మధ్య వివాదాలు పరిష్కరించాలి అనుకోవడం అనుకున్నంత తేలిక కానేకాదు. కేంద్రంలో, రాష్ట్రాలలో ఒకే పార్టీ అధికారంలో ఉన్న సమయంలో కూడా బలవంతంగా రాష్ట్రాల మధ్య సమస్యల పరిష్కారం సాధ్యం కావడం లేదు. అటువంటప్పుడు కేంద్రంలో, రెండు తెలుగు రాష్ట్రాలలో విభిన్న పార్టీలు అధికారంలో ఉన్న సమయంలో ఘర్షణ వాతావరణంలో సమస్యలు పరిష్కరించడం సాధ్యం కానేకాదు. ఇటువంటి పరిస్థితులలో ఎక్కడ ఏమి జరిగిందో గాని చంద్రబాబు నాయుడు స్వయంగా చంద్రశేఖరరావు ఇంటికి వెళ్ళి ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరం అమరావతి శంకుస్థాపన ఆహ్వానం అందించడం, ఆయన పెద్ద మనస్సుతో అంగీకరించి అమరావతి వెళ్ళడం, అక్కడ ఆయనకు రాష్ట్ర ప్రభుత్వం అఖండ స్వాగతం పలకడం జరిగాయి. ఆ తరువాత తన వ్యవసాయ క్షేత్రంలో జరుపుతున్న మహాయజ్ఞంకు హాజరు కమ్మనమని చంద్రశేఖరరావు స్వయంగా విజయవాడకు వెళ్ళి చంద్రబాబునాయుడును ఆహ్వానించడం, ఆయన ఆమోదించడం చకచకా జరిగిపోయాయి. పైగా చంద్రబాబునాయుడు ఇంట్లో రావు విందు కూడా ఆరగించి వచ్చారు.

ముఖ్యమంత్రుల మధ్య సామరస్య వాతావరణం ఏర్పడటంతో రెండు రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రజలు పరస్పరం అవగాహనతో రెండు ప్రాంతాల అభివృద్ధికి సమిష్టి కృషి జరిపే విధంగా పని చేయడానికి దారితీస్తే అందరం సంతోషిస్తాం. ఇద్దరు చంద్రులు ఎందుకు కలసినా, ఎందుకు స్నేహం పెంపొదించుకొంటున్నా ఇరు రాష్ట్రాలకు అందువల్ల మేలు జరిగితే, రెండు రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఉద్రిక్త వాతావరణం వైదొలిగి సుపరిపాలన కోసం గంభీరంగా పని చేసుకోగల పరిస్థితులు నెలకొంటే అంతకన్నా మనకు కావలసినది ఏమీ ఉండదు.

**ఒకటి మాత్రం వాస్తవం. రెండు రాష్ట్రాలను అభివృద్ధిపథంలో తీసుకువెళ్ళడం కోసం పరిపాలనపై దృష్టి కేటాయించి, సమిష్టి కృషి జరపడం కోసం ఇద్దరు చంద్రులు కలవడం లేదని మాత్రం అందరికీ తెలుసు. అనివార్య రాజకీయ పరిస్థితులే అందుకు దారితీస్తున్నట్లు స్పష్టం అవుతున్నది. అందుకనే నెలకొన్న వివాదాల పరిష్కారం కోసం రెండు ప్రభుత్వాలు చిత్తశుద్ధితో, ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో పనిచేసుకొనే పరిస్థితులు కనిపించడం లేదు.**

విజయవాడ వద్ద రాజధాని నగరం సిద్ధమై, మొత్తం పాలన యంత్రాంగం అక్కడకు తరలినా తాను మాత్రం హైదరాబాద్ లోనే నివాసం ఉంటానని చంద్రబాబు నాయుడు గతంలో పలు పర్యాయాలు స్పష్టం చేశారు. అయితే అకస్మాత్తుగా తగు ఏర్పాట్లు జరుగకుండానే విజయవాడ నుండి ఆయన పరిపాలన ప్రారంభించడం, అధికార యంత్రాగం సైతం వచ్చే జూన్ 2 నాటికి ఇక్కడకు తరలి రావాలని ఆదేశాలు జారీచేయడం జరిగింది.

పరిపాలన ప్రజలకు దగ్గరలో జరగడం అత్యుత్తమం, చంద్రబాబు నాయుడు అధికారం చేపట్టినప్పుడే ఇటువంటి వైఖరిని అవలంబించి ఉంటే ఎప్పుడో జరిగి ఉండెడిది. కానీ హైదరాబాద్ పదేళ్ళపాటు ఉమ్మడి రాజధానిగా ఉంటుందని, అప్పటివరకు అక్కడే ఉంటాం అనే సంకేతాలు ఇచ్చారు. సుమారు సంవత్సరం పాటు పరిపాలనను విజయవాడ తరలింపు పట్ల ఏమాత్రం ఆసక్తి కనబరచనే లేదు.

ఇద్దరు చంద్రులు సయోధ్యకు దిగడంతో మొన్నటి వరకు తమ రాష్ట్రాల ప్రజలను రెచ్చగొట్టడానికి ఉపయోగించుకున్న వోటుకు నోటు కేసు గురించి గాని, ఫోన్ ట్యాపింగ్ కేస్ గురించి గాని ఇప్పుడు ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. అవసరమైతే తిరిగి వాటిని ఆయుధాలుగా ఉపయోగించుకోవడానికి వెనుకాడక పోవచ్చు.

**ప్రజా జీవనంలో వ్యక్తిగత రాగద్వేషాలకు అతీతంగా ప్రజలకు మేలు చేయడం కోసం, సుపరిపాలన అందించడం కోసం నాయకత్వం కృషి చేయాలి. అయితే నేడు వ్యక్తిగత ఎజెండాలే ప్రాధాన్యత సంతరింప చేసుకొంటున్నాయి. అందుకోసమే ఇద్దరు చంద్రులు ఒక అవగాహనకు వచ్చారా? పరస్పరం తమ రాజకీయ ప్రయోజనాలు కాపాడుకోవడం కోసం పరిమితం కావాలన్న నిర్ణయానికి వచ్చారా?... వంటి అనుమానాలు కలుగుతున్నాయి.**

చంద్రశేఖరరావు అమరావతి రాజధాని శంకుస్థాపనకు వెళ్ళడం– ఒక వంక కేంద్ర ప్రభుత్వంతో సంబంధాలు మెరుగు పరచుకోవడం, మరో వంక జరుగనున్న గ్రేటర్ హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికల్లో ఆంధ్ర ప్రాంతం నుండి వచ్చి ఇక్కడ స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్న వారిని ఆకట్టుకోవడం కోసం అనే అభిప్రాయం సర్వత్రా కలుగుతున్నది. తన వ్యవసాయ క్షేత్రంలో నిర్వహిస్తున్న యాగానికి స్వయంగా విజయవాడకు వెళ్లి చంద్రబాబు నాయుడును ఆహ్వానించడం వెనుక గల ఉద్దేశ్యం కూడా ఇదే అని పలువురు భావిస్తున్నారు.

ఒక అంచనా ప్రకారం హైదరాబాద్ నగరంలో 30 శాతం మంది వరకు ఆంధ్ర ప్రాంతానికి చెందిన ఓటర్లు ఉన్నారు. ఎన్నికలలో గెలుపుకు వీరి మద్దతు కీలకం అయ్యే అవకాశం ఉన్నది. వారిని ఆకట్టుకోవడం కోసం టిఆర్‌యస్ నాయకత్వం వ్యూహాత్మకంగా వ్యవహరిస్తున్నట్లు స్పష్టం అవుతున్నది. మరో వంక నోటుకు వోటు కేసులో తనను ఇరికించకుండా చేయడం కోసం చంద్రబాబు నాయుడు రాజీ దోరణిని అవలంబిస్తున్నారనే ప్రచారం జరుగుతున్నది. అందుకోసం అవసరమైతే తెలంగాణలో తెలుగుదేశం పార్టీ భవిష్యత్తును త్యాగం చేయడానికైనా సిద్ధంగా ఉన్నారనే వాదన వినిపిస్తున్నది.

ఈమధ్య టి.ఆర్.యస్‌లో చేరుతున్నట్లు ప్రచారం జరుగుతున్న హైదరాబాద్ నగరానికి చెందిన తెలుగుదేశం పార్టీ శాసనసభ్యుడు ఒకరు పార్టీ అధినేతను కలసి తనకు తెలంగాణలో అధికారపార్టీ నుండి ఆహ్వానం అందిందని తెలిపారు. పైగా "ఇద్దరు చంద్రులు ఒక అవగాహనకు వచ్చారు. ఒకొక్కరు తమ రాష్ట్రంలో అధికారాన్ని బలోపేతం చేసుకోవాలని అనుకున్నారు. అందుచేత తెలంగాణలో తెలుగుదేశం పార్టీ నామమాత్రంగానే ఉంటుంది. ఆ పార్టీకి భవిష్యత్తు ఉండదు" అని టి.ఆర్.యస్ నాయకులు చెబుతున్నారని కూడా తెలిపారు. దానితో ఆయన ఆగ్రహంతో ఊగిపోయారనుకోండి...

ప్రభుత్వాలు, అధికార పక్షాలు మారినా రెండు రాష్ట్ర ప్రభుత్వాలలో కీలక ఆర్థిక కేంద్రాలుగా మారుతున్న పారిశ్రామిక వేత్తలు, కాంట్రాక్టర్లు ఒక్కరే కావడం గమనార్హం. నాడు వై.యస్.రాజశేఖరరెడ్డి, వై.యస్ జగన్‌మోహన్ రెడ్డిలకు బినామీలుగా వ్యవహరిస్తున్నారని, వారికి పనులు జరుపకుండానే భారీ నిధులు మంజూరు చేస్తున్నారని ప్రస్తుత ముఖ్య మంత్రులు ఇద్దరూ ఆరోపణలు చేసినవారే. అయితే ఇప్పుడు ఈ రెండు ప్రభుత్వాలు వారికే యెర్ర తివాచీని పరుస్తున్నాయి. వారు గతంలో జరిపినట్లు తాము ప్రస్తావించిన అక్రమాల గురించి నామమాత్రంగా అయినా చర్యలు తీసుకున్న పాపాన పోలేదు. ఇద్దరు చంద్రుల సయోధ్యలో వారి ఆర్థిక ప్రయోజనాలు కూడా ఇమిడి ఉన్నాయని ఒక ప్రచారం జరుగుతున్నది.

ఇద్దరు చంద్రుల మధ్య సయోధ్యకు వారి వారసుల రాజకీయ ప్రయోజనాలు కూడా ప్రధానం కానున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో చంద్రబాబునాయుడు కుమారుడు లోకేష్, తెలంగాణలో చంద్రశేఖరరావు కుమారుడు కె.టి రామారావు రాజకీయ వారసత్వం కోసం ప్రభుత్వాలపై ఆధిపత్యం వహిస్తున్నారు. 2019 ఎన్నికల నాటికి వారసులుగా ప్రజల ముందుకు వచ్చే అవకాశం ఉన్నది. ఇటువంటి పరిస్థితులలో తండ్రులు విద్వేషాలతో రగలిపోతుంటే పరిపాలన వైపు నుండి దృష్టిని మళ్ళించవలసి వస్తుందని, అప్పుడు తమ రాజకీయ భవిష్యత్తు అయోమయం కాగలదనే ఆందోళనలు యువ నాయకులలో నెలకొనే అవకాశం లేక పోలేదు.

అయితే తమ పాలనను చూపి ఓట్లు అడిగే పరిస్థితులు లేని పక్షంలో పొరుగు రాష్ట్ర ప్రభుత్వాన్ని శత్రువుగా చిత్రీకరించి ప్రజలలో ఆవేశం నింపడానికి ఇద్దరు చంద్రులు వెనుకాడరని వారి ధోరణులు స్పష్టం చేస్తున్నాయి. వారిద్దరూ అభివృద్ధిలో, రెండు రాష్ట్రాల మధ్య నెలకొన్న వివాదాల పరిష్కారంలో ఈ సయోధ్యను ప్రదర్శించిన్నట్లయితే వారి నిజాయితీని శంకించవలసిన అవసరం ఉండదు. అయితే ఆ దిశలో ఇంతవరకు ఎటువంటి సంకేతాలు అందటంలేదు.

ఉదాహరణకు– **కేంద్ర ప్రభుత్వం నుండి తమకు ఆశించిన రీతిలో సహకారం అందటం లేదని రెండు ప్రభుత్వాలు అసంతృప్తితో ఉన్నాయి. ఇద్దరు ముఖ్యమంత్రులు కలసి సమిష్టిగా ప్రధాన మంత్రి వద్దకు వెళ్లి, రెండు రాష్ట్రాల సమస్యల గురించి ప్రస్తావించ గలిగినట్లయితే ఒక నూతన అధ్యాయాన్ని సృష్టించిన వారు కాగలరు. ఒక వినూత్న వరవడికి శ్రీకారం సృష్టించిన వారు కాగలరు. కాని, అటువంటి ఆత్రుత వారిలో కనబడటం లేదు.**

రచయిత ఫోను : 98495 69050

ఏ రాష్ట్రంలో ఉన్నా, ఏ దేశంలో ఉన్నా
తెలుగువాళ్ళంతా ఒక్కటే

-డా॥తుర్లపాటి రాజేశ్వరి

# కళింగంలో తెలుగు ప్రాచీనత

**నేటి ఒరిస్సా ఒకప్పుడు కళింగరాజ్యంగా పిలువబడిన ప్రాంతంలో ఒక భాగం. కళింగరాజ్యంలో తెలుగుభాష, సంస్కృతి వెలసిన రోజులు చరిత్రలోకి వెళితే అనంతంగా కన్పిస్తాయి. తెలుగు ఆధిక్యమే కాదు, అది తెలుగు గడ్డగా నిరూపితమయ్యే ఎన్నో ఆధారాలున్నాయి. సునీత్‌కుమార్ ఛటర్జీ వంటి భాషావేత్త ఈ వాస్తవాన్ని స్పష్టంగా వ్రాశాడు. బరంపురంలోని తెలుగు అధ్యాపకురాలు, సాహితీవేత్త, పరిశోధకురాలు డా॥తుర్లపాటి రాజేశ్వరి ఈ అంశంపై ఇస్తున్న వివరాలు చదవండి.** -సంపాదకుడు

**క**ళింగ దేశంలో తెలుగు ప్రాచీనత అనే అంశంలో ముందుగా ప్రాచీన కాలంలో ఒడిశా భౌగోళిక స్థితి తెలుసుకోవడం అవసరం. ప్రాచీనకాలంలో కళింగులు ఆంధ్రదేశంలో నివసిస్తూ ఉత్తర దిశగా సముద్రతీర ప్రాంతాలలో ఆవాసం ఏర్పరచుకుంటూ ముందుకి సాగి నట్లు చరిత్ర వల్ల తెలియవస్తోంది. వారి సామ్రాజ్యాన్ని మూడు + కళింగ త్రికళింగ అని పిలుచుకున్నారు. అందులో మూడు తెలుగు సంఖ్యావాచకం. కళింగ రాజ్యం మూడు భాగాలలో గోదావరీ తీరం నుండి గంజాం వరకు-దక్షిణ కళింగం, పూరీ కటకం ప్రాంతం, బాలా సోర్ తతిమ్మా ప్రాంతం, మూడింటిని కలిపి ప్లినీ అనే చరిత్రకారుడు మూడో కలింగం (మూడో కళింగం) Mugalingam గా వ్యవహ రించాడు. ప్లినీ రికార్డ్ చేసిన పదాన్ని ప్రముఖ భాషాశాస్త్రవేత్త కాల్డ్‌వెల్ MU+Kalingam గా చెబుతూ - ప్రాచీన ద్రావిడ భాషలో ము అంటే పాత Old మున్, మున్నే (Before) అర్థం చెప్పుకుని పాత కళింగగా చెప్పుకోవాలని వివరించారు.

టోలెమీస్ ఏన్షియెంట్ ఇండియా రచయిత ఎం.సి.క్రిండిల్, ఒరిస్సా ఇన్ ది మేకింగ్ రచయిత బి.సి.మజుందార్ కాల్డ్‌వెల్ అభిప్రాయంతో ఏకీభవించారు. బర్నెల్ అనే చరిత్రకారుడు తన గ్రంథంలో త్రికళింగం-MODOGALINGAM పదాలపై చేసిన వ్యాఖ్యలు గమనించదగినవి.

Kalinga or rather Trikalinga is very old name for the greater part of the Telugu Coast on the Bay of Bengal. Dr.Caldwell took this (Plini's Modogalingam) to be for the old Telugu. Modaga and linga and to mean 3 lingas and thus accepted the native chronology of Telugu.

(Elements of South Indian Palaeography-1878)

నేటి పశ్చిమ ఒడిశా ప్రాంతం-ప్రాచీన కాలంలో మధ్యప్రదేశ్‌లోని రాయపూర్ సమీప ప్రాంతాలలోకలిసి దక్షిణ కోసలగా క్రీ.శ. 1వ శతాబ్ది నాటికి వ్యవహరించేవారు. గౌతమీపుత్ర శాతకర్ణి సువిశాల సామ్రాజ్యంలో కళింగదేశం, కోసల కూడా ఉండేవి. ఆ మహారాజు నేటి జలంగీర్, సంబలపూర్ సరిహద్దు ప్రాంతంలో ఉన్న గంధగిరి వద్ద ఆచార్య నాగార్జునుడి కోసం అయిదు అంతస్తుల దివ్య విహారాన్ని నిర్మించాడు. అది పరిమళగిరిగా ప్రఖ్యాతి పొందింది. చైనా యాత్రికుడు హ్యూయన్‌త్సాంగ్ తన రచనల్లో పాలో-మో-లోమైలిగా దీనిని గ్రంథస్థం చేశాడు. అచార్య నాగార్జునుడు సోనేపూర్ సమీపాన గల బీర్‌మహారాజ్ పూర్ వచ్చి కొన్ని దినాలున్నట్లు జనశ్రుతిలో ఉంది. సోనేపూర్ దక్షిణ కోసలలో పురాతనమైన, చారిత్రక ప్రాధాన్యతని సంతరించుకున్న నగరం. ప్రాచీన కాలంలో ఈ నగరాన్ని సునీతిపురంగానూ, సుబర్ణపురం గానూ వ్యవహరించేవారు. ఈ నగరంలో మహానదికి ఉపనదియైన తేల్‌నది ప్రవహిస్తోంది. ఈ రెంటి సంగమస్థానం ఇక్కడే. తేల్‌నే 'తెలివాహ'గా గుర్తించవచ్చని- శ్రీ కంభంపాటి సత్యనారాయణ (ఏ స్టడీ ఆఫ్ ద హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ద ఆంధ్రాస్') సంపుటి 1 గ్రంథానికి అనుబంధంగా ఇచ్చిన పటంలో రాయటం గమనార్హం. తేల్‌నదికి తెలుగువారికి మధ్య సంబంధాలను గూర్చి చరిత్రకారులు, భాషా పరిశోధకులు తమ అభిప్రాయాలను తెలియజేస్తూ వచ్చారు. బౌద్ధజాతక కథ 'సెరివాణిజ'లో ఇద్దరు వర్తకులు పాత్రలు అమ్మటానికి తెలివాహ నదిలో ప్రయాణించి-అంధపూర్ వచ్చారు. అక్కడ వీధులలో తిరుగుతూ పాత్రలు అమ్ముతామని అరుస్తూ ఉంటారు. పేదవారైన ఒక ఇంటివారు తమ ఇంట్లో ఉన్న పాతపాత్రలతో పాటు వన్నె తగ్గి పాతదానిలా ఉన్న ఒక బంగారు పాత్రను తెలియక అమ్మజూపుతారు. బోధిసత్వుడు వ్యాపారి కుటిలయత్నాన్ని భగ్నం చేస్తాడు. 'సెరివాణిజ' కథలోని 'తెలివాహ' తేల్‌నదే నని ఒరియా చరిత్రకారుడు ప్రొ॥పవిత్ర మోహన్ నాయక్ అభిప్రాయపడ్డారు. తేల్‌నది దాటాక వర్తకులు ప్రవేశించిన నగరం ఆనందపూర్, అంధపూర్, ఆంధ్రపురంగా వివిధ రచయితల రచనల్లో కన్పిస్తోంది. ఈ నగరం ఉనికిని శోధించాల్సి ఉంది. ఏది ఏమైనా నా పరిశోధనలో ఇక్కడ సమీపాన తెలుగు పారా గ్రామం ఉన్నట్లు తెలుసుకున్నాను.

'తెలుంగుపారా' బుర్లారోడ్‌కి సమీపంగా హీరాకుడ్ ప్రాజెక్టుకి దగ్గరలో ఉంది. ఇంకా చెప్పాలంటే ఇది చాంధ్‌లీడుగ్రీ అనే చిన్నకొండ కింద-సాదేపల్లికి దగ్గరలో ఉంది. 'పారా' అంటే ఒరియాలో నదిలో అవతలి గట్టుకి ప్రయాణించటం- వెళ్ళటం, సరిహద్దు అనే అర్థాలు ఉన్నాయి.

దక్షిణ కోసల, పరిసర ప్రాంతాలలో అంటే ఈ ప్రాంతంలో తెలుగు ప్రజలు ఆనాడే ఉండేవారని, వారు తెలుగు మాట్లాడేవారని చెప్పవచ్చు. పరిపాలించే రాజులు-అధికారుల భాష వేరు కావొచ్చు. అది వేరే విషయం.

రహదారులనేవి వాణిజ్యానికి, మనుషుల రాకపోకలకి తోడ్పడటమే కాక సంబంధ బాంధవ్యాలని ప్రోది చేస్తాయన్న విషయం అందరూ ఎరిగిందే. శాతవాహనుల కాలంనాటికి మహారాష్ట్రలో నాసిక్ నుంచి బెంగాల్ మిద్నాపూర్‌కు సోనేపూర్ మీదుగా దారి మార్గం ఉండేది. ఇక్ష్వాకురాజైన మఠరీపుత్ర వీర పురుషదత్తుడు (3-4 శతాబ్ది ఎ.డి) నాగార్జునకొండలో వేయించిన ఒక శాసనంలో ముఖ్యమైన విషయం

ఉన్నది. బోధిశ్రీ అనే బౌద్ధమతాభిమాని నేటి ఒడిశా రాష్ట్రంలోని కియోంఝర్ జిల్లాలో ఒక బౌద్ధవిహారం కట్టించింది. ఆ ప్రదేశం సీతా బింజి, దెంగూపోసి మధ్య ఉన్నట్లు చరిత్రకారులు చెబుతున్నారు. తెలుగు జాతికి, భాషకు చిహ్నంగా వాడే పదం 'తెలుంగు' తోనే ఒక ఊరు ఉండటం సోనేపూర్ మీదుగా శాతవాహనుల రాజధానికి మార్గం ఉండటం ఒడిశాలో తెలుగు ప్రాచీనతను సూచిస్తున్నాయి.

కళింగదేశ చరిత్రలో అపక్రవిక్రముడిగా ప్రసిద్ధికెక్కిన ఖారవేలుడు–క్రీ.పూ.40లో (మొదటి శతాబ్దంలో మధ్య భాగంలో) రాజ్యాభిషిక్తుదయ్యాడు. భువనేశ్వర్‌లోని హాతిగుంఫా శాసనంవల్ల అతడి వంశాదికాలు వెలుగులోకి వచ్చాయి. శాతవాహనులతో అతడికున్న సంబంధ బాంధవ్యాలు–ఆంధ్రదేశంలో లభ్యమైన గుంటుపల్లి, వేల్పూరు శాసనాల వల్ల విశదమయ్యాయి. ప్రసిద్ధ పరిశోధకుడు డా॥ఎస్.డి.తివారి, డా॥ బి.యస్.యల్. హనుమంతరావు, శాతవాహనులకు, ఖారవేలునికి ఉన్న బాంధవ్యాలను ప్రస్తావించారు. ఖారవేలుడు అన్న పదంలోనే కారు–నల్లని, వేల్–వొల్లె–అనేవి తెలుగు పదాలని డా॥బి.యస్.ఎల్.హనుమంతరావు ఆంధ్రుల చరిత్రలో పేర్కొన్నారు. భువనేశ్వర్‌లో మంచాపురి గుహ శాసనంలో(బ్రాహ్మీలిపి), ఖారవేలుని కుమారుని పేరు కుదేపసిరిగా పేర్కొనబడింది. నానాఘాట్ కనుమలలో శిల్పాలవల్ల శాతకర్ణి కమారుల పేర్లు శతి శ్రీమత్, కుమారహుకుసిరి, వేదసిరిగా తెలియవస్తున్నాయి. ఈ పేర్లలో సామ్యాన్ని గుర్తించాలి. 'సిరి' తెలుగుపదం. ఈ శాసనంలోనే కిందిభాగంలో 'కుమార వడుఖ'(The cave of Kumara Vadukha) అనే పేరు కనిపిస్తోంది. తెలుగు భాషను ప్రాచీనకాలంలో, తమిళులు 'వడుగుల' అని పిలిచేవారు. 'సంగ సాహిత్యం'లో 'వడుగర్' అని ఉన్నది. ఈ కుమార వడుఖ కుదేపసిరి కుమారుడై ఉండొచ్చు. 'కుమారవడుఖ' పేరు మాత్రం తెలుగు భాషకు సంబంధించిన పదమని ఊహించవచ్చు. (ఈ విషయాన్ని నేను 'ఆంధ్రులతో ఖారవేలుని బాంధవ్యం, చారిత్రికాంశాలు' వ్యాసంలో చర్చించాను).

మహాశివ తివరదేవుడు నన్నదేవుడి కుమారుడు. ఈ మహారాజు–తాత పాండువంశానికి చెందిన ఇంద్రబాలుడు. తివరదేవుడు క్రీ.శ. (620 ఎ.డి)లో రాగిరేకుమీద వేయించిన శాసనం నేటి మధ్యప్రదేశ్‌లోని రాయపూర్ దగ్గర రాజిమ్ గ్రామంలో లభ్యమైంది. ఈ శాసనంలోని లేఖన పద్ధతి, కొన్ని పదాలను గమనించాలి. రాగిరేకుల మీద వేసిన ఈ శాసనం మీద రాజముద్ర ఉన్నది. దానిమీద ఒక కథనం. పింపిరి పద్రకం అనే గ్రామాన్ని భావదత్తుడు, హరిదత్తుడనే బ్రాహ్మణులకు దానంగా ఇవ్వటం ఇందులోని విషయం. అయితే ఈ శాసనంలో–రాజముద్రలో–కథనంలో 'స్థిరమాచాంద్ర తారకము' అనే పదమూ.. అలాగే, శాసనంలోని చివరి పంక్తిలో–విజయరాజ సంవత్సరు, దివసు, అష్టము పదాలు 'ఉ', 'ము' కారాంతాలు. వీటిని గూర్చి వివరణలిస్తూ శాసనాలను వివరణలతో అందించిన శ్రీ సత్యన్నారాయణ రాజగురు చెప్పిన మాటలు గమనించదగినవి.

"The words" సంవత్సరు' for సంవత్సర, దివసు for దివస, and అష్టము for అష్టమీ in the last line seems to be a vernacular termination as suggested by Dr.Fleet, "It is necessary to point out here that the use of 'U' matra in such cases are found in Telugu speaking areas"

క్రీ.శ.11, 12 శతాబ్దులలో తెలుగు చోడులు సోనేపూర్ –సువర్ణపూర్‌ను రాజధానిగా చేసుకొని దక్షిణ కోసలలో కొంత భాగాన్ని సుమారు 45 ఏళ్ళు పాలించారు. ద్వితీయ సోమేశ్వర్‌దేవ్ వర్మన్ వేయించిన మొహదా తామ్రశాసనం కుమార సింహదాన శాసనం వల్ల వీరి వివరాలు లభ్యమైనాయి. కావేరి తీరం–ఒరయూరుకు చెందిన వీరు తెలుగువారితో సంబంధాలు కలుపుకుని తెలుగు చోడులయ్యారు. ఈ చోడులలో ఒక శాఖ నాగవంశీయుల వద్ద సేనానులుగా ఉండి కోసలలో రాజ్యాధికారం పొందారు.

తెలుగు చోడ సోమేశ్వరదేవ్ వర్మన్ మహానదిలో లంకేశ్వరి కొలువైన ప్రదేశానికి వెళ్ళారు. అక్కడ నుంచి వెలువరించిన శాసనంలో తమ వంశం కీర్తిప్రతిష్టలు చెప్పుకుంటూ తమకు రాజ్యం ప్రసాదించిన నాగవంశరాజును స్తుతించాడు. ఆరు గ్రామాలను మధుసూదన్ అనే పేరుగల బ్రాహ్మణునికి దానమిచ్చాడు. రాజ్యం సుభిక్షంగా ఉండాలని వైద్యనాధస్వామి ఆశీస్సులను కోరుకుంటూ రాజు ఈ దానమిచ్చాడు. ఈ వివరాలు సరిగ్గా జనవరి 18, 1092వ సం॥తో కుదురుతున్నాయి. శాసనం రెండో ఫలకంలో మాటలు –

మహాభూపతిల్ల చక్రవర్తి శ్రీ సోమేశ్వరదేబరూ ప్రవర్ధమాన విజయ రాజ్య సంవత్సరం బుల్లు, ఇరుబై మూండుమ్, అనే పదాలు వీరికి తెలుగు భాషయందున్న మమకారాన్ని, అనుబంధాన్ని తెలియజేస్తున్నాయి. శాసనం తెలుగుభాషలో లేకపోయినా ఇందులో ప్రయోగించిన పదాలకి తెలుగుభాషా పరిశోధకుల అధ్యయనాలను అనుసరించి–వివరించుకోవచ్చు. వీటి ప్రాచీనతను ఆస్వాదించవచ్చు.

**భూపతిల్ల**–పురుషజాతిని తెలిపే బహువచనం–లో 'రు' ప్రత్యయం మొదట వాడుకలో ఉండి తరువాత తగ్గుతూ వచ్చింది. ఉదా. వేవురు (క్రీ.శ.625–50) సామాన్య బహువచన ప్రత్యయం ళు–7వ శతాబ్దికేలుగా మారిపోయింది. ఉదా. రాజుల్ల (క్రీ.శ.600) ప్రాచీన శాసనాలలో పూజ్యతను సూచించటానికి బహువచన 'లు' ప్రత్యయం అధికంగా వాడేవారు.

**దేబరూ :** పూజ్యర్థంలో 'రు' బహువావచక ప్రత్యయంగా చేరటం 10వ శతాబ్దిలో కన్పిస్తుంది– ప్రాతిపదికకు బహువచన ప్రత్యయంగా 'రు' వచ్చింది.

**సంవత్సరంబుల్లు :** ప్రాచీన శాసనాలలో సంవత్సరంబుళ్ అనే పదం కన్పిస్తుంది. పురుషుడు స్త్రీ కాని వాటిని తెల్పేవి అమహత్ అర్థకము లేక అమహద్వాచకం. అమహత్ ఏక వచనానికి ప్రథమైక ప్రత్యయంగా 'బు' అనేది ప్రాచీనాంధ్ర శాసనాలలో కన్పించేది. బ, ంబు, ప్రత్యయం పరిణామంలో మ్,ము, గా మారింది.

**ఇరుబై మూండుమ్ :** ఈ సంఖ్యావాచకం ఇక్కడ విశేషణంగా వాడబడినట్లు తెలుస్తోంది. ఇర–వది= ఇరువది. ఇరు–బది, ఇర్వది, ఇర్వై మొ. శబ్దాలు శాసనాలలో కన్పించేవి. రెండుకు విశేషణార్థంలో ఇను, ఇర, ఇరు అనే రూపాంతరాలున్నాయి. దీనికి పది సంఖ్య కలిసినప్పుడు ఇరవది. మొ. రూపాలుండేవి. ఇక మూన్‌ఱ మూణ్డు మొదలగు రూపాలు మూడుకి కన్పించేవి.

తెలుగు చోదరాజులు భాషని ప్రోత్సహించటమే కాక, సాంస్కృతిక నిర్మాతలుగా, రాజ్యాధినేతలుగా పశ్చిమ ఒడిశా ప్రాంతాలతో చారిత్రాత్మకమైన పాత్రని పోషించారు. అందుకు నిదర్శనంగా వారు కట్టించిన మహాకాళేశ్వర, వైద్యనాధ దేవాలయాలని చెప్పవచ్చును.

15వ శతాబ్దిలో గజపతి కపిలేంద్రదేవ్ సామ్రాజ్యం గంగ నుండి దక్షిణాపథానికి విస్తరించింది. ఈ క్రమంలో కపిలేంద్రుడు కొండవీడును జయించాడు. కొండవీటి రెడ్డి రాజుల ఆస్థానంలో ఉన్న అహోబలుడనే

సంగీత విద్వాంసుడు రచించిన సంగీత పారిజాత గ్రంథం రాజుని ఆకట్టుకుంది. రాజు అహోబలుడిని ఆదరించి వుంటాడని ఊహించ వచ్చు. ఒడిశా సంగీతానికి మూలం సంగీత పారిజాత గ్రంథమని పరిశోధకులు చెబుతున్నారు. ఇది తెలుగుజాతికే గర్వకారణం. కపిలేంద్ర గజపతి తెలుగు గాయకులను దక్షిణాది సంగీత పద్ధతిలో జగన్నాథ ఆలయంలో పాడటానికి నియమించినట్లు ఆయన మనుమడు ప్రతాప రుద్ర గజపతి వేయించిన ఒరియా శాసనంలో ఉన్నది. ఆ శాసనం పూరీ జగన్నాథ దేవాలయంలో జయ, విజయ ద్వారం వద్ద ఉన్నది. తెలుగు నర్తకీమణులు, గాయనీ బృందం దేవతలకు నైవేద్యం సమర్పించే సమయంలో గీత గోవింద గీతాలు గానం చెయ్యాలి. సంధ్యాహారతి వేళ గీతగోవింద గానం ప్రారంభించి వస్త్రాలంకరణ సేవ వరకూ కొనసాగించాలని ఆ శాసనం సారాంశం. ఏనుసాని, కేతసాని, నాగదేవ గంగసానులు తెలుగు మహిళల బృందానికి నాయకత్వం వహించేవారు.

పై చారిత్రక ఆధారాల వల్ల తెలుగు మహిళలు జగన్నాథ ఆలయం లోనూ, ఒడిశా రాజుల ఏలుబడి క్రింద వున్న కొన్ని ప్రాంతాల దేవా లయాలలోనూ సంగీత నృత్యార్చన సేవలు శతాబ్దాల తరబడి అందించి నట్లు తెలుస్తుంది. ప్రతాపరుద్ర జగపతి ఆస్థానంలో లొల్ల లక్ష్మీధర పండితుడు వుండేవాడు. ఈయన సంస్కృతంలో అనేక కావ్యాలు వ్రాశాడు. సౌందర్యలహరి వ్యాఖ్య తెలుగులో రాసినగ్రంథం. ప్రతాప రుద్రుడు ఈయనకి 1500 ఎ.డి.లో అనంతవరం అగ్రహారం బహు మతిగా ఇచ్చాడు.

ఈ కాలంలో తెలుగువారి ప్రాభవానికి ఉపబలకం చేకూర్చేదిగా 2008లో ఒక చారిత్రక ఆధారం వెలుగులోకి వచ్చింది. పూరీ తవ్వ కాలలో శిధిలావస్థలో ఒక రాతి కలశం లభించింది. అది 15వ శతాబ్దిలో సూర్యవంశానికి చెందిన గజపతి రాజు పురుషోత్తమదేవ్ పాలనలో రూపొందినదనీ, దానిమీద నాగరిక తెలుగు భాషలులో రాత లున్నాయని భువనేశ్వర్‌లో పురావస్తు సంగ్రహాలయ అధికారిణి తెల్పి నట్లుగా 2008 ఫిబ్రవరి 6వ తేదీ ఈనాడు ఒరిస్సాలో వార్త ప్రచురిత మైంది.

16వ శతాబ్దంలో ఒడిశాపై మహమ్మదీయుల దండయాత్రకు ముందు ఒడిశాను పరిపాలించిన చివరి హైందవరాజును ఒడిశా చరిత్రలో తెలంగా ముకుందదేవ్‌గా వ్యవహరిస్తారు. పరిపాలనా కాలం (1559-1568) ద్రాక్షారామం, భీమేశ్వరాలయంలో వేయించిన ఒక శాసనం ఈ మహారాజు తండ్రి పేరు సర్వరాజుగా, తాత సింగరాజుగా పేర్కొంటున్నది. వీరు నాడు గజపతుల రాజ్యంలో, విశాఖపట్నం జిల్లా లోని భూవలేంద్ర, హరిచందననామ వంశాలతో సర్వసిద్ధి తాలూకాలో పరిపాలించిన సామంత రాజులని చరిత్రకారుడు ఫెరిస్టా పేర్కొన్నట్లు కె.సి.పాణిగ్రాహి రాశారు. తెలంగా ముకుంద్‌దేవ్ ప్రజాహితం కొరకు చేసిన పనులను వివరిస్తూ పి.కె.మిశ్రా, హిస్టరీ ఆఫ్ ఒరిస్సాలో అన్నమాటలు గుర్తింపదగినవి.

Mukundadeva is accorded a high and honourable place in the History of Orissa and the Oriya people cherish his memory with love and pride. (History of Orissa -P.K.Mishra page 249).

తెలంగా ముకుందదేవ్ రాజుగా ఉన్నప్పుడు కటకం బారాబతి దుర్గంలో కొంతమంది తెలుగు వీరుల్ని తనకు రక్షణగా ఉంచుకున్నాడు. అలాగే మరాఠీ రాజు రఘునాథరాజు కాలంలో (క్రీ.శ.1751-1803) శౌర్య సాహసాలు కలిగిన వీరులు నేటి కటక్ తెలంగా బజార్‌లో నివాసం ఉండేవారు. వారు అక్కడ ఉండటం వల్లనే ఆ ప్రదేశానికి తెలంగా బజార్ అని పేరు వచ్చింది.

ప్రముఖ చరిత్ర కారుడు ప్రొఫెసర్ దొండపాణి బెహరా అభి ప్రాయం ప్రకారం గంజాం జిల్లా 1766-67 ప్రాంతంలో బ్రిటీష్ పాలన క్రిందికి వచ్చింది. ఆ సమయంలో మొహరి సంస్థానానికి చెందిన రాజు తంజావూరు, రాజమండ్రి ప్రాంతాలకు వెళ్ళారు. అక్కడి నేతవారి నైపుణ్యాన్ని చూసి వారిని మొహురి సంస్థానానికి ఆహ్వానించారు. ఆ విధంగా దేవాంగులు రాక, దక్షిణాదికి చెందిన పట్టు, జరీనేత పని ఈ ప్రాంతంలో ప్రారంభమైంది. వీరివల్లనే బరంపురం పట్టు పట్టణం (సిల్క్ సిటీ)గా ప్రసిద్ధి చెందింది.

18,19 శతాబ్దాలలో జలంతర, అరగడ, మందస, పర్లాకిమిడి, ఖొర్ధా, చీకటి మొదలైన సంస్థానాలలో ఒడియా కవులతో పాటు తెలుగు కవులూ, పండితులు, తెలుగు సంగీత విద్వాంసులూ ఉండేవారు. 19వ శతాబ్ది పూర్వార్థంలో ఒడిశాలో తెలుగు వారిని గూర్చిన విశేషాలు ఏనుగుల వీరాస్వామయ్య గారి 'కాశీయాత్రా చరిత్ర' వల్ల తెలుస్తున్నాయి. పూరీ నుండి గంజాం వచ్చే మార్గంలో చిలుక సముద్రం దాటేముందు మాణిక్యపట్టణం అనే ఊళ్ళో వెంకన్న పంతులు అనే శిరస్తాదారు ఒక ధర్మశాలని కట్టించాడుట. ఇలా చరిత్ర పుటల్లో మన తెలుగు గాథలు ఎన్నో..ఎన్నెన్నో.

**ఒడిశాలోని గ్రామనామాలు, పదాలు, ప్రాచీన ద్రావిడ భాషకు, తెలుగుకు సన్నిహితంగా ఉంటాయి. తెలుగు ప్రాచీనతకు సాక్ష్యంగా నిలుస్తున్నాయి.**

తెలుంగుపారా, తెంతుల్‌కుంటి, బ్రాహ్మణ తెలంగా గ్రామాలలో తెంతుల్‌కుంటి తేల్‌నదీలోయలో బలంగీర్ జిల్లాలో వుంది. గ్రామానికి ఉత్తరంగా ఒక పెద్ద చెరువు వుంది. దీనిని స్థానికులు కటా అంటున్నారు. కట మూలపదం కట్ట -తెలుగు దేశ్యం. దేల్‌గుడి, బరాపహార్ గుడి, పాంధేగుడిలో గుడి ద్రావిడపదం. గూడ-ప్రత్యయంతో అనేక ఊర్లు బోరిగూడ, హతిగూడ, బోయగూడ, బైపారిగూడ కనిపిస్తున్నాయి. అలాగే 'మల' అంటే తెలుగులో కొండ, పర్వతం. ఇది ప్రత్యయంగా బలిమల, బోరమల మొ. ఊర్లపేర్లు ఏర్పడ్డాయి.

ఒడిశాలో దక్షిణ ప్రాంతం 'గంజాం'ని 'కొంగడ'గా వ్యవహరించే వారు. దీనిని కొంగు+నాడు-కొంగు అంటే తమిళంలో Irregular Shape మిట్టపల్లాలున్న అనీ, నాడు-తెలుగుదేశ్యం -రాజ్యం -నేల అర్థంలో 'కొంగడ'గా పిలిచేవారని పరిశోధకుల వివరణలున్నాయి. ఇది 7వ శతాబ్ది హ్యుయన్‌త్సాంగ్ భారతదేశాన్ని సందర్శించిన సమయ మని చెప్పొచ్చు. ఒడిశాలో కొన్ని నాణాలు - ఒక వైపు వృషభం గుర్తు ఉన్నవి- మరోవైపు తెలుగు అంకెలలో ఉన్నవి లభ్యమయ్యాయి. ఇవి గాంగుల పరిపాలనా కాలానికి చెందినవి. (6-11 శతాబ్దులు), తూనికలు, కొలతలతో తెలుగు పదాలు- కుంచం, తూము; భూమి పరిమాణానికి సంబంధించి-గుంట, పుట్టి మొదలైనవి వాడుకలో వున్నాయి. ట్యాక్స్(Tax) : సుంకం సేకరణలో వ్యాప్తిలో వున్న శబ్దాలు, పెద్ద సుంకము, గ్రామ కరణాన్ని 'పూరకరణం'గా, గుడిలో లెక్కలు చూసే టెంపుల్ ఎకౌంటెంట్‌ను దేవుల కరణంగా వ్యవహరించేవారు. తోటగప్పు, తోటభూమి అనే పదాలు వాడుకలో ఉండేవి. గాంగుల, గజపతుల పరిపాలనా కాలంలో నేటి ఆంధ్ర దేశంలోని పలు ప్రాంతా

(మిగతా 38వ పుటలో...)

-డా॥ఇమ్మానేని సత్యసుందరం

# ఆచార్య భావరాజు సర్వేశ్వరరావు గారు కొన్ని జ్ఞాపకాలు

**కొం**దరి జీవితాలలో కొన్ని అసాధారణ సంఘటనలు జరుగుతుంటాయి. ఒక వ్యక్తి 95 సంవత్సరాలు జీవించి. అందులో 75 సంవత్సరాలు ఒక విశ్వవిద్యాలయంతో ఏదో ఒక సంబంధం పెట్టుకోవడం ఒక అరుదైన ఘటన. సర్వేశ్వరరావుగారి విషయంలో అదే జరిగింది.



**నా అనుభవాలు :**

నేను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్రంలో పి.జి. చేసినప్పటి నుండి (1967-69) భావరాజు సర్వేశ్వరరావు గారితో సన్నిహిత సంబంధాలు వుండేవి. నాపట్ల ఆయన అభిమానం చూపటానికి అనేక కారణాలున్నాయి. రెండవ సంవత్సరం చదువు తున్నప్పుడు (1968-69) నేను అర్థశాస్త్ర సంఘానికి అధ్యక్షుడిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యాను. మచిలీపట్నం నుండి 'ఎడ్యుకేషనల్ ఇండియా' మాస పత్రిక వస్తూ వుండేది. హిందూ కాలేజీలో విద్యార్థిగానే ఆ పత్రిక చదివేవాడిని, ఉత్తరాలు వ్రాస్తుండే వాడిని. ఆ పత్రికకు సంపాదకులు ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్యగారు. సర్వేశ్వరరావుగారి గురువుగారు. నాకు విద్యా విషయాలపై ఆసక్తి ఆ విధంగా పెరిగింది.

అర్థశాస్త్ర సంఘ ప్రారంభోత్సవ సభకు సర్వేశ్వరరావు గారు అధ్యక్షత వహించారు. నేను సంఘ అధ్యక్షుడిగా ఉపన్యాసం ఇచ్చాను. నా ఉపన్యాసంలో విద్యారంగం ఎదుర్కొనే సమస్యలపైనే మాట్లాడాను. సర్వేశ్వరరావుగారు చాలా సంతోషించారు మొదటిసారిగా ఒక పండితుడు సంఘానికి అధ్యక్షుడయ్యాడని అన్నారు. నా వయస్సు 21 సంవత్సరాలు. నేను పండితుడ్ని కాను. అయినా ఆయన యువతను ఆవిధంగా ప్రోత్సహించేవారు.

రెండవ సంవత్సరం చదువుతున్నప్పుడే (1968లో) నాకు విద్యారంగంపై ఆంగ్లంలో ఒక పుస్తకం వ్రాయాలని అది నేను విద్యార్థిగానే చూసుకోవాలని కోరిక కలిగింది. ప్రింటులో 200 పేజీల (పది అధ్యాయాలతో) 'ఎడ్యుకేషన్ ఎట్ క్రాస్‌రోడ్స్' అనే పెద్ద పుస్తకం వ్రాశాను. అదే సంవత్సరం వేంకటరంగయ్యగార్కి ఆంధ్ర విశ్వవిద్యాలయం గౌరవ డి.లిట్ డిగ్రీ ప్రదానం చేసింది. నేను వ్రాత ప్రతిని పూర్తి చేశాను. వేంకట రంగయ్యగారిని వ్రాతప్రతి చూసి 'ముందుమాట' వ్రాయమని కోరాను. ఆయన అంగీకరించి వ్రాశారు. ఈ పుస్తకాన్ని డా. ఎస్.రాధాకృష్ణన్‌కు అంకితం చేశాను. పుస్తకాన్ని అచ్చువేయడంలో అనేక ఇబ్బందులు ఎదుర్కొన్నాను. పుస్తకాన్ని విద్యార్థిగానే చూసుకోవాలి. ఈ విషయంలో భావరాజు నరసింహారావుగారు (త్రివేణి పబ్లికేషన్స్, మచిలీపట్నం) సహాయపడ్డారు. 1969 ఏప్రిల్‌లో పుస్తక ప్రచురణ పూర్తిచేసి రెండు కాపీలు నాకు పంపించారు. ఒక కాపీ సర్వేశ్వరరావుగార్కి ప్రిన్సిపల్ ఆఫీసులో ఇచ్చాను (అప్పుడు ఆయన ఆర్ట్స్, కామర్స్ మరియు లా కాలేజీల ప్రిన్సిపల్). సర్వేశ్వరరావు గారు ఎంతో సంతోషించారు. వ్రాసింది పెద్ద పుస్తకం అని ఆయన ఊహించలేదు.

ఆ తర్వాత బందరు హిందూకాలేజీలోనే 1969లో లెక్చరర్‌గా జాయిన్ అయ్యాను. 2004లో పి.జి.సెంటర్ డైరెక్టర్‌గా రిటైర్ అయ్యాను. ఆతర్వాత 4 సంవత్సరాలు ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలో గ్రామీణాభివృద్ధి శాఖలోనూ రెండు సంవత్సరాలు జర్నలిజం శాఖలోనూ బోధన చేశాను.

సర్వేశ్వరరావు గారు నన్ను ఆంధ్రా యూనివర్శిటిలో పరిశోధన చేయమన్నా, డిగ్రీ తీసుకున్న వెంటనే ఉద్యోగం రావడం వల్ల (కుటుంబ ఆర్థిక పరిస్థితుల వల్ల) నేను హిందూ కాలేజీలో జాయిన్ అయ్యాను. గత 45 ఏండ్లలో కొన్ని వేల వ్యాసాలు ఆంగ్లపత్రికలకు వ్రాయడం కొన్ని వందల ఆంగ్ల పుస్తకాలు సమీక్ష చేయడం జరిగింది. ఇది సర్వేశ్వరరావు గార్కి ఎంతో సంతోషానిచ్చింది. ఇప్పుడు కూడా సెమినార్లు నిర్వహించడంలో యూనివర్శిటిలకు, కాలేజీలకు సహాయ పడుతున్నాను.

**జీవిత చరిత్ర :**

భావరాజు సర్వేశ్వరరావు గారు 1915 నవంబర్ 22న తూర్పు గోదావరి జిల్లా పెద్దాపురంలో జన్మించారు. ప్రభుత్వ ఆర్ట్స్ కాలేజీ రాజమండ్రిలో, ఇంటర్ పూర్తిచేసి, ఆంధ్ర విశ్వవిద్యాలయం (1936-39) నుండి అర్థశాస్త్రంలో ఎం.ఎ.డిగ్రీ పొందారు. యూనివర్శిటిలో చదివేటప్పుడు విద్యార్థి సంఘ అధ్యక్షుడిగా ఎన్నుకోబడ్డారు. దుర్గాబాయి (ఆ తర్వాత దేశముఖ్) ని ఎన్నికలలో ఓడించారు. 1950-53 మధ్య కాలంలో ఇంగ్లాండు వెళ్ళి సెయింట్ జాన్స్ కాలేజీ (కేంబ్రిడ్జి) లో పరిశోధన చేసి పి.హెచ్.డి. పట్టా పొందారు.

సర్వేశ్వరరావు గారి జీవితం బోధనకే పరిమితం కాలేదు. 1964-66 మధ్య నైజీరియా ప్రభుత్వానికి ఆర్థిక సలహదారుగా వెళ్ళారు. 1968 నుండి 1976 వరకు ఆంధ్ర యూనివర్శిటిలోని అగ్రో ఎకనమిక్ రీసెర్చి సెంటర్‌కి డైరెక్టర్‌గా వున్నారు. ఆ తర్వాత (1975-87) ఎమిరిటస్ ఆచార్యులుగా వున్నారు. 1979-81 లో ఆచార్య నాగార్జున యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్‌గా వున్నారు. కొన్ని విలువలకు కట్టుబడి వుండటం వల్ల పదవీకాలం పూర్తి కాకుండానే ఆపదవికి రాజీనామా

(మిగతా 38వ పుటలో...)

చిత్తూరు కత

# అగ్గవ బతుకులు

— ఎండపల్లి భారతి



నడుము వంగిపోయిన మూడుకాళ్ల ముసిలి మా వసంతవ్వ. అడుసుమడికి గెనాలు వేసినట్ల ముడతలు పడిన మొకము అవ్వది. నొస్టన వీబూది బొట్టు; చెవులకు ఎర్రరాళ్ల కమ్మలు; పిల్లా చెవులకు బుగుళ్లు; చెవుల చుట్టూ బావిరిళ్లు; కోటేలి తీసినట్లు ఉండే ముక్కు; ముక్కుకు ఒగపక్క చెందరంకి పుల్ల, రెండోపక్క పన్నెండురాళ్ల ముక్కుపుల్ల; మెడలో గుండ్లదండ, దానికి టీకాబిళ్ల; చేతులకు వెండి కడియాలు; నడుముకు గజ్జెల వడ్డాణం; కాళ్లకు తుమ్మకాయ కడియాలు; ముంజేతుల వరకు రయిక; చేతుల రెట్టల కాడ సీతమ్మ బాజిగాలు పచ్చ; కుడిచేతి మోచేతి కింద ఇండ్ల పచ్చ; ఎడమ చేతిమింద పీటముగ్గు పచ్చ, దానికి దిగవ వాళ్ల అమ్మపేరు పచ్చ, ఇన్ని పచ్చలతో చింతమాను చిగిరినట్లుండే చేతులు; పావడ లేకుండా కట్టే పన్నెండు మూర్ల కోకకు ముందు పదిరవయి కుచ్చిళ్లు, వెనక వేలాడే రెండు మూర్ల కొంగు; గాలి తీసేసిన ఊపిరిబుడ్డల మాదిరి వేలాడతా గుండెలమింద నింటి బొగ్గిటి కాడికి జారిన రొమ్ముకట్టు; ఆ రొమ్ముకట్టుకు పోటీగా గొంతులో వేలాడతుండే నల్లదారం, ఆ దారంలో మండిముల్లు, గుబిలిగెంటి, అంత్రం- ఎన్ని అగసాట్లు వచ్చినా పోగొట్టుకోకుండా పెట్టుకోనుండే అయ్యి అన్నీ వెండివే; పాపిట్లో యెంటిక పడకుండా నున్నంగా దువ్వి ముడికట్టిన జుత్తు; అడివినింటి కొట్టుకొచ్చి, చేపట్టు తావున వెండిరేకును తాపిడించుకున్న ఊదగ దొండి కట్టి; అలికిన పొయ్యిలో నిప్పులు మండినట్లు, బొక్కినోటినిండా వక్కాకు...ఇదీ మా అవ్వ రూపు.

మా అవ్వను చూస్తే చాలు నాకు కొండంత దైర్నం. ఆయమ్మ మొగంలో అంత కళ ఉంటాది. కడగండ్లకు కుంగిపొయ్యేది కాదు. మా యవ్వ మాట్లాడితే, కడవంత కష్టాన్ని మోస్తుండే వాళ్లయినా కలకల నగాలసిందే. చచ్చే చావుదల్లో కూడా చిట్టకపు మాటలే. ఆకలి అంటా ఎవురయినా వస్తే, తాను తినే దాన్నయినా పెట్టేస్తాది. ఊర్లో ఆలూమొగుళ్లకు గలాటలొస్తే తీరస్తాది. కొప్పులో పూలు ఏమారేదే లేదు. నాట్లేసే చోట పదమెత్తుకొనిందంటే, గెనాల మింద పొయ్యేవాళ్లు అట్లనే నిలబడిపోతారు, అంత బాగుంటాది గొంతు. మొలకల పున్నానికి జక్కీకు ఆడిందంటే, ఊరు ఊరంతా ఆడనే ఉంటాది. పండగయినా పబ్బమయినా, పెండ్లయినా పుటకయినా, మాయవ్వ లేనిదే మా మాదిగిండ్లను దాటదు.

"ఆ వయసులో గుద్దితే పగిలేటిగా ఉండేదాన్ని లేమ్మే" అంటుంటాది మా అవ్వ నాతో, ఇప్పుడేమో తక్కువయినట్లు. కాటికి కాళ్లు చాపుకొని ఉండే ఈ వయసులో కూడా తాటికాయంత సంగటిముద్దని ఎగరేసి మింగేస్తాది. మాయవ్వని మావోళ్లు అందురూ "ఏమే ముసిలీ, నీకేమి గుద్దలో గోరోజనం ఉందేమే" అని ఎగతాళి పడతుంటారు. అంత గట్టి ముసిల్ది.

ఇంతకూ ఈ వసంతవ్వ ఎవురో కాదు. మా అమ్మకు అమ్మ. చిన్న బిడ్డపుడే అమ్మని పోగొట్టుకొనిన నేను, అనెంక మా అవ్వకాడనే పెరిగితిని.

ఆపొద్దు నేనూ మాయవ్వా తెట్టు తిర్నాలకు పోతా ఉండాము. ఆ తిర్నాలకు పోవల్లంటే మూడు మైళ్లు నడిసిపోవల్ల. నేను సంచితో, మాయవ్వ ఊతకట్టితో యెల్లబారితిమి. దోవ పొడువుకూ గుంపులు గుంపులుగా అందురూ తిర్నాలకు పోతా ఉండారు. మాయవ్వ బిరిన్నా నడలేదు కదా, దాన్నింటి మేము మెల్లిగా పోతా ఉండాము.

ఈ ముసిలి దానితో పొయి ఈపొద్దు తిర్నాలని చూసినట్లే అనుకుంటా, "అవా, తిర్నాల్లో నాకు అన్నీ తీసియ్యల్ల" అంటి. "అట్లే లేమ్మే" అనింది అవ్వ. పోతా ఉండాము. దోవలో తీపి చింతమాను కనపడింది. నేను మా యవ్వను వదిలేసి పరిగెత్తిపొయి, తీపిచింత కాయల్ని ఏరుకోని తింటా ఉండాను.

"ఏలనే బిడ్డా, అట్ల పరిగెత్తతావు" అంటా మానుకాడికి వచ్చి, రాలిండే చింతకాయిని ఎత్తుకుని, ఒగ బేదని తుంచి నోట్లో వేసుకుని చప్పరిస్తా నగతా ఉంది మాయవ్వ.

"ఏలవ్వా నగతా ఉండావు?" అని అడిగితి.



"ఏమీ లేదే, నేను నీ ఈడులో ఉన్నెపుడు, పుల్లిగాడు నన్ను చానా ఏడిపిస్తా ఉండె. అది గుర్తుకొచ్చింది"

"ఎవురవ్వా ఆ పుల్లిగాడు, ఏమి చేసినాడవ్వా?" అని అడిగితి.

"అప్పుడు నేనూ, నా జతగత్తెలూ జత గాళ్లూ అందురుమూ చేరి ఈ చింతమాను కొమ్మలమింద కోతి కొమ్మాటను ఆడతా ఉండే వాళ్లము. ఒగనాడు, నేను ఎక్కిండే కొమ్మ మిందనే పుల్లిగాడూ ఎక్కిండె. అది కొనాకొమ్మ. ఆ కొమ్మమింద కూసోని, దానిని రెండుకాళ్లతో గట్టిగా ఊపినాడు. కిందపడిపోతానేమో అని బిత్తరపుట్టి 'ఓయమ్మా' అని అరిస్తిని. వాడు నన్ను ఏడిపించేదానికి ఇంకా బలంగా ఊపి నాడు. 'ఒరే, నీకు దండం పెడతాను గమ్ము నుండ్రా గబ్బునాబట్టా' అని ఏడిస్తిని. 'సరే అయితే, మీ ఇంటినింటి చేరు చెనిక్కాయిలూ బెల్లమూ తెస్తావా చెప్పు, గమ్మునుంటాను' అన్నాడు వాడు. 'సరే సరే, రేపు గొడ్లకాడికి పోయేనబ్బుడు ఎత్తకచ్చి ఇస్తా' అంటి. అబ్బుటికి ఊపేది నిలిపి, నన్ను కిందికి దిగనిచ్చి నాడు ఆ పుల్లకోతి నాబట్ట" నగనగతా ఆ కతను చెప్పింది అవ్వ.

ఆ మానుకాడనింటి మల్లా దోవ పడితిమి. అట్లే నడుసుకుంటా వరమోళ్ల బాయి కాడికి వస్తిమి. ఆ బాయికాడ మొరంకయ్యిలో మడిని నాటిండారు. మాయవ్వ ఆ కయ్యికాడ రొంతసేపు అట్లే నిలపడింది. అవ్వ మొగంలో మల్లా నగువులు పూసినాయి.

"ఏలనే అవ్వా మాల్లా నగతా ఉండావు. ఇబ్బుడు ఏమి గుర్తుకొచ్చింది?" అని అడిగితి.

"ఏమీ లేదే కున్నిముండా, ఈ మడి రంగారెడ్డి వాండ్లది. అది నాకు పెండ్లయినపుడి మాట. అబ్బుడు నేను పుట్టచెండు ఉన్నెట్లు బలే ఉంటి. ఈ కాలవ కిందంతా మీ తాత నీరుగట్టుతనం చేసేది. రేయంటే రేయి, పొగులంటే పొగులే పొయి నీళ్లు కట్టతా ఉండేది. రంగారెడ్డికి నామింద కన్నుపడె. నేను ఏడన్ను పని చేసుకోని ఉంటే ఆడకంతా వచ్చి కడగా కడగా నా సుట్టకారం తిరగతా ఉండేవాడు. దాన్ని నేను గమనించితి. అయినా మనతో ఆయనికేమి పనిలే అనుకుంటి.

ఒగనాడు, నీళ్లు ఎగేసుకుంటా ముందర పోతా ఉండాడు మీ తాత. నేను రొంత యొనకయితి. రంగారెడ్డి గబక్కన నా ఎదురుగుండా వచ్చి, నన్ను అడ్డగించుకునె. మీ తాత ఏడ చూస్తాడో అని నేను బెప్పరపోతి. "వసంతీ, ఒగనాడు నాతో గడిపే" అనె రంగారెడ్డి. ఏందప్పా ఈయన అని ఆలోచన చేస్తా 'సామీ మీరు రెడ్లు. మేము అరగాసు మాది గోళ్లము మీరు మమ్మల్ని ఆసిస్తే ఎట్ల' అంటి. వాడు వింటేనా, 'అదంత కాదు, ఒగనాడు గడిపే' అన్నాడు మల్లా. ఆపొద్దు ఎట్లో తప్పించుకుంటి. అబ్బుటినింటి వానిమింద ఒక్కన్నేసి ఉంటి. ఇంకొగనాడు ఇదే మడిని నాటతా ఉంటిమి. ఆయప్ప పెండ్లాము అన్నం ఎత్తుకొచ్చేకి ఇంటికి పొయింది. ఆయప్ప సైగ్గా నా పక్కకు వచ్చి నిలబడి, జోబిలోనింటి చిల కల కమ్మలు తీసి నాకు చూపిస్తా 'నువ్వు ఒగనాడు ఒప్పుకుంటే ఈ కమ్మలు నీకే..' అన్నాడు. 'ఓరి నీ పుట్టుకు నా సాదు' అని నా లోగానే వానిని తిట్టుకుని, 'ఓప్పా, నీ కమ్మలూ వద్దు, నువ్వూ వద్దు. ఇంకెబ్బుడు గాని ఇట్ల చేస్తే నీ పెండ్లానికి చెప్పేస్తా' అంటి. పురుకుల నాబట్ట, వానికి పెండ్లాము పేరు చెబితే ఉచ్చలు కారతాయి. అంతే, అబ్బుటినింటి నా తట్టుకు రానే లేదు. ఈ మడిని చూసి అదంతా గుర్తుకొచ్చింది" చెప్పింది అవ్వ.

మాటల్లోనే ఆ దోవ మలకవకు మల్లుకుంటిమి. తిర్నాలలో ఏమేమి తీసుకోవాల్నో అవ్వకు చెబతా నడస్తా ఉండాను. అవ్వ ఊకొడతా వస్తా ఉండాది. మోకాళ్ల దంక దోయితి కట్టుకుని, పైన జుబ్బా వేసుకుని, బుజాన పైపంచి, చెవులకు ఎర్రరాయి పోగులు, చేతిలో ఊతకట్టి, నోటినిండా వక్కాకుతో చెయ్యెత్తు మనిసి ఎదురుపడినాడు.

"ఏమే వసంతీ, ఎన్నాండ్లు అయిందే నిన్ను చూసి, ఏడకి పోతా ఉండావు, బాగనే మల్లాడతా ఉండావే, ఇది ఎవుతే.." అంటా మాయవ్వని అడిగినాడు.

"ఇది నా మనవరాలు సామీ, ఇది తిర్నాలకు పోవల్లంటే తోడుకుని పోతా ఉండాను సామీ" అని చెప్పింది అవ్వ.

"సరే లేయే.." అని ఆయప్ప జోబిలో చెయ్యేసి, పిసికి పిసికి పది రూపాయల నోటుని తీసి "ఇందే, ఏమన్నా తీసుకో" అనేసి పొయి నాడు. ఆయప్ప అట్ల పోతానే ఆ పది రూపాయల నోటుని చించిపారేసింది మాయవ్వ. దాన్ని చూసి "అవా అవా, ఏల డబ్బుల్ని చించేస్తివి. ఆ తాత ఎవురవ్వా" అంటిని.

"తాతా కాదు, తాటిముట్టీ కాదు, వాని పేరు వరదారెడ్డి. ఒగబ్బుడు వాని ఉచ్చలు దియిటీ అయి మలిగినాయి, అట్లా నా బట్ట. వరదారెడ్డి అంటే అందురికీ అదురు. మన ఊర్లో అర్ధంమంది, వీనింటి కాడ జీతానికి ఉన్నోళ్లే. వీని కంట్లో పడే ఒగ ఆడదాన్నీ వది లేదిలే. అబ్బుడు మీ యమ్మ పసిబిడ్డ. తొలినెల పొయి, రెండో నెలలో పడింది. ఆ వరదారెడ్డోళ్లకే రాగిమడి నాటేకి పొయింటి. పసిబిడ్డ తల్లుల్ని అయితే రెండుమాట్లు బిడ్డకు పాలు ఇచ్చేకి అంపిస్తారు. రెడ్డోరమ్మ సంగటి తట్టను కానగమాను కింద దించి 'రాండ్రా తిందురు' అని పిలిచింది. అందురుమూ మునాలు నాటతా ఉండాము.

'మేయ్ నువ్వు బిడ్డకు పాలిచ్చేకి పోవల్ల కదా. బిరిన్న తినేసిపొయి, బిడ్డకు పాలిచ్చి, మల్ల మేము పనిలోకి దిగేయాలకు వచ్చేయి' అన్నారు మావోళ్లు. నేను గబగబ నా మునం నాటుకుంటా గడ్డకు వచ్చి కాళ్లూ చేతులూ కడిగి, ముద్ద వెయిపించుకుని అదరబదర మింగి, కాలవలోని నీళ్లను రెండు దోసిళ్లు తాగి దోవకు యెల్లబారితిని.

అది చెరుకుతోటల కాలం. ఆపక్క చెరుకుతోట, ఈపక్క చెరుకుతోట. నడానుండే గెనుము మింద ఆ తోటల్ని దాటితేనే దోవలో పడేది. ఆ దోవంటి ఇంటికొచ్చి, బిడ్డకి పాలు ఇచ్చి, బిడ్డను ఉయ్యాల్లో యేసి, మా అత్తతో చెప్పేసి బిరిబిరిన్న తిరిగి వస్తా ఉండాను. పొద్దుపోతా ఉండాదే, ఏడ అరస్తారో' అని తకమిక లాడతా, యెనకాముందూ చూడకుండా నడస్తా నడీ చెరుకుతోటలోకి వస్తిని. గబక్కన నా ముందుకొచ్చి నిలబడినాడు



వరదారెడ్డి. వాన్ని చూసి నాకు ఒళ్లంతా అదరప వచ్చింది. మాటా పలుకూ లేకుండా నన్ను అట్నే ఎత్తి బుజాన యేసుకుని తోట లోపలికి పొయ్యేసినాడు. అరిస్తే ఎవురికీ విన పడలేదు. 'సామీ పచ్చి ఒళ్లు సామీ' అని ఏడిసినా వదల్లేదు. ఆపొద్దు వాని చేతిలో చిక్కి పోతిని.

తలకాయ అంతా చెదిరిపోయింది. ఒళ్లంతా చెమట్లు పట్టేసినాయి. అదరతా అదరతా మడికాడికి పోతిని. 'ఏమే ఇంతసేప యింది వచ్చేదానికి' అని అడిగిరి మావోళ్లు. నా వాలకం చూసి, 'ఏమయిందే అట్లుండావు' అని గుచ్చిగుచ్చి అడిగిరి. నేను ఏమి చెప్పేది. చెప్పుకుంటే బగిసాట్లు కదా. 'వస్తా ఉంటే చెరుకుతోటలో ఎత్తుగెనుము జారి, పడిపోతిని' అని అపద్దం చెప్పితి. ఈ కత ఇంతవరకూ ఎవురితోనూ చెప్పలేదు. ఇబ్బుడు నీతో చెప్పితి. అట్లా పొరంబోకు నాబట్ట వాడు" వెతపడతా చెప్పింది మాయవ్వ.

మేము మల్లా దోవంటి పోతా ఉండాము. దోవలో చిక్కే చెనిక్కాయంటా సీతారంకాయంటా బలసకాయంటా, అదొకటి ఇదొకటి ఎగరేస్తా నడస్తా ఉండాను నేను. నాకు ఆ వయసులో కడుపుమంటా కాలిమంటా తెలిస్తే కదా! నీళ్ల దప్పికి అయింది.

"ఓ అవా, నాకు దప్పి, నేను నీళ్లు తాగాల" అంటి అవ్వతో.

"అదో, ఇంక రొంత దూరాన సత్రం ఉంది. ఆడుండే బాయికాడ తాగుదువు పద" అనిందవ్వ.

సత్రంకాడికి బిరిబిరిన్న పొయి, నీళ్లు తాగి, అలుపు ఆర్చుకుంటిమి. ఎండ మిడిమేలంగా కాస్తా ఉంటే, రొంతసేపు సత్రంలో పణుకుంటిమి.

"ఒగనాడు రెయ్యంతా, బిడ్డల్ని యేసుకుని, ఈ సత్రంలోనే ఉండిపోతిని" ఎబ్బుడి గేపకాన్నో గెలుక్కుంటా అనింది అవ్వ. 'ఎందుకవ్వా' అని నేను అడక్కుండానే ఆ గేపకపు ముడిని విప్పింది.

"అబ్బుడు కట్టన్న కరువు. మనుసులకయితే కలోగంజో దొరకతా ఉంది కానీ, గొడ్లమేతకి చానా ఇక్కట్టు అయిపోయె. మన ఇంటికాడ రెండు ఆవులు ఉండె, పసావు ఒగటి బొడ్డావు ఒగటి. ఆ వరుపు కాలాన పిడికిడు పచ్చికసువు లేక బీళ్లన్నీ మాడకపొయినాయి. ఏడనో ఒగతావ, పెద్దపెద్ద బావుల కాడ, అంత కసువు దొరకతా ఉండింది.

ఒగనాడు, నా జతగత్తి రమని వచ్చి 'మేయ్ కసువుకు పోదాము రా' అని పిలిచింది నన్ను. సరే అని కొడివిలి ఎత్తుకుని దానితో పోతిని. అది పోతా పోతానే యెల్లమొళ్ల తోటలో జొరపడింది. వాండ్లు ఏమన్నా అంటారేమోనే అని నేను అంటా ఉంటేనూ అది విన్లేదు. సరి వాండ్లు చూడకముందరనే రొంత కోసుకుని పోవచ్చు అనుకుని, దిగువ కయ్యిలో రమనీ, ఎగవ కయ్యిలో నేనూ కసువు కోస్తా ఉండాము. యెల్లమోళ్లలో బుచ్చన్న అని ఉండె. కచ్చి నాబట్ట. మేము పడతుండే ఆత్రాన్నంతా మరుగ్గా గమనిస్తా ఉండాడు. రమని ఎట్లనో వాన్ని చూసేసింది. నన్ను పిలసకుండానే మెల్లింగా జారుకునింది. ఆ నాబట్ట వచ్చి నా వెనకాల నిలపడినాడు. నీడలు కదలాడి చివక్కన లేసి వెనక్కి తిరిగి చూసితి.

'మా సొమ్ము అయితే మీకు కావల్ల. మీ సొమ్ము మాకు ఈగూడదా' అన్నాడు. 'లేదు సామీ, ఈపొద్దే ఇట్లొస్తి, ఇంకెబ్బుడూ రాను' అంటి. 'అదంతా కాదు, ఇబ్బుడే ఇస్తావా లేదా' అనె వాడు. ఒరే వీని పెద్దలకు నా సొడు, ఈపొద్దు వీని చేతిలో చిక్కిపోతినే. ఎట్ల తప్పించుకునేది' అనుకుంటా 'ఓయప్పా! నేను ఈపొద్దే బయట ఉండాను. నా దగ్గరికొచ్చి ఏమన్నా అయితే చెడ్డపేరు. మన్నాటికి మూడు దినాలు అయితాయి. ఆపొద్దు ఇంటికి వస్తాను. నీ పని గడపతాను' అంటిని. 'నిజంగా వస్తావా' అనెవాడు. 'నీతోడు, వస్తాను' అని చెప్పి తప్పించుకుని వచ్చేస్తి. మల్లా నేను ఆ తట్టుకే పోలేదు.

వాడు దానిని లోపల్నే పెట్టుకుని, నా మింద కచ్చి పెంచుకున్నాడు. ఒగనాడు మనింటి తట్టుకి వచ్చి మీ తాతతో 'ఒరేయ్ నీ పెండ్లాము మా ఇంట్లోకి దొంగతనానికి వచ్చింది' అని ఇంకా ఏదేదో చెప్పినాడు. ఆ రెయ్యి మీ తాత, కన్నూ మన్నూ కానకుండా తాగివచ్చి, నన్ను కొట్టి, ఇంట్లోనింటి యెల్ల తరిమేసినాడు. ఆపొద్దు రెయ్యి అంతా ఈ సత్రంలోనే తలదాచుకుని, తెల్లారినంక ఇంటికి పోతి" అంటా నిలిపింది మాయవ్వ.

"ఈ సంగతుల్నంతా నువ్వు ఎవురితోనూ ఏల చెప్పలేదు" అని అడిగితి.

"చెప్పేది ఏంటికి. మన మాదిగిండ్లల్లో ఆడోళ్లు, ఊర్లోవాండ్లకే కాదు, మొగుళ్లకీ అగ్గవే. బయట పెట్టుకుని బగిసాట్ల పాలు అయ్యేది తప్పించి, ఒనగూరేది ఏముంది" అనింది అవ్వ.

'ఆపొద్దు తిర్నాల సంబరంలో అవ్వ మాటల్ని మరిచిపోతిని కానీ, ఇబ్బుడు తలుచుకుంటే కూడా మాయి ఎంత అగ్గవ బతుకు లబ్బా' అనిపిస్తుంటాది.

*రచయిత్రి ఫోను : 9652802460*

---

కవిత

## జబ్బు ఎగిరిపోయింది!

తాతయ్య చెయ్యి చూసి
పెదవి విరిచాడు డాక్టరు గారు
ఆయన యింకెంతో కాలం
బ్రతకడనేశారు
బావురుమంది బామ్మ
గోలుగోలు నేడ్చింది అమ్మ
నాన్నకి కళ్ళనీళ్ళాగడం లేదు
తాతయ్యకీ అర్థమైపోయింది
ఆయన కళ్ళెమ్మటా కన్నీళ్ళు

అందరూ బ్రతికే వున్నారు
ఎందుకేడుస్తున్నారు వీళ్ళు?
తాతయ్య చెయ్యిపట్టుకున్నా
తాతయ్యా! నీకు నేనున్నానన్నా
నేనుండగా నీకే బెంగా లేదన్నా
మా నాయనే!
అంటూ కౌగిలించుకుంది బామ్మ
మా బంగారుతండ్రీ! అంది మా అమ్మ
'ఐయామ్ ప్రౌడాఫ్ మై సన్' అంటూ
ముద్దు పెట్టాడు మా నాన్న
లేచి కూర్చున్నాడు తాతయ్య!
సాయంకాలం యిద్దరం షికారుకెళ్ళాం
తాతయ్య బాల్ వేశాడు
నేను బౌల్ కొట్టాను
నేను బాల్ వేశాను
తాతయ్య బౌల్ కొట్టాడు
జబ్బు ఆకాశానికెగిరిపోయింది.

**–డి. నటరాజ్**
94404 28597

శంకరభాష్యం

-రాణిశివశంకరశర్మ

# గోవులొస్తున్నాయి జాగ్రత్త

విప్లవ రచయిత రావిశాస్త్రి గారు 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' అనే పేరుతో నవల రాశాడు. ఈ నవలలో శాంతియుతంగా సౌమ్యంగా జీవించే మనుషులు అవసరమైతే అన్యాయంపై కొమ్ములు విసురుతారని చెప్పడానికి గోవుల్ని ప్రతీకలుగా తీసుకున్నాడు.

గోముఖ వ్యాఘ్రం అనే పదబంధం అందరికీ తెలుసు. ఇప్పుడు గోవులే పులుల కన్న యెక్కువగా భయపెడ్తున్నాయి. అటువంటి ప్రమాదకర ప్రతీకగా మార్చేస్తున్నారు మతోన్మాదులు.

ఆహార ఫాసిజం మితిమీరడంతో గో మాంసం తిన్నారన్న నెపంతో హత్యలు కూడా జరిగిపోతున్నాయి. గోఘ్నః అనే పదానికి అతిథి అని రూఢి అర్థం. దాని అసలు అర్థం వ్యుత్పత్తి అర్థం యేమిటంటే గోవుని చంపినవాడు అని. అతిథి ఇంటికి వస్తే గో మాంసాన్ని వడ్డించి వార్చేవారన్న మాట. బ్రాహ్మణ శ్రేష్టుడైన విశిష్టుడు అతిథిగా వచ్చిన జనక మహారాజుకి గోమాంసంతో ఆతిథ్యం యిచ్చాడని మహాకవి భవభూతి ఉత్తర రామ చరితంలో రాశాడు.

అంటే గోవుని చంపేవాడు అనే పేరు మ్లేచ్ఛులకీ లేదు. అస్పృశ్యులదీ కాదు. నిజానికి అస్పృశ్యుడి పేరు 'శ్వపాకః' కుక్క మాంసం తినేవాడని దీని అసలు అర్థం. ఉత్కృష్ట జంతువుగా భావించబడిన ఆవు బ్రాహ్మణుడికీ, అతినీచ జంతువుగా భావించబడిన కుక్క అంటరాని వారికీ ప్రతీకగా వాడబడిందని వెండీడోనిగర్ అనే పరిశోధకురాలు రాశారు. (హిందూయిజం-యాన్ ఆల్టర్నేటివ్ హిస్టరీ) మరి అతి పవిత్ర జంతువూ, జంతువుల్లో బ్రాహ్మణుడైన గోవు గోమేధం పేరుతోనూ, అతిథి మర్యాద పేరుతోనూ ప్రాచీన కాలంలో యెందువల్ల వధించబడింది? ఉత్తమ జంతువు మాంసాన్నే ఉత్తములుగా శిష్టవంశ సంజాతులుగా భావించుకొనేవారు తింటారు. అంతే కానీ నీచ జంతువుగా భావించబడే జంతువు మాంసాన్ని కాదు.




అందువల్ల గోవుని పూజించేవాళ్ళూ, గో మాంసం తినేవాళ్ళూ ఇద్దరూ కూడా గోవు పట్ల వ్యతిరేక దృష్టి లేనివాళ్ళే. అందుకే ముస్లింలు పందిమాంసం తినరు. ఎందుకంటే-పంది అంటే వారికి అసహ్యం.

అతిథి మర్యాదకీ గోమాంస భక్షణకీ గల సంబంధం ఎటువంటిది? గిరిజనులైన గోండులలో గోమాంస భక్షణ వుండేది. కారణం ఏమిటంటే గిరిజనులలో సామూహిక తత్వం ఎక్కువ. పదిమంది కలిసి భోజనం చెయ్యాలంటే పెద్ద జంతువుని వధించడం అవసరం. కోడి మాంసాన్ని ఎక్కువ మందికి వడ్డించడం చాలా ఖర్చుతో కూడిన పని. గొడ్డుమాంసం సామూహిక తత్వానికి ప్రతీక. (ట్రైబ్స్ ఆఫ్ ఇండియా-స్ట్రగుల్ ఫర్ సర్వైవల్-క్రిస్టాఫ్ ఫాన్ ఫ్యూరర్ హై మన్ డాఫ్)

గ్రామదేవతలకి కూడా ఆవుని కాక పోయినా దున్నపోతుల్ని బలియిచ్చేవారు. గోండులైతే గోవునే బలియిచ్చేవారు. క్రైస్తవం ప్రభావం, క్రైస్తవాన్ని అనుసరించిన ఆర్య సమాజం ప్రభావం యీ బలుల సంస్కృతిని క్షీణింపజేసింది. దీనికి వ్యక్తివాదం ప్రబలడం కూడా కారణం.

బ్రిటీష్ ప్రభావంతో ఆధునిక మత సంస్కరణవాదులు గ్రామీణ సంస్కృతులపై యీసడింపుని పెంచి పోషించారు. దీనిలో భాగంగా గోవధ నిషేధంపై ప్రచారం మొదలుపెట్టారు. ముస్లింల లోనే కాదు. గిరిజనుల్లోనూ, దళితుల్లోనూ కూడా గోమాంస భక్షణ వుండేది. ముస్లింల ఆహారంతో తమకి గల పోలికని జాంబపురాణంలో దళిత కళాకారులు స్పష్టం చేశారు. జాంబపురాణంలో జాంబవంతుడనే మాదిగల వంశ మూల పురుషుడు కామధేనువుని చంపిన తర్వాత, తురక మంత్రులు చదివి హలాల్ చెయ్యమని కత్తి శంకరుని చేతికి యిచ్చినట్లు కథ వుంది. ఈ కథ ఆహారంలో దళితులకీ ముస్లింలకీ గల సారూప్యాన్ని పురాణీకరిస్తుంది.

ఆధునిక సంస్కరణ వాదం యీ

ఉమ్మడి సంస్కృతిని దెబ్బ తీసింది. క్రైస్తవ పాశ్చాత్య సంస్కృతికి కులంతో పని లేదు. అది అందర్నీ ఒకేలా ప్రభావితం చేసింది. ఆర్య సమాజం అనే మత సంస్కరణ సంస్థ వల్ల ప్రభావితుడైన భాగ్యరెడ్డి వర్మ అనే దళితుడు గోవధ నిషేధాన్ని కోరుతూ ఉద్య మించడంతో, నైజాం నవాబు అమలు పరి చాడు. (భాగ్యరెడ్డి వర్మ కుమారుడు ఎం.బి. గౌతమ్‌తో ఇంటర్వ్యూ-ఆంధ్రజ్యోతి డైలీ-10-11-2002).

నిజానికి బ్రాహ్మణులు గోవధ నిషేధాన్ని కోసం ఎప్పుడూ ఉద్యమించలేదు. నిజానికి బ్రాహ్మణులు మాంసాహారానికి వ్యతిరేకులు కాదు. ఎందుకంటే వర్ణధర్మం ప్రకారం అంద రికీ ఒకేరకమైన ఆహారపు అలవాట్లు వుండే అవకాశం లేదు. సృష్టి సత్వం రజస్సు తమ స్సులనే గుణాలు కలిగినది కనుక ఆహార అలవాట్లలో తేడాలు సహజమని కంచి పర మాచార్య అన్నారు. మాంసాహారాన్ని సర్వా త్మనా ఖండించడం తగదని ఆయన అభి ప్రాయం.

వారి వారి వృత్తులను బట్టి జీవన విధా నాన్ని బట్టి గోమాంస భక్షణ గురించి విభిన్న అభిప్రాయాలు వుంటూ వచ్చాయి. గంగి గోవుపాలు గరిటెడైనను చాలు అన్నాడు వేమన. ఇంగ్లీషు దొరలు భక్షించడం వల్ల గోజాతి క్షీణిస్తోందని బాధపడ్డాడు. సంఘ సంస్కర్త జ్యోతిబాపూలే (గులాంగిరీ) బీఫ్, భగవద్గీత ఈ రెండూ భారతీయులు డైన మిక్‌గా తయారవడానికి అవసరమన్నాడు వివేకానంద.

వ్యవసాయదారులు గోవుని పోషిం చారు. ఎద్దుల ఉత్పత్తికీ, పాలకీ అవి అవ సరం. మాదిగ వారికి చెప్పులు కుట్టే వృత్తికీ, ఆహారానికీ ఆవు అవసరం. ఇద్దరికీ గోవు ప్రధానమే. క్రమేపీ శాకాహారులుగా మారడం వల్లనూ, గోమాంసభక్షణ మానివేయడం వల్లనూ బ్రాహ్మణులకి గోవు అనేది ఒక ప్రతీకగా మిగిలిపోయింది. అన్ని కోరికలనీ నెరవేర్చే కామధేనువుగా దేవతల ఆవుగా పురాణీకరించబడింది.

బ్రాహ్మణులు తార్కికంగా కూడా గోవుని వొక వ్యక్తిగా కాక 'జాతి'గా చూశారు. అంటే ఆవులు నశించవచ్చు. ఆవు అనే జాతి నశించదు. ధర్మకీర్తి లాంటి బౌద్ధులు మాత్రం గోవు జాతి కాదు. వ్యక్తి అనే భావించారు. అందుకే బౌద్ధ జైనాల ప్రభావం వల్లనే మాంసాహార నిషేధం మొదలైంది.

బ్రాహ్మణులెప్పుడూ మాంసాహార నిషేధం కోసం పట్టుబట్టలేదు. గోవుని పూజించడం వెనుక, గోవు సెంటిమెంటు వెనక కుల తత్వాన్ని జాతి వివక్షతనీ చూడడం సరి కాదు. కంచె ఐలయ్య గారి లాంటి వారు యిదే చేస్తున్నారు. గోవుని హిందూవాదులు మత తత్వ సింబల్‌గా మార్చారు. దాని వెనుక పాశ్చాత్య భావజాలం దాగివుంది. హిందుత్వ భావజాల మూలపురుషుడు సావర్కార్ గోవులని పూజించడాన్ని పరిహాసం చేశాడు. మార్క్సు కూడా పరిహాసం చేశాడు. కానీ గోవు చేసిన పాపమేదీ లేదు. క్రమేపీ హిందూ వాదులే దాన్ని మత ప్రతీకగా మార్చేశారు. పరమత ద్వేషం కోసం వాడుకున్నారు. స.వెం.రమేశ్ నక్కల దాడి నుంచి రక్షించి, తాత తనూ కలిసి ఆవుని యింటికి తోలుకు రావడాన్ని, దాన్ని ప్రేమగా సాకడాన్ని మంచి కథగా మలిచాడు. (ప్రళయ కావేరి కథలు) ఆవు బ్రాహ్మణునికి పురాణ ప్రతీక మాత్రమే. శూద్రులకి జీవితంలో పెనవేసుకుపోయిన ప్రేమాస్పద జీవి. లంబాడీ జాతివాళ్ళు ఆవుల మందల్ని పోషించడాన్ని నేను పలనాడులో కళ్ళారా చూశాను.

జీవితంలోనూ, వృత్తుల్లోనూ, ఆహారపు అలవాట్లలోనూ, భాషలలోనూ బహుళత్వమే మన గ్రామీణ జీవితం. యీ బహుళత్వం, వైవిధ్యం దానికదిగా శత్రువైఖరి కలిగి లేదు. అటువంటి శత్రువైఖరిని కలిగించేది ఏది? దారి తప్పిన రాజకీయమే, పాశ్చాత్య వ్యక్తి కేంద్రిత రాజకీయమే. యీ రాజకీయం మను షుల వైఖరులలోని సహస సిద్ధమైన వైవి ధ్యాన్ని వైరుధ్యంగా చూపి నిప్పు రాజేస్తుంది.

ఈ రాజకీయం బారిన పడకుండా వుండాలంటే, మనం మన సంస్కృతిలోని వైవిధ్యాన్ని ఆవాహన చేయాలి. అప్పుడు గోవు క్షీరాన్నీ, మాంసాన్నీ, మనకాళ్ళకి చెప్పుల్నీ కూడా అందజేయగలదనీ మనం గుర్తిస్తాం.

గోవు తల్లే. కాదనలేం. భూమి కూడా తల్లే. పొద్దుటే మంచం దిగేటప్పుడు భూమిని క్షమించమని ప్రార్థించి మంచం దిగాలని పెద్దలు చెప్పేవారు. ఎందుకంటే భూమి తల్లి కదా అని కాలు మోపకుండా వుండలేం. భూమిని తవ్వకుండా వుండలేం. భూమిలో ప్రాణం యెక్కడ వుందని ప్రశ్నించిన వ్యక్తి భారతీయ సనాతన ధర్మం అంటే తెలియని వాడు. ఆత్మ వ్యాపించని స్థలం లేదు. చెట్ల హృదయవేదనని కూడా విన్న దేశం మనది. తల్లిని పురుటి నెప్పులకు గురి చేయనిదే జన్మ లేదు. పుట్టిన తర్వాత మరొక జీవి ప్రాణం హరించకుండా ఆహారం లేదు. ఆవుని ఆహా రంగా స్వీకరించాలా అని ప్రశ్నించే వాళ్ళు స్వీకరించకుండా వుండటమే మంచిది.

కానీ అందరికీ వొకే ఆహారం, వొకే భాష, వొకే జీవన విధానం, వొకే మతం వుండాలనడం ధర్మం కాదు. కేవలం ఆధునిక రాజకీయం.

ఆవుని గురించి వొక ప్రాచీనమైన కథ వుంది. ఆ కథ ఆహార రాజకీయాలకి చెంప పెట్టు లాంటిది. ఆవుపై పులి దాడి చేయ బోయింది. తన పిల్లలకి పాలు ఇచ్చి తిరిగి వస్తానని, అప్పుడు నిరభ్యంతరంగా తనని తినవచ్చని గోమాత అంటుంది. అలాగే పులి దగ్గరకి తిరిగి వస్తుంది. పులి దాని ధర్మబుద్ధిని చూసి వదిలేస్తుందనుకోండి. గోవుకి పులి తనని ఆహారంగా స్వీకరించడం ధర్మమని తెలుసు. ఆ ఆహార చక్రాన్ని ధర్మచక్రంలా కొనసాగించడమే సృష్టిక్రమమని, వైదిక మతమని దానికి తెలుసు. వివిధ గుణాలూ వివిధ ప్రవృత్తులూ గల జీవులు వొకే ఆహారం స్వీకరించడం కుదరదు. కంచి పరమాచార్య చెప్పింది కూడా అదే.

మాంసాహారం పాపం అని ఆవు ధర్మ పన్నాలు వల్లించలేదు. తనలాగే గడ్డి తిని బతకమని, అది అహింస అని గోమాత బోధించలేదు. శాకాహార ప్రాశస్త్యాన్ని ఉగ్గ డించలేదు. యీ కథలో పులి కాని గోవు కాని యెవరూ హింసావాదులు కాదు. వాటి జీవిత విధానం, దాని ప్రకారం ఆహారం... వీటిలో వైవిధ్యం సంభవించింది.

పులినీ ఆవునీ శాశ్వత శత్రువులుగా చూపడం నేడు రాజకీయ అవసరంగా మారింది.

రచయిత ఫోను నెం.73966 66942

–డా॥జి.ఎ.ప్రసాదరావు

# భారత జాతీయ గ్రంథాలయం



**అ**మ్మనుడి డిసెంబరు 2015 సంచిక 51వ పుట(3వ అట్ట)లో ఇచ్చిన జాతీయ గ్రంథాలయం వారి అవగాహన సదస్సు వార్తలో సూచించిన ప్రకారం ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాము. జాతీయ గ్రంథాలయానికి సంబంధించిన వివరాలను, చట్టాన్ని మన రచయితల కోసం, ప్రచురణకర్తల కోసం విజయవాడలోని ఆంధ్ర లొయోలా కళాశాల గ్రంథాలయాధికారి డా॥జి.ఏ.ప్రసాదరావు ఈ వ్యాసంలో తెలియజేస్తున్నారు. –సంపాదకుడు

**చ**రిత్ర గతిని మార్చిన పుస్తకాలు మరియు సాహిత్యాన్ని సామాన్యుడికి అందించడమే పౌరగ్రంథాలయాల పరమావధి. సమాజంలో భాగంగా, సమాజాభివృద్ధికి తోడ్పడుతూ, సమాజ అవసరాలు, సమస్యలు, సవాళ్ళను ఎదుర్కొనేందుకు మిగిలిన సంస్థలకు దీటుగా నిలుస్తున్నాయి నేటి పౌర గ్రంథాలయాలు.

కలకత్తా పౌర గ్రంథాలయాన్ని 1836లో స్థాపించారు. తొలుత యాజమాన్య నిర్వహణలో ఉండేది. ఒకేసారి లేదా మూడంచెలలో రు.300/–లు చెల్లించిన వారు యాజమాన్య సభ్యులు అవుతారు. అది ప్రభుత్వ గ్రంథాలయం కాదు, అయినా పేద విద్యార్థులు, ఇతరులు గ్రంథాలయాన్ని కొంతకాలం ఉచితంగా వినియోగించుకొనే అవకాశాన్ని కల్పించారు. అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్ మెట్‌కాఫ్, పోర్ట్ విలియం కాలేజీ గ్రంథాలయంలోని 4,675 సంపుటాలను కలకత్తా పౌర గ్రంథాలయానికి తరలించాడు. వీటితోపాటు అనేకుల వ్యక్తిగత గ్రంథ సముదాయాలు ఈ గ్రంథాలయ పుస్తక సేకరణకు మూలమయ్యాయి. ఆనాటి కలకత్తా పౌర గ్రంథాలయ తొలి యజమాని ద్వారకానాథ్ ఠాగూర్.

అప్పటి భారతదేశ గవర్నర్ జనరల్ లార్డ్ కర్జన్‌కు గ్రంథాలయాన్ని పౌరులకు పూర్తిగా అందుబాటులో ఉంచాలనే ఆలోచన వచ్చింది. ఇంపీరియల్ మరియు కలకత్తా పౌర గ్రంథాలయం రెండింటినీ ఎక్కువగా వినియోగించుకోవడం లేదని గమనించి, వాటిలోని సౌకర్యాలను మెరుగుపరచాలని భావించాడు. కొన్ని షరతులతో ఈ రెండు గ్రంథాలయాలను విలీనం చెయ్యడంలో కృతకృత్యుడయ్యాడు. కలకత్తాలోని మెట్‌కాఫ్ హాలులో 1903 జనవరి 30వ తేదీన ఇంపీరియల్ లైబ్రరీని పౌరులకు అందుబాటులోకి తేవడంతో అది దేశంలో మొట్టమొదటి పౌర గ్రంథాలయంగా ప్రత్యేకతను సంతరించుకుంది. 19వ శతాబ్ది

## ది డెలివరీ ఆఫ్ బుక్స్ (పబ్లిక్ లైబ్రరీస్) చట్టం, 1954 (D.B. Act, 1954)

ఈ చట్ట ప్రకారం దేశంలోని పుస్తక ప్రచురణ కర్తలందరు ప్రచురిస్తున్న పుస్తకాలు ఒక్కొక్క ప్రతి చొప్పున కలకత్తాలోని జాతీయ గ్రంథాలయానికి విధిగా పంపించి రసీదు పొందవలసి ఉంటుంది. జాతీయ గ్రంథాలయానికే కాక కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో నడుస్తున్న మూడు ఇతర గ్రంథాలయాలకు కూడా తమ ప్రచురణలను తప్పకుండా పంపించాలి. ప్రచురణ కర్తలు తమ స్వంత ఖర్చులతో రిజిస్టరు పోస్టు ద్వారా గానీ, వ్యక్తిగతంగా గానీ జాతీయ గ్రంథాలయానికి అందజేయాలి. ప్రచురణ తేదీ నుంచి నెల రోజులలోగా పుస్తకం పంపించి రసీదు పొందాలి. కాపీ రైటు పొందటానికి ఈ రసీదు జత చేయటం తప్పనిసరి. ఇలా పంపించే పుస్తకం వివరాలతో సహా ముద్రితమైన ప్రతులలో మేలు ప్రతిని జాతీయ గ్రంథాలయానికి పంపించాలి.

**ఇందుకు చేయవలసిన వాటి వివరాలు**

అ. పుస్తకాలను రిజిస్టరు పోస్టు ద్వారా గానీ, ప్రత్యేక దూత ద్వారా వ్యక్తిగతంగా గాని పంపించి అందుకు సంబంధించిన రసీదు పొందాలి.

ఆ. అందజేసిన ప్రతి పుస్తకం పైనా విధిగా ప్రచురణ తేదీ రాసి, 'ఈ పుస్తకం డెలివరీ ఆఫ్ బుక్స్ (పబ్లిక్ లైబ్రరీ) చట్టానికి (1954) లోబడి సమర్పించబడింది' అని స్టాంపు వేయాలి.

ఇ. పుస్తకం పంపించిన ప్రతి ప్రచురణకర్త వీలైనంత వరకు ఈ క్రింది వివరాలు లైబ్రేరియన్‌కి అందజేయాలి.

1) పుస్తకం శీర్షిక, విషయసూచిక, ఇంగ్లీషు భాషానువాదం, 2) పుస్తకాన్ని ఏ భాషలో రచించారు?, 3) రచయిత, అనువాదకుడు లేదా సంపాదకుని పేరు, 4) విషయం, 5) ప్రచురణ, ముద్రణ స్థలము, 6) ప్రచురణ సంస్థ పేరు, ముద్రణ సంస్థ పేరు, 7) పుస్తకం వెలువడిన తేదీ, 8) పుటల సంఖ్య, 9) పుస్తక పరిమాణం, 10) సంపుటి (ఎడిషన్) సంఖ్య, 11) ముద్రించిన ప్రతుల సంఖ్య, 12) పుస్తకం వెల, 13) కాపీరైటు యజమాని పేరు, చిరునామా.

పుస్తకాలు పంపించవలసిన చిరునామా : National Library of India, Belvendere, Alipore, Kolkata-700 027.

తొలిదశలో ఇంత చక్కగా నిర్మాణమై నిర్వహించబడిన గ్రంథాలయం యూరప్‌లో కూడా అరుదుగా ఉండేది.

గ్రంథాలయాన్ని ఆరంభిస్తూ లార్డ్ కర్జన్ గ్రంథ సేకరణ విధానం గురించి చెబుతూ "భారతదేశంలో ప్రచురించిన అన్ని పుస్తకాలు, ప్రామాణిక ఆచూకీ గ్రంథాలన్నింటిని చేర్చి దీనినొక అత్యున్నత గ్రంథాలయంగా రూపుదిద్దడమే ఈ గ్రంథాలయ ఉద్దేశం" అన్నారు. కలకత్తా పౌర గ్రంథాలయం కృషితో జాతీయ గ్రంథాలయ పుస్తక సముదాయంలో చాలా అరుదైన పుస్తకాలు, పత్రికలు చోటు చేసుకున్నాయి. భారతదేశ గెజిట్‌లో 'దీనిని ఒక ఆచూకీ గ్రంథాలయం'గా మలచి, విద్యార్థులకిది కార్యక్షేత్రంగా, భారతదేశంలోని రాబోయే తరాలకిది గిడ్డంగిగా ఉండాలన్నారు. అవకాశం ఉన్నంతవరకు, భారతదేశంలో అచ్చయిన, వ్రాసిన ప్రతి పుస్తకాన్ని ఏ సమయంలోనైనా చదవటానికి అవకాశం ఉండే విధంగా ఇంపీరియల్ లైబ్రరీని నిర్వచించారు.

భారతదేశం స్వాతంత్ర్య సముపార్జన అనంతరం ఇంపీరియల్ లైబ్రరీని జాతీయ గ్రంథాలయంగా మారుస్తూ, అక్కడి గ్రంథాలయాన్ని ఎస్‌ప్లనేడ్ ప్రాంతం నుండి ప్రస్తుతమున్న బెల్‌విడర్ ఎస్టేట్‌కు తరలించారు. 1953 ఫిబ్రవరి 1న నాటి కేంద్ర విద్యాశాఖామంత్రి మౌలానా అబ్దుల్ కలామ్ గ్రంథాలయాన్ని జాతికి అంకితం చేశారు. బి.ఎస్. కేశవన్‌ను తొలి గ్రంథ భాండాగారిగా నియమించారు.

**జాతీయ గ్రంథాలయ నిర్వహణ మరియు విధులు**

జాతీయ గ్రంథాలయం భారత ప్రభుత్వ పర్యాటక, సాంస్కృతిక మంత్రిత్వశాఖలోని, సాంస్కృతిక విభాగం క్రింద పనిచేస్తుంది. గ్రంథాలయాధికారిని డైరెక్టర్ జనరల్‌గా పదోన్నతి కల్పించి, వారి పర్యవేక్షణలో ప్రస్తుత గ్రంథాలయం నడుస్తుంది. వారి క్రింద వివిధ పదవుల్లో ఎందరో అధికారులు మరియు సమాచార అధికారులు ఉంటారు.

**విధులు**

1. దేశంలో ప్రచురించిన అన్నిరకాల అచ్చు పుస్తకాలను సేకరించాలి.
2. దేశానికి సంబంధించిన అచ్చు పరికరాలు, ఫొటోగ్రాఫిక్ రికార్డులు ఎక్కడ ప్రచురించినా సేకరించాలి.
3. జాతీయ ప్రాధాన్యతను సంతరించుకున్న వ్రాతప్రతుల సేకరణ.
4. దేశానికి అవసరమైన విదేశీ ప్రచురణల సేకరణ.
5. వాఙ్మయ, డాక్యుమెంటేషన్ సేవలు అందించడం.
6. ఆకరకేంద్రం (రిఫరల్ సెంటర్)గా ఉండడం.
7. ఫొటో కాపీయింగ్, రిప్రోగ్రఫీ సేవలు.
8. అంతర్జాతీయ పుస్తకాల అరువు, పుస్తకాలు పరస్పరం మార్చుకొను కేంద్రంగా వ్యవహరించడం.

పై విధులన్నింటిని భారత ప్రభుత్వం అంగీకరించింది. వాటికనుగుణంగానే జాతీయ గ్రంథాలయం పని చేస్తున్నది.

**వివిధ రకాల సేవలు**

పఠన మందిర సేవలు, అరువు సేవలు, ఇతర ప్రాంతాల సభ్యులు, అంతర్ గ్రంథాలయ అరువు విధానం, వాఙ్మయ సేవలు, రిప్రొగ్రఫీ సేవలు, పిల్లలకు సేవలు, సంపదను భద్రపరచే రసాయనిక పరిశోధన శాల, ప్రభుత్వ ప్రచురణలు.

*–రచయిత ఫోను :92488 50020*

డా॥ జె.వి.సత్యవాణి

# పండితారాధ్య చరిత్ర–విజ్ఞాన సర్వస్వం

**తె**లుగు సాహిత్య వినువీధిలో ఓ కొత్త ఉషోదయం శివకవి యుగం. తెలుగు సాహిత్య చరిత్రలు తరచి చూస్తే ఒక ప్రక్రియ పేరిట వెలసిన ప్రబంధయుగం, కొందరు కవులు స్వీకరించిన ఇతి వృత్తాన్ని ఆధారం చేసుకొన్న శివకవియుగం విశిష్టంగా అగుపిస్తాయి. ఈ యుగంలో ప్రతి కవి ఒక ప్రత్యేకతను కలిగిన వారే ప్రతి రచనా ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నదే! ప్రధానంగా స్మరించ వలసిన కవులు ముగ్గురు. 27మకుటాలతో శతకాధిక పద్య గుచ్ఛాన్ని అల్లిన ఆరాధ్యశైవుడు, మల్లికార్జునుడు; ప్రబంధ కవితా రీతికి తొలి అంకురాన్ని తొడిగిన తొలి రాజకవి నన్నెచోదుడు; దేశి కవితాలతకు వివిధ కుసుమాలు పూయించిన పాల్కురికి సోమనాథుడు. వీరశైవ సాహిత్యానికి త్రిమూర్తులని శివలెంకమంచన, శ్రీపతిపండితుడు, మల్లి కార్జున పండితుల్ని పాల్కురికి పొగిడినా తెలుగులో శైవసాహిత్యానికి పెద్దపీట వేసినది దేశికవితా ప్రసూనాల్ని ఘుమ్మనిపించిన పాల్కురికే! వీరశైవం ఆంధ్రకవితా వీధులలో కదను తొక్కింది, ఇతని కవిత్వం తోనే.

వీరశైవ మతప్రవక్త బసవన జీవితాన్ని జైనపురాణాల మార్గాన్ని అనుసరించి బసవపురాణంగా తీర్చిదిద్దాడు. తనకాలానికి కొంచెం ముందున్న ఆరాధ్యమత పరిపోషకాచార్యుని జీవితాన్ని పండితారాధ్య చరిత్రగా రూపించాడు. వృషాధిపుని కీర్తిని శతకంగా గానం చేశాడు. సీసాల మాలికలల్లాడు. అనుభవసారాన్ని బోధించాడు. తన రచనల్లో శివభక్తులకు వారి కథలకు చాలా గొప్ప స్థానాన్ని కల్పించాడు. శివ నామాన్ని, లీలల్ని కథించాలన్నా, శివభక్తుల కథల్ని వినిపించాలన్నా, శైవేతరాల్ని ఖండించాలన్నా ఒళ్ళు మరిచే పాల్కురికి, శివభక్తి, లేదా శివభక్తుల్ని కాస్త తక్కువ చేసి మాట్లాడినా సహించలేక కట్టుకున్న భార్యనైనా హింసించాడని వర్ణించాలన్నా వెనుకాడడు. భక్త్యావేశం ఎంత స్ఫుటంగా చూపిస్తాడో, అసహనాన్ని కూడా అంతే విస్పష్టంగా నిరూపిస్తాడు.

పాల్కురికి ప్రతిరచనా విశిష్టమైనదే! పండితారాధ్యచరిత్ర భక్తులు, భక్తుల కథలు, వారి లీలలు, శివభక్తి పారమ్యం, అన్యమత విద్వేషం, నిరసన, జంగమ లింగమార్చన, శివశాఖలు, పూజార్చనాది విధులు, లింగధారణ, విభూతి ధారణ, పాదోదకాది మహిమలు – చెప్పడంతో ఆగదు. ఇందులో మందులున్నాయి. రకరకాల వాయిద్యాలున్నాయి; పాత్రలున్నాయి; వస్త్రధారణ విధులున్నాయి; గీత నాట్య రీతులున్నాయి; రసవాద, మంత్ర, తంత్ర విధులున్నాయి. భౌగోళికాంశాల నుంచి శైవశాఖల దాకా ఎన్నో వివరాలున్నాయి. అందుకే ఇది అన్ని రచనల్లోకీ ఒక ప్రత్యేకమైన స్థానాన్ని ఏర్పరచుకుంది.

"*సత్కృతియన నూత్న సంగతి దనర తొమ్మిది రసములు దులు కాద, దాని యిమ్మడి వర్ణన లెసగంగ ద్విగుణమగు నలంకారంబు లసలార దాని ద్విగుణార్థభావముల్ దీటుకొనంగ తేటతెనుంగున ద్విపద రచింతు*" నని తన కవిత్వలక్షణాన్ని చెప్పుకున్నాడు. చెప్పు కున్నట్టే, అంతకు ముందు వెనుకా కూడా మళ్ళీ శ్రీనాథుడి దాకా ఎవరూ అందిపుచ్చుకోని స్థానిక కథలకు భక్తులకు ప్రాధాన్యతనిస్తూ రచన చేశాడు. కథ పండితారాధ్యుని చుట్టూ తిరిగినా, తక్కిన శివ భక్తుల కథలు సందర్భానుసారంగా చెప్తూ వస్తాడు. తానే "*వాయార భక్తుల వర్ణింప గంటి పాయక నా జిహ్వ పావనం బయ్యె, బ్రదికితి*" నని చెప్పుకున్నాడు. తమిళ ప్రభావమని విమర్శకులన్నా తెలుగులో వాయిని వ్యస్తపదంగా వాడింది మాత్రం, పాల్కురికి సోమనాథుడే!

**రసప్రశంస:** 1. నవరసాలు పండిస్తానన్న పాల్కురికి భక్తి శృంగారానికి తెలుగులో ఆద్యుడు. "*మగలకు మగడగు మత్పతి కవయ మగవాంఛ్రు నాంధ్రుగా మరుగుదు రనిన, మనసు గూడుట సోద్యమా (వ)పతి*" అని బసవన అనుకోవడంలో భక్తిశృంగారముంది. నంబి పరమనాచుల కథలో కొక్కోకాన్ని గురించిన ప్రసక్తి శృంగార రసం కదా!

2. హాస్యం సాధారణంగా కన్పించదు, ఎక్కడో వికార చేష్టలు మాటలు రూపం కాదు. పింగళి సూరనలా మృదుహాస్యం కాకపోయినా పెద వులు విచ్చుకొనే చిరునవ్వు వచ్చే విధానంగా కొన్ని పంక్తులున్నాయి. "*అలరుచు దానొక యయగారువోలె నిలవేషధారి జంగిలి యున్నవాడు వచ్చెదనకు జావు వడి తప్పదనుచు జెచ్చెర కుడిచియే చచ్చెద*" ననటంలో వెటకారం వినిపిస్తుంది.

అంచెన్న శివునితో బావమరిదిలా చేసిన మోటు హాస్యం

"*జడ్డలాడెదుకాక శంకర ఏను గ్రుడ్డినో మఱినీవు గ్రుడ్డివో చెపుమ కోలనిచ్చెదువాడు గుడికడనుండ జాలక ననుబెట్టి చనియె నింటికిని*"

3. రౌద్రం దక్షాధ్వర ధ్వంసంలోను, ప్రళయ లీలలోను ఉంది

4. బసవని మరణవార్త విని పండితుడు పలవించిన పట్టు కరుణ రసానికి ఆటపట్టు.

5. మడివాలు మాచయ్య కథలో వీర రసం.

6. మల్లికార్జునుడు దోనయ్యకు శ్రీపర్వతం మీద చూపించిన అద్భు తాలు అద్భుతరసావలంబిత స్థానం

7. వేమనారాధ్యుని కథలో రాజు శవం భీభత్సాన్ని,

8. పల్నాటిచోళుని వంశక్షయంలో భయానకం,

9. పండితారాధ్యుడు చేసిన లింగార్చన శాంత రసానికి– ఉదాహరణలు.

**వర్ణనలు:** మహాకావ్యంలో పద్దెనిమిది వర్ణనలుండాలని నన్నెచోడుడు తన కుమారసంభవంలో చెప్పాడు. ఆలెక్కకు మించి పోయాడు, పాల్కురికి. ఇతని వర్ణనల్లో ఆ పద్దెనిమిదే కాకుండా మరెన్నో చోటు చేసుకున్నాయి. ముప్ఫై ఆఱు అలంకారాలుండాలన్నది ఒక నియమం. పాల్కురికి రచనలో ఎన్నో అలంకారాలున్నాయి. ఉదా. "వడ్లును పెరుగు పిసుకు చందపు బిలిబిలి కృతి" ఉండకూడదనటంలోనే అలంకారం ఉట్టిపడుతోంది. కావ్యగుణదోషాలను ఏకరవు పెట్టాడు. సంస్కృత వాక్యాలను తెలుగులో వాడుతూ మధ్యమధ్య వాటిని విరిచి కూడా వాడతాడు. " తవశ్రియం మరుతో మర్జయంత రుద్రయత్తే – జనిమ చారు చిత్రమ్" ....... " మరుతో మర్జయంత నాశ్రుతిజ నిన రుద్రయత్తే జనిమ చారు చిత్రమనది"; ఆరాధ్యహస్త తోయజముల కెనయె? వివరింప శేషుని వేయి నాలుకలు – శివకవి మల్లయ్య జిహ్వకు సరియె" (అతిశయోక్తి)

**విశేషప్రాసములు:** హఠయోగ రాజయోగాది విభ్రాంతి – పటువగు పశుయోగ బంధంబు లేమి"

"మేధావి రుద్రుండు మిండసంగయ్య– మైథున రామయ్య మగతిల కవ్వ"

పాల్కురికి భాషలోని విశేషాలు ఇన్ని అన్ని చెప్పలేం. మచ్చుకి కొన్ని:

1. కస్వు, తర్గు (పదమధ్యాజ్లోపం)

2. కొంపోవన్ (కొని పోవన్ కు బదులుగా) వెల్విరియన్ (వెల్లివిరియన్ కు బదులు)

3. చిటిపొటి సమయంబులు ( ద్విత్వలోపం)

4. భారతంలో ఈcగులో అరసున్న ఉన్నా పాల్కురికి ఈగిలో అరసున్న వాడలేదు.

5. రేఫ శకటరేఫలు ఎక్కడ వాడాలో ఆపదాల పట్టిక పండితారాధ్య చరిత్ర ఆధారంగా తయారు చేయవచ్చు.

నిజానికి ఇది విద్యార్థులకు బాగా ఉపయోగపడుతుంది.

**సంధులు:** 1. యజమానులిండ్ల, కులహీనులిండ్ల – షష్ఠీ బహువచనం నకారం మీద సంధి.

2. క్రియా విశేషణముల మీద – మడియించినాతని

3. సంబోధనాంతముల మీద – అమ్మలారక్కలారని, ఓడులారేటికి

**విశేషప్రయోగాలు:** 1. చొళవాళి – చోళపాళి, చోళరాజ్యం

2. తెఱవేటకాడు – వలలు పరిచే వేటకాడు

3. ఒఱిమిడి విప్రులు – ఓర్వలేని బ్రాహ్మణులు

కావ్య సమ్మతమైనవే కాదు, వివిధ విశేషాంశాలు ఈ రచనలో చోటుచేసుకొన్నాయి.

**శైవశాఖలు:** వీరశైవం, కాలాముఖం, ఆరాధ్యశైవం వీటిని గురించిన ప్రసక్తి పాల్కురి రచనల్లో ఎక్కువ. పండితారాధ్యచరిత్ర మొత్తం ఆరాధ్య, వీర శైవ శాఖలు పెనవేసుకొన్న రచన. పండితుడు ఆరాధ్య శైవుడు, మాచిరాజయ్యాదులు వీరశివులు. లింగం చిదాత్మమైన బ్రహ్మం వంటివి, శివాగమ విశేషాలు ఇతని రచనలో కోకొల్లలు. వీరశైవాన్ని పెంచి పోషించాలనుకున్న పాల్కురికి బ్రాహ్మణ నిందకు, స్త్రీహత్యా వర్ణనకు కూడా వెనుకాడలేదు. బ్రాహ్మణ్యాన్ని పొగిడిన బసవన తండ్రిని, పండితుని మెచ్చుకొన్న వాటిని వివరించిన పాల్కురికి ఏ బ్రాహ్మణులను తెగిడాడన్నది కూడా ప్రశ్నార్థకమే! సూరసాని చేత దానికి జవాబు చెప్పించాడు." కర్మదృష్టుల చూడగా కులభ్రాంతి – ధర్మబద్ధంబై తోచు తత్త్వోక్షశైవ – ధర్మదృష్టుల చూడ తత్కుల భ్రాంతి – ధర్మేతరం బసద్ధర్మమై తోచు"

**భక్తులు:** చోడుడు, గుండయ్య, సిరియాలుడు, కళియంబనాయనారు, పిళ్ళనాయనారు, మాచయ్య, వెలిదేవుడు, వాగీశుడు మొదలైనవాళ్ళు.

**పువ్వులు:** కరవీరములు, చేవంతి, విరజాదులు, మల్లికలు, జాజులు, మారేడు పత్తిరి, తామరలు, నల్లకలువలు, కేతకి పుష్పములు, మొల్లలు, చెంగలువ.....

**పండ్లు:** నేరేటి పండ్లు, అరటి, దానిమ్మ, నిమ్మ, నారికేళాదులు.....

**బంధువులు:** పుట్టినింటివారు, అత్తయింటివారు, ఇజ్జలజ్జలవారు, ఇరుగింటి పొరిగింటివారు, కొడుకు, అయ్య, మామ, బావమరది, అత్త, అక్క అమ్మ......

**వేశ్యలు:** మిండెతలు, బండెతలు, ముచ్చులు, ఒడవరులు, తొట్టరులు, బొంకులపుటికలు, ముడియవిడుపులు, మృత్యుకన్నెలు, వారవనితలు, పసిడివాపులు, మందులమార్లు, కయ్యలకచ్చులు ... అని పలు పదాలతో వర్ణిస్తాడు.

**మంత్రతంత్రాలు:** బెలిదేవి వేమనారాధ్యుల కథలో పాముకాటుకు మందులు వేయటం గురించి వివరిస్తాడు. "అనుభవ వైద్యులు, శాస్త్రవైద్యులు, గారుడవర మంత్ర విదులు.... గారుడమంత్ర సిద్ధుండు" ....వచ్చారు. గారుడ మంత్రతంత్రౌషధములు పరమ మృత్యువు తక్క పాయు" ... నని " మెడత్రొక్కకున్న గారుడ క్రియ వల్కనేరకుండు' నని వివరించాడు.

**రసవాదం:** *"మంత్రమూలికావ్రాతసారమున– కరమొప్ప తద్రస కల్కంబు నొదివి – క్రమమొంద భాగసంఖ్యను మిత్ర పంచ – కము దాని కథరోత్తరముగ సంధించి – పొందుగా నందించి మందతీవ్రాగ్ను – లొందుపాక మెఱింగి, యూదించి, పుచ్చి – సాంగశీతలమైన యాఘుటికకును"* వజ్రమూష మందపుగాక తీర్చి ఔషధావళుల వేపనము వేసి రసవాదాన్ని నిరూపించాడు.

**పాములు:** వాసుకి, మణీనాగ, విమల కర్కోటక, కుముదాక్ష, కుముద శలపోతక, అనిల, శబల, అశ్వతల, విమలిన, పిండకర, వామన, కుహకోట, నఖ, మహోదర, హవిర్ముఖ, హేమశంఖ, నఖ, హవ్యకర్ణ, ధనంజయ, పంచరక, పరివర్త, కార్యక, శిఖినిష్ఠురక, మిత్ర, కల్మష, ఐరావత, శబల, కౌల, కౌశిక, తక్ష, ఆశేష, శంఖపాల, పుండ్రక, ముద్గక, గజ,దుర్ముఖ, మిత్రారి, దండపాద, గుళిక, రేణక, జనక, స్వర్ణకాది పాములను పేర్కొన్నాడు.

**సంగీతనాట్యాలు:** జతిగీతములు, గోడంగి గీతి, జతి తాళ గీతి, వరుస నడలు, జంగమకొట్లనడలు, కిన్నెరగానములు, ఖేచరత్వములు, జంగమ దరువులు, స్వర్గాంగణములు, కోడంగి ఆటలు, కోడంగాట, పేరిణీ, బహునాటకాలు, బహురూపాలు, వెద్దంగాలు, గడలపై ఆడే వారు, మ్రోకులమీద ఆడేవారు, నారంగబొమ్మలాట, భారతాదికథలాట, బొమ్మలాట, గంధర్వయక్షవిద్యాధర వేషాలతో పాడి ఆడేవారు, ప్రచ్ఛన్న వేషాలవారు, కన్నడ తమిళ ఆంధ్ర గీర్వాణ భాషల్లో పాడుకుంటూ

వెళ్ళిన భక్తుల్ని చూశానంటాడు. ప్రతి భాషలోను రాశాడు స్థలాభావం వల్ల అన్నీ ఉదాహరించడం లేదు. మద్దియలు, అందెలు, నిడుద పాటలు....భరతనాట్య లక్షణాన్ని దాదాపు 30 ద్విపదల్లో వివరించాడు. ఆకాశవీణ, కిన్నరవీణ, మొల్లవీణ, కౌమారవీణ, కుంభిక, విపంచిక వంటి పేర్లు అనేకం ఏకరవు పెట్టాడు. దండి, చిత్రం, దశహరం, రవణం, ద్రుక్కరం, గచ్ఛం, బారణ ముఖవాద్యం, జల్లణం వంటి వాయిద్యాలు లెక్కనేనన్ని ఈ నాడు గుర్తించలేని వాటి పట్టిక ఇచ్చాడు. కళిక, సరస్వతి, మాతంగ, పంచబ్రహ్మ, ధ్రువ, ఖంజర, మట్ఠె, వళి వంటి తాళాలను తెలియచేశాడు. మాందాళి, గౌళి, కుంభకం, మధుకరి, దేశి, కన్నడిక, ధన్నాసి, మాహురి, దేవప్రియ, పౌరణి, నాట, త్రినేత్రి వంటివి పాల్కురికి పరిచయం చేసిన రాగాలలో కొన్ని.

**వస్త్రాభరణాలు:** పొడవగు సంబువులు, పసిడి గొడుగులు, పావలు, లోహంపు పావలు, దంతంపు పావలు, రాగిపావలు, వాగెలపాదరక్షలు, దర్పణములు, చందనకాపులు, సాటికాపులు, కఱకంచుకాపులు, పచ్చడంబులు, పట్టుత్రాళ్ళు, పట్టువస్త్రములు, పట్టుతొంగళ్ళు, పట్టు వీణెలు, కుప్పుసములు, పటికము, సరంబులు, కావిపచ్చడములు, రుద్రాక్షలు, కావిదుప్పట్లు, మంజిళ్ళు, తోపులు, చల్లడాల్, పచ్చ డములు, రత్నకంబళులు, వెలిపొత్తిపచ్చడములు, బూరవడములు, పైడిబెట్లు, కంచుకబ్బములు, చంద్రసూర్యులు గల చీరలు, కంబళులు, మకుటములు, నంది మకుటములు, పులితోలు మకుటములు, రుద్రాక్ష మకుటములు, బోడతప్పరములు, హేమరజితరాగి నందినాగ కుండ లములు, వన్నెబెత్తములు, వలి బెత్తములు, వలయంబు బెత్తములు, మలబెత్తములు, గక్కు గౌరి, పొంజాయ బెత్తములు, సైరణకోలలు, లాకులు, కనుపదండములు, వెలిగొడుగులు, పట్టు గొడుగులు, గద్దెసంగరులు, సజ్జసంగరులు...... పట్టికలిచ్చాడు.చాలా వాటిని మనం ఇప్పుడు పోల్చుకోలేం.

**శైవక్షేత్రాలు:** శ్రీవారణాసి, దాక్షారామం, సోమేశు, సిద్ధవటం, గుడ్డవ్వపురం, విజయాపురం, సొన్నలికపురం, సౌరాష్ట్ర, గోదావరి తీరం, త్రిపురాంతకం, రామేశ్వరం, నేపాలం, కేదారం, సంతేరి, కాశ్మీరం, కన్నోజ, కొంకణం, కళింగం, చౌదహలక్ష, బంగాళభూమి, గుజరాష్ట్ర, మాళవభూమి, ద్వారవతి, హిమవంతం......

**పాత్రలు, ధూపాలు, పూజాద్రవ్యాలు:** బిందియలు, వడిగంబులు, అర్ఘ్యపాత్రలు, నూతనభాండములు, వంటపాత్రలు, వంశపాత్రలు ( ఇవి ఏమిటో ఎలాఉంటాయో మరి) ధూపదీపపాత్రలు, హోమపాత్రలు, రజతపాత్రలు, విడెములు, ఫలములు, కజ్జములు, సితపుష్పములు, మాలికలు, బిల్వపత్రి, పువ్వులు, పంచామృతములు, ఉత్తమాక్షతలు, దివ్యోదనావళులు, సుగంధములు, దశాంగం, ఆనంద్వతి, సురభి, ఆవర్తిధూపంబు, మలయానిలము, మహిసాక్షి, మద్ది, కలహంస, కామికామోద దివ్య జనవల్లభ ధూపములు.... ఈనాడు ఇన్ని రకాలు కనపడవు. భక్తునికీ భగవంతునికీ అనుసంధానం కూర్చే అంబికా దర్బార్, సైకిల్ వంటివి తప్ప! పూజలు ఎన్ని రకాలుగా చేయవచ్చో ఒక పట్టిక ఇచ్చాడు. అభిషేకాలనుంచి హారతులదాకా...

**సాహిత్యప్రక్రియలు:** స్తోత్రములు, శతకం, వర్ణాడంబరం, వ్యాసాష్టకం, రుద్రకవచం, శివతత్త్వసారం, దీపకళిక, మహానాటకం, ముక్తకావళి, గీతసూక్తాలు, భృంగీస్తవం, హరలీలలు, సహస్రనామాలు, అఖ్యత్తుమూ వర చరితలు, బసవపురాణం, గీతాలు,.....

మహిమప్రకరణం భక్తుల రుద్రాక్ష, లింగధారణల గొప్పతనాన్ని చెప్తే... వాదప్రకరణం శైవమాహాత్మ్యాన్ని నొక్కి వక్కాణిస్తూ అన్యమతాల్ని ఖండిస్తుంది. కాల స్థలాల్ని మనసులో ఉంచుకొని అన్ని విశేషాలని పరిచయం చేయలేక పోతున్నాను. కాని, పండితారాధ్య చరిత్ర– విజ్ఞాన సర్వస్వమనే అంశాన్ని నిరూపించుకోవాల్సిన అవసరం ఇక లేదు కదా! కవులు కేవల కవులుకాక మన తరతరాల సంస్కృతిని దాచి మనకందించిన బొక్కసాలుగా తమ రచనల్ని కూర్చిన ఆచారవ్యవహారా దుల ప్రవక్తలుగా గుర్తించాల్సిన అవసరం, తర్వాతి తరాలకి అందిం చాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

రచయిత్రి ద్రావిడ విశ్వవిద్యాలయంలో సహాచార్యులు

ఫోను: 9441134856



# తెనుగు లెంక సూక్తులు-6



'తెనుగు లెంక'
'అభినవ తిక్కన'
**తుమ్మల సీతారామమూర్తి.**

**ఏ కర్జమొరుడు సల్పిన**
**నీకుం గనులామ తిల్లు నీవొరుదెస నె**
**ప్డాకర్జము గావింపమి**
**చేకొనుమా పుడమియెల్ల జేజేల నిడన్**

భూమిమీద నివసించే ప్రాణులన్నింటిలో మనిషి తెలివైనవాడు. ఎంత తెలివైనవాడో అంత స్వార్థపరుడు. జంతువుల్లో ఉన్న నియమం మానవుల్లో కనిపించదు. ఒక సింహం మరొక జాతికి చెందిన జంతువును చంపుతుంది కానీ మరొక సింహాన్ని చంపడానికి ఇష్టపడదు. ఒక పులి ఆకలైనా పస్తుంటుంది కానీ మరొక పులిని చంపాలని అనుకోదు. మనిషి అలాంటివాడు కాదు. తనకు లాభం కలుగుతుంది అనుకుంటే జంతుజాలాన్నే కాదు, సాటి మనిషిని కూడా హింసించడానికి, హత్య చేయడానికి వెనుదీయడు. ఇది కేవలం మనిషిలో మాత్రమే కనిపించే దుర్గుణం.

జంతువుకు ఆకలయితేనే వేటాడి ఆకలి తీర్చుకుంటుంది. ఆకలి కాకపోతే జంతువులను చంపడానికి ప్రయత్నం చేయదు. మనిషి అలాంటి వాడు కాదు. ఆకలి లేకపోయినా తింటాడు. అవసరం లేకపోయినా విప రీతంగా సంపాదించి పోగు చేసుకోవడానికి ప్రయత్నిస్తాడు. ఇందుకోసం నీతి నియమాలు పాటించడు. న్యాయాన్యాయాలు విచారించడు. ధర్మా ధర్మాలు ఆలోచించడు.

మనిషి తాను సుఖంగా ఉండాలని అనుకుంటాడు. అందులో తప్పు లేదు. కానీ తన సుఖం కోసం ఇతరులను బలి చేయడానికి వెనుదీయడు. ఇది గర్హించవలసిన విశేషం. ఇతరులను కష్టపెట్టి అయినా తాను సుఖ పడాలనుకునే మనిషి, తన సుఖానికి ఇతరుల వలన ఆటంకం కలిగితే సహించలేడు. అగ్గిమీద గుగ్గిలమవుతాడు.

సమాజంలో ఒక వ్యక్తి మాత్రమే బాగుంటే సరిపోదు. సమాజం మొత్తం సమానంగా అభివృద్ధి చెందాలి. అప్పుడే సమతౌల్యంతో సమాజం ఆనందంగా ఉంటుంది. అలా కాకుండా ఒకడు పదిమందిని దోచుకొని తానొక్కడే సుఖంగా ఉండాలి అనుకుంటే, బాధితులు ఎప్పుడో తిరగబడ తారు. దాచుకున్నదాన్ని దోచుకుంటారు. సమాజం అస్తవ్యస్తమవుతుంది. మానవ మనుగడ అసాధ్యమవుతుంది. అందుకే సమాజంలో మనిషి బతకాలి. ఇతరులు బతకడానికి అవకాశం ఇవ్వాలి. ఆ విధంగా సమాజం సక్రమరీతిలో ఉండాలంటే ప్రతివ్యక్తీ ఇతరుల గురించి ఆలోచించాలి.

అందుకే తెలుగులెంక "ఏ పనిని ఇతరులు చేస్తే నీకు కోపం వస్తుందో, నీవు ఇతరులకు ఆ పని చేయవద్దు. ఆ నియమాన్ని పాటించే వ్యక్తిని లోకం నమస్కరించి గౌరవిస్తుంది" అని తెలియజేశాడు. ప్రతి మనిషి ఆ విధంగా ఉండగలిగితే లోకమంతా స్వర్గతుల్యమౌతుంది. అన్యాయాలు, అక్రమాలు ఉండవు. అధర్మం అంతరిస్తుంది. అందరూ ఆనందంతో అన్నదమ్ముల్లా జీవితం సాగిస్తారు.

–డా॥నాగభైరవ ఆదినారాయణ,
ఫోను : 98497 99711

కవిత

## వివక్షల కాడిని ఎగరదన్నే ఎద్దును –

ఒంగోలు గిత్తను
మానవాభివృద్ధి పొద్దును
మొహెంజొదారో ఎద్దును

నీ చేలో గీసిన సాళ్ళను
నీ జడ్డిగం ఎదబెట్టిన ఇత్తును
నా అడుగుల గంట మోగును
నీ ఆకలి గుంట పూడును

నీ మెరకల్లో అరకను
నీ నాగటి కర్రును
నీ ఆశల పంటను
నీ కాడి కింద అర్రును

నీ ఏరువాక సాగును
నీ కుప్పల గొప్పను
నీ బతుకు బండిని లాగే
బతికున్న మరను

నా చర్మం నీ కాలికి చెప్పు
నీ చేతికి దరువు
నీ దాహపు తిత్తి
నీ సరుకుల సంచి

నా కండలు కాకులకీ గద్దలకీ
కుక్కలకీ పురుగులకీ
కండలు పట్టించాయి

నా చియ్యలు
నీ తరాలను చేవెక్కించాయి
నా ముడుసులు నీ నోట్లో
రుచుల పిల్లింగోళ్ళై పాడాయి

నా పేడ నీ పొలానికి పిట్టు
నా మూత్రం నీ గింజలకు గంజి
నా గోరోజనం నీ రోగాలకు సంజీవనం

నా పిల్లల నోటికాడి పాలు
నీ పొయ్యిలో నెయ్యిగా మరిగాయి
నీ కడుపులో సల్లగా మారాయి
నీ తాపానికి పెరుగు మబ్బులయినాయి

నీ కమతానికి కలిమిని బలిమిని
నీ వినోదానికి గంగిరెద్దుని
నెయ్యికీ చియ్యకీ మూలం నా వీర్యం
అర్థమైతే నీ బతుకు మానవీయం

నెయ్యి తాగేవారితో నేస్తంగట్టి
చియ్యలు తినేవారిని చీకొట్టే
నీ జాతి వివక్షల కాడిని
ఇదిలిచ్చి తన్నే ఎద్దును నేను.

–కృపాకర్ మాదిగ,
9849905687

-డా॥వావిలాల సుబ్బారావు

# అవును...అసహనమే!

ఎందుకో చాలా అసహనంగా ఉంది. పాపం వాడేం చేశాడని! పుస్తకాలు పక్కన పెట్టి కాసేపు ఆడుకోవటానికి వెళ్లాడు. అందుకు వాళ్ల నాన్న బెల్టు పుచ్చుకున్నాడు. 'ఈ కాస్తకే అంత చేయాలా?' అని వాళ్ళ అమ్మ అసహనంగా గిన్నెలు నేలకేసి కొట్టింది. 'పిల్లవాణ్ణి ఆ మాత్రం మందలించటం తప్పా' అని ఆయనకు చేతనైన అసహనం ఆయన చూపించాడు. వీళ్ళ గోల చూసి సహించలేక పెద్దబ్బాయి పుస్తకాలు విసిరికొట్టి బయటికెళ్లాడు.

"ఎవరికీ ఓర్పు కాస్తయినా లేదు..." అంటూ పండ్లూడిన బామ్మ మంచంలో గతం తవ్వుకుంటున్నది.

"సరేలే చిన్నప్పుడు నేనెరగనా" అని చెప్పాడు ఇంటాయన- పేపర్లో తల దూర్చాడు.

ప్రభుత్వ పక్షం మీద చిన్న చిన్న వాటికే అసహనంతో పోడియంలోకి దూసుకుపోయే ప్రతిపక్షం. ఏమాత్రం విమర్శను సహించలేక, గతకాలపు పాలనను త్రవ్వి, వర్తమానానికి సమర్థనగా జమచేసే ప్రభుత్వ పక్షం.

మరో పేజీ తిప్పాడు. నిన్నటి దాకా అధికారం అనుభవించి- పీఠం దిగే సరికి- అసహనంతో అధికారపక్షంలోకి జంపులు! బొద్దూడని పుత్రరత్నానికి ఉన్నత పీఠం కట్టబెట్టటం కోసం అధినాయక శ్రేణుల అసహనం. ప్రేమను అంగీకరించకపోతే యాసిడ్ అసహనం. ఆ దేశం ఆటగెలిస్తే ఈ దేశం ప్రేక్షకుల అసహనం. ఓడిన ఆటగాళ్ళను స్వదేశానికి కూడా రానివ్వని అసహనం. అసహనంపై చర్చను నిర్వహించే 'అర్నబ్ గోస్వామి'కి టీవీలో అసహనం. ప్రకృతి వనరులను కొల్లగొట్టే అత్యాశతో అసహనం. కొల్లగొట్టినందుకు మనపై ప్రకృతికి అసహనం.

ఒక మహావక్త గంభీరోపన్యాసం : "భారతదేశం సహనానికి మారుపేరు. ప్రపంచ మతాలన్నీ ఇక్కడున్నాయి. సహనం మన సంస్కృతి. మన దేశం ప్రపంచానికి దర్పణం.. మనకెవరూ ఏమీ చెప్పనక్కరలేదు. అది మన రక్తంలో భాగం.." టపటపటప చప్పట్లు : బయటకు రాగానే 'అతి' సహనంతో కుమ్ములాటలు.




"ఇదంతా నిజమేనా మహాత్మా!" అంటూ ఆకాశంలోకి దృష్టిసారిస్తే చిన్న కునుకు పట్టింది. మహాత్ముడు (గాంధీగారు కాదు మరొకాయన) వచ్చాడు. నా అజ్ఞానానికి చిరునవ్వు నవ్వాడు. "ఎవ్వడూ సహనంతో పుట్టడు నాయనా! మొదట ఏడుపే అసహనంతో. అసహనమే జీవలక్షణం. తల్లి ఒడిలో చంటిపాప ఉంటే ఎడ పిల్లకు అసహనం. అసహనం అంటే అస్థిత్వ నిరూపణ కోసం పడే ఆరాటం. అసహనమే సహజాతం-సహనమే సంస్కారం. సహజాతాలను అవసరం బట్టి చక్కదిద్దుకోవడమే సంస్కారం. ఆ చక్కదిద్దుకోవటం పరిస్థితుల ఒత్తిడి బట్టి ఏర్పడుతుంది. శకులు దండయాత్ర చేస్తే హూణులు హడావుడి చేస్తే మనం ప్రక్కకు జరిగి చోటిచ్చామా? పోరాడి సర్దుకున్నామా! మహమ్మదీయ దండయాత్రలను మంగళవాద్యాలతో ఆహ్వానించామా? లాభం లేదని ఊరుకున్నామా! వైష్ణవుల పంగనామాలను శైవులు పిల్లులతో నాకించలేదూ! జైన మునులను 'ధనదపురం'లో శైవులు చిత్రహింసలు పెట్టలేదూ! ఎవరయితేనేం పాలించటమే కదా! బ్రిటీష్‌వారిపై పోరాటం ఎందుకు? -క్రైస్తవ దేశాలు ప్రేమకు మారుపేరు కదా! ఇస్లాం దేశాలపై అంతదూరం నుండి దాడి ఎందుకు? 'సల్మాన్‌రష్దీ' పుస్తకంమీద అంత అసహనమెందుకు. తస్లీమా ఏంతప్పు చేసిందట? ఇవన్నీ అసహనాలే. ఇంకా ఈలోకం సహన సంస్కారం తగినంతగా నేర్చుకోని మాట నిజమే. అందుకు అసహనం వస్తే ఎట్లా? తప్పనిసరి సహనం, ఓడి రాజీపడే సహనం, బలహీనతను గుర్తించుకొని ఒదిగే సహనం వరకే లోకం నేర్చుకున్నది. అహంకారం తగ్గించుకొని శత్రువులో సుగుణాన్ని కూడా గుర్తించి గౌరవించే సంస్కారం ఈ ప్రపంచమే నేర్చుకోలేదు.

ఒకటి చూడూ! అభివృద్ధి అందరి అభిలాషే గానీ అంతా నా కళ్లముందే, ఇప్పుడే జరగాలనుకోవటం- ఏమంటారు..దశాబ్ది పట్టే అభివృద్ధి పది నెలలకే జరగాలన్న ఆరాటంలో అసహనం లేదూ! భిక్షాపాత్రతో భూప్రదక్షిణలు అసహనం కాదూ! ఎక్కడా లేనంత 'సిటీ' కోసం మాయల పకీర్లను ఆశ్రయించటం ఏమిటి?

ఇతర్లలో అసహనాన్ని ప్రేరేపించకుండా జాగ్రత్త పడటం కూడా నేర్చుకోవద్దూ! అంతా దోచుకుపోయేవాడు ఏమీ దొరకని వాడిలో అసహనం పుట్టిస్తాడు. అనవసర ఆర్భాటాల

ఆడంబరంలో ఆ చివర ఉన్నవాడికి అసహనం కలిగిస్తాడు. ఏసీ బస్సులో వెళ్ళి ఏసీ గదిలో ఎబిసిడిలు చదివేవాడిని అందలం ఎక్కిస్తుంటే, చెట్టుక్రింద పలక బలపం గూడా లేనివాడికి అస హనం పుడితే అది ఎవడి తప్పు! అసహనాన్ని అణివేయడం అంటే అసహనాన్ని రెచ్చగొట్టటమే.

అసహనం ఒక ప్రతిక్రియ. ఈ ప్రతిక్రియకు జన్మనిచ్చిన ప్రేరణ క్రియను గురించి ఆలోచించ వద్దా! పసివాణ్ణి సాకే తల్లిదండ్రుల నుండి-రాజ్యాన్ని పాలించే పాలకుల నుండి- పాఠశాల గురువుల నుండి-దేశానికి సంస్కారాన్ని అందించే రచయితలు కళాకారులు వరకు సదా మననం చేయాలి. మన మాటలతో, చేతలతో ఎదుటివారిలో అసహనాన్ని సృష్టిస్తున్నామా? నిజమే! నామాట- నా చింతన- నా హక్కే. కానీ ఎదుట వాడిపట్ల నా బాధ్యత! హక్కుల సంఘర్షణే అసహనాల జన్మస్థలం. ఎవరికి వారు నేర్చుకొనే సంస్కారం సహనం. ఇది అన్ని జాతులకు లోపించిన గుణమే. ఏమంటారు?

నా కునుకు వదిలింది. కళ్లు నులుముకు న్నాను. పిల్ల వెధవ కాసేపు ఆడుకుంటానంటే నేనే అనవసరంగా తొందరపడ్డాను. నాకు సరిగా చదువు అబ్బలేదన్న కోపమే నా అసహనానికి కారణం అని నిదానంగా తెలిసింది.

రచయిత, అధ్యాపకులు.
ఫోను: 98664 02973

## కళింగలో తెలుగు ప్రాచీనత

24వ పుట తరువాయి

లలో -దేవాలయాలలో-ముఖ్యంగా ముఖలింగం, శ్రీకూర్మం, సింహాచలం, ద్రాక్షారామం ఆలయాలలో తెలుగు -ఒరియాలలో వేసిన శాసనాలు కన్పిస్తాయి. అచ్చతెలుగు పదమైన 'దాపల' ఎడమవైపు అనే పదం ఒరియా వ్యవహారంలో 'దహణో' కుడివైపుని సూచిం చేదిగా వాడుకలో వుంది. ఈ సందర్భంగా ఇరువురి ప్రముఖులు ఉదహరించిన వాక్యాలు చెబుతాను.

'ఒడిశారో సాంస్కృతిక ఇతిహాస్' గ్రంథంలో ఒడియాభాషలో అనేక తెలుగు శబ్దాలు కలిశాయని శ్రీ మహేష్ ప్రసాద్ దాస్ తెలిపారు.

ప్రసిద్ధ చరిత్రకారుడు యజ్ఞకుమార్ సాహు దక్షిణ భారతంలోని తెలుగు, తమిళ లిపుల ప్రభావం వల్ల ఒడియాలిపి గుండ్రంగా రూపుదిద్దుకున్న దన్నారు. అత్యంత ప్రాచీన కాలం నుండి కళింగ దేశంతో ఒడియా వారితో తెలుగువారికి చారిత్రక సాంస్కృతిక సంబంధాలున్నట్లు చెప్పవచ్చును.

-రచయిత్రి ఫోను: 08093520819

## ఆచార్య భావరాజు సర్వేశ్వరరావు గారు- కొన్ని జ్ఞాపకాలు

25వ పుట తరువాయి

చేశారు. 1982లో ఇండియన్ ఎకనమిక్ అసోషియేషన్ ప్రెసిడెంట్‌గా వున్నారు.

1983లో పరిశోధనలు చేయడానికి ది ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ డెవలప్‌మెంట్ అండ్ ప్లానింగ్ స్టడీస్ స్థాపించారు. యలమంచిలిలో వున్న భాగవతుల చారిటబుల్ ట్రస్టు (స్వచ్ఛంద సేవాసంస్థ)కు 1989 నుండి 1991 వరకు ప్రెసిడెంట్‌గా వున్నారు. 1989 నుండి గాయత్రీ విద్యాపరిషత్ (విశాఖపట్నం)కి ప్రెసిడెంట్‌గా వున్నారు. దేశంలోని అనేక ప్రసిద్ధి చెందిన సంస్థలతో ఆయనకు సంబంధాలు వుండేవి. తన 95వ ఏట 2010 సెప్టెంబర్ 23న ఆయన పరమపదించారు. అప్పుడు నేను. బందరు హిందూ కాలేజీలో ఎం.బి.ఏ కోర్సు డైరెక్టర్‌గా వున్నాను. అక్టోబర్‌లో ప్రపంచీకరణపై జాతీయస్థాయి సెమినార్ నిర్వహించాను. రూ.50,000 ఖర్చు చేసి సెమినార్ పేపర్లను సంపుటిగా ప్రచురించాను. దానిని సర్వేశ్వరరావు గార్కి అంకిత మిచ్చాను. ఆయన ఫోటో ప్రచురించి, ప్రముఖులు ఆయన గురించి ఏమన్నారో తెలియజేశాను.

**విశిష్ట వ్యక్తి :**

సర్వేశ్వరరావు గారు ఎవరికీ ఏమీ ఉపదేశించేవారు కాదు. ఆయన ఒక ఆదర్శ ప్రాయమైన జీవితం గడిపారు. జీవితం కొన్ని విలువలకు కట్టుబడి వుండాలనీ, అటువంటి జీవితమే అసలైన జీవితమని ఆయన భావించారు. తన ప్రవర్తన ద్వారానే ఇతరులు కొంత నేర్చుకోవాలని ఆయన తలంచారు. యువతపై ఆయనకున్న అపారమైన నమ్మకం చెప్పుకోదగ్గది. పెద్దలు పిల్లలకు ఆదర్శప్రాయులుగా లేరని ఆయన వాపోయారు. అందువల్లే సంఘంలో విలువలు కరువయ్యాయి. ఇదే అభిప్రాయం ఆయన గురువులైన ఆచార్య మామిడిపూడి వేంకట రంగయ్యగారు వెలిబుచ్చేవారు. ముఖ్యంగా ఈ దుస్థితి మన రాజకీయ రంగంలో కన్పడుతున్నది.

సమాజంలో జరుగుతున్న సంఘటనలపై ఆయన ఇచ్చే తీర్పులు ఆసక్తికరంగా వుండేవి. ఉదాహరణకు 1968లో ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థి సంఘం ఒక సభను ఏర్పాటు చేసింది. ఆ సభకు దిగంబర కవులను ఆహ్వానించారు. ప్రిన్సిపల్‌గా సర్వేశ్వరరావు గారు ఆసభకు ఆధ్యక్షత వహించారు. దిగంబర కవులను పొగుడుతారా, తిడతారా అని మేమంతా ఉత్కంఠతతో వున్నాం. ఆయన ముందు సమాజంలో మార్పు కోరుతున్నందుకు దిగంబర కవులను పొగిడారు. ఆతర్వాత గాంధీగారు కూడా సమాజంలో మార్పు తేవాలని కోరుకున్నారని అయితే ఆయన ఎప్పుడూ ఇటువంటి భాష వాడలేదని అన్నారు. ఈమధ్య నేను నిఖిలేశ్వర్‌తో ఫోనులో మాట్లాడాను. ఆ సభ గుర్తుందా అని అడిగాను. ఎలా మరచిపోతాను ఆయన మమ్మల్ని బాదారుగా. గొప్ప వ్యక్తి అన్నారు. సర్వేశ్వరరావు గారి మాటకు అంత విలువుండేది.

సమాజం బాగుండాలంటే, వ్యక్తి, కుటుంబం, సమాజం మధ్య సంబంధాలు ఆరోగ్య కరంగా, పటిష్టంగా వుండాలని ఆయన భావించారు. ఈ విషయంలో పెద్దల బాధ్యతే ఎక్కువ అని ఆయన అంటుండే వారు. అంటే, పెద్దలు పిల్లల్ని తప్పుదారి పట్టించకూడదని ఆయన అభిప్రాయం.

ఒక ఆర్థికవేత్తగా ఆయన ఆలోచనలు గొప్పవిగా వుండేవి. దేశం ఎంత అభివృద్ధి చెందినా దారిద్ర్యం, నిరుద్యోగిత, అసమానతలు అంతరించనందుకు బాధపడేవారు. మన అభివృద్ధి వ్యూహాలను ఎప్పటికప్పుడు మార్చుకోవాలని సూచించేవారు. అభివృద్ధితో పాటు సాంఘికన్యాయం సాధించాలంటే మన రాజకీయ నాయకులలో చిత్తశుద్ధి వుండాలని ఆయన అంటుండేవారు.

ఒక ఋషిగా బ్రతికిన సర్వేశ్వరరావు గార్కి దేశ విదేశాలలో అనేక మంది శిష్యులు వున్నారు. ఆయన పుట్టి నూరు సంవత్సరాలు అయిన సందర్భంగా ఆంధ్ర యూనివర్శిటి 2015, నవంబర్ 22,23న వ్యవసాయంపై జాతీయస్థాయి సెమినార్‌ను నిర్వహించింది. పూర్వ విద్యార్థులు ఆయనకు ఘనంగా నివాళులు అర్పించారు. సర్వేశ్వరరావు గారిలాంటి వ్యక్తులు అరుదుగా పుడతారు. యువత ఆయననుండి నేర్చుకోవలసింది ఎంతో వుంది.

-రచయిత ఫోను *:8672226242*

నివాళి

-సన్నిధానం నరసింహశర్మ

## స్మృతుల దొంతరలలో కోస్తావాణి సంపాదకులు

# చింతల గోపాలరావు గారు

**రాజమండ్రికీ, చిన్న పత్రికలకూ కీర్తిని సంపాదించి పెట్టిన 'కోస్తావాణి' గోపాలరావు గారు 1969 డిసెంబరు7న తనువు చాలించారు. ఇటీవలి తెలుగువారి చరిత్రలో - ముఖ్యంగా రాజమండ్రి చరిత్రలో ఎప్పటికీ నిలిచి వుండే ఖ్యాతిని ఆయన పొందారు. అదంతా నమ్మిన లక్ష్యాలకు అంకితమై తాను గడిపిన జీవితానికి గుర్తింపుగా ఉండిపోతుంది. అరుదైన వ్యక్తుల్లో ఆయన ఒకరు. తెలుగు భాషోద్యమానికీ, నడుస్తున్న చరిత్ర/అమ్మనుడి పత్రికకూ ఆయన మద్దతు మరువరానిది. ఆయనకు అత్యంత సన్నిహితులైన సాహితీవేత్త శ్రీ సన్నిధానం నరసింహశర్మ ఆయన గురించి సాధికారికంగా చెప్పగల వ్యక్తి. ఆయన ఎంతో ఆవేదనతో 'అమ్మనుడి' కోసం ప్రత్యేకించి వ్రాసిన ఈ వ్యాసాన్ని చింతల గోపాలరావు గారికి నివాళిగా ప్రచురిస్తున్నాము. -సంపాదకుడు**

రచయితల, కవుల, సాహితీవేత్తల చరిత్రలను బాగానే భద్రపరచుకుంటాం. కానీ ఎన్నో ఏళ్ళు శ్రమించి పత్రికలు నడిపిన పత్రికా సంపాదకుల చరిత్రలను మనం అంతగా భద్రపరచుకోలేకపోయాం. ఒకవేళ భద్రపరచుకుంటే బాగా సుప్రసిద్ధులవి మాత్రమే రాసుకుని దాచుకున్నామేమో. ముఖ్యంగా స్థానికంగా పెద్దపాత్ర వహించిన చిన్న పత్రికల సంపాదకులను, వారి చరిత్రాంశాలను భద్రపరచుకోవడంలో మనం నిర్లిప్తతతో ఉంటున్నామనిపిస్తుంది. రాజమండ్రి నుండి వచ్చిన దినపత్రిక సంపాదకులు ఇటీవలే కీ.శే.అయిన చింతల గోపాలరావును స్మరిస్తున్నప్పుడు పై విధంగా అనిపిస్తుంది.

'తారీఖులు, దస్తావేజులు అవి కావేవీ చరిత్రకర్థం' అని మహాకవి శ్రీశ్రీ అన్నది అక్షర సత్యం.

రాజమండ్రి మద్దూరి అన్నపూర్ణయ్య, క్రొవ్విడి లింగరాజు వంటి ఉద్దండ పత్రికా సంపాదకులని చూసిన గడ్డ. చిన్నపత్రికలెన్నిటికో కేంద్రస్థానం. గంధం సీతారామాంజనేయులుచే స్థాపితమైన సమాచారం దినపత్రిక దశాబ్దాల కాలనాళికగా పేరొంది వ్రేళ్లూను కొని ఉన్న సందర్భంలో ఆ పత్రిక పరిమాణాన్ని మించి పెద్ద పత్రికల రూపంలో వచ్చిన, జనరంజకమైన పత్రిక చింతల గోపాలరావు గారి కోస్తావాణి. గోపాలరావు ఇంటిపేరు చింతల అయినా ఆయన ఇంటిపేరును కోస్తావాణిగా నిలబెట్టారు ప్రజలు. ఆర్థికాది ఒడిదుడుకుల వల్ల కోస్తావాణి ప్రచురణ ఆగిపోయినా, ఆయన పేరును 'కోస్తావాణి గోపాలరావు' అని ప్రజలు రూఢి చేశారంటే ఆ పత్రిక ఎంతగా ప్రజల మధ్యకు చేరిందో, ఆదరణ పొందిందో, స్థిర కీర్తిని ఇచ్చిందో మనం తెలుసుకోవచ్చు.

స్థానిక దినపత్రికలలో ఒక మంచి రకమైన పోటీని ఆరోగ్యకరమైన పంథాలో కోస్తావాణి ఇచ్చింది. కోస్తావాణి పత్రిక వస్తే 'కోవా' వచ్చింది అనేవారు. అంత మధురమైన కాలం ఉండేది. కోస్తావాణి ఏవో కొన్ని వార్తలతో, పత్రిక బ్రతకటానికి అవసరమైన ప్రకటనలతో మాత్రమే కాలం వెళ్ళబుచ్చలేదు. కొన్ని ప్రత్యేక సంచికలను ప్రత్యేకత ఉండేలా వేసింది.

ప్రజలను రాజకీయ విషయాలలో, సాహిత్య విషయాలలో, కళా సాంస్కృతిక అంశాలలో జ్ఞానవంతులను చేయడానికి కృషి చేసింది.కోస్తావాణి బాగా విజృంభించి చింతల గోపాలరావు సంపాదకులుగా ఉన్న కాలంలోనే- ఆయన పత్రికలో సుప్రసిద్ధ పత్రికా సంపాదకులు కూచిమంచి సత్యసుబ్రహ్మణ్యం, కవి, కథా రచయిత, అప్పటికే ప్రసిద్ధ పత్రికా రచయిత అయిన సతీష్ చందర్ వంటివారు ఉద్యోగించారంటే గణనీయ విషయం కదా! పెద్దగా ఆర్థిక స్తోమత లేకపోయినా గోపాలరావు పెద్దలుగా వచ్చి ఉద్యోగించిన వారిని 'మీకెంత జీతం కావాలి?' అని అడిగి ఇచ్చేవారంటే అందులో చింతల సంస్కార పరిమళం ఎంత ఉందో అర్థం చేసుకోవచ్చు.

ప్రసిద్ధ రచయితలకు లేఖలు వ్రాసి వారి రచనలు కోరడం, రచనలు ప్రచురించాక వారికి ప్రచురిత పత్రికలు పంపడం, పత్రికలు పంపాక వారికి పారితోషికాలు వెంబడినే పంపడం వంటి సదాచారాలు కోస్తావాణి వంటి చిన్న పత్రిక పాటించింది అంటే ఆ



పత్రికలో చేరిన పెద్దల వలనే కాక ఆర్థిక స్థితిని చూసుకునే పెద్ద మనసు గల గోపాలరావు గారి వలనే.

కోస్తావాణికి సహకరించడంలో, రచనలు అందించడంలో, పెద్దల ముఖాముఖీలు రప్పించడంలో ఆచార్య ఆర్.వి.యస్. సుందరం, ఆచార్య జయధీర్ తిరుమలరావు, ప్రసిద్ధ కవి ఎండ్లూరి సుధాకర్ వంటి హేమాహేమీలు ఉండేవారంటే అది చింతలకు ఉన్న అనంత ఉత్తమాభిరుచికి దర్పణం కదా! కోస్తావాణిలో కూచిమంచి, సతీష్‌చందర్‌లు వెన్నెముకగా ఉన్న కాలంలో ఎంత పెద్ద నాయకుడినైనా తీవ్రంగా విమర్శించేవారు. ఎన్నికల సమయంలో కోస్తావాణి వాడి వేడి రొట్టెలుగా అమ్ముబడేది.

### క్రూసిబుల్ వ్యాపారిగా...

రాజమహేంద్రవరం సాహిత్యకేంద్రంగా అందరికీ తెలుసు కానీ అది క్రూసిబుల్ నగరంగా పేరొందిందని క్రొత్తతరం వారికి తెలి

యదు. సమీప ఇతర దేశాలకి కూడా రాజమండ్రి నుండి క్రూసిబుల్ సంబంధిత వస్తువులు ఎగుమతి అయ్యేవి.

రాజమండ్రిలోని క్రూసిబుల్ పారిశ్రామికవేత్తల్లో చింతల గోపాల రావు ఒకరుగా ఉంటూ, ఆర్జించిన సొమ్ముతో ఎంతో కొంత కళా సాహిత్య సాంస్కృతిక రంగాలకు వెచ్చించిన సచ్చరిత్రుడు ఆయన.

క్రూసిబుల్ పారిశ్రామికవేత్తగా అప్పటి సమస్యలపై ఒకనాటి భారత ప్రధాని మొరార్జీ దేశాయ్‌ని ఆయన కలిశారు. స్వాతంత్ర్య సమరయోధులైన ఆర్.వి.పెండ్యాల, వరదా బ్రహ్మానందం వంటివారు రావుగారిని కుమారుని కన్న మిన్నగా చూసుకునేవారు. రాజకీయాల లోకి వెళ్ళాలని ఆనాటి స్థితిగతులపై కొందరు ప్రేరేపించినా అందుకు రావు గారు అంగీకరించక సాంస్కృతిక రంగంపైనే మొగ్గు చూపారు.

## గురు రుణాన్ని తీర్చుకున్న శిష్యుడు

కందుకూరి వీరేశలింగం గారి ఉన్నత పాఠశాలలో మధునా పంతులు సత్యనారాయణశాస్త్రి గారి బోధనలతో ఆయనకు సాహిత్యా భిమానం పెరిగింది. గోపాలరావు రెండు చిన్న పద్యాలను ఛందో బద్ధంగా వ్రాస్తే మధునాపంతుల వారు చూసి ముచ్చట పడ్డారు. గోపాలరావు తన భార్య పద్మావతితో గురుదర్శనాలు చేస్తూ ఆనందించే వారు. కేవలం గురువుగారిని మెచ్చుకుంటూ ఊరుకోకుండా 'మధునా పంతుల సాహిత్య వ్యాసాలు' అనే పుస్తకాన్ని సొంత డబ్బుతో అచ్చొత్తిం చారు. అందులో మధునాపంతుల వారు గోపాలరావుపై రెండు మూడు పద్యాలు వ్రాయగా గురువుగారి దస్తూరిలో వాటిని వ్రాయించుకొని యధాతథంగా పుస్తకంలో ముద్రించుకున్న గురు అక్షర ప్రేమికుడు. అందులో–

**పసిడి తీవయైన పడతి పద్మావతి/**
**చెంతరాగ**
**నొక వసంతవేళ/**
**పచ్చని రసాల ఫలములనిచ్చి..**
**దీవనలు నావి పుచ్చుకొనియె..**

అని మధునాపంతులవారు వ్రాశారు.

చింతలవారి శ్రీమతి పద్మావతి చాలా సంస్కారం ఉన్న మహిళ. ఆమె గోపాలరావుగారితో శాస్త్రి గారు మీకు గురువైతే నాకు కారా? నేను నా బ్యాంక్ ఎకౌంటు లోంచి తీసి ఆయన పుస్తకం మరొకటి అచ్చువేస్తానంటూ ప్రోత్సహించిన సాహిత్యాభిమాని. అలా వచ్చిందే మధునాపంతుల వారి 'కేళాకుళి'. ఫౌంటెన్ అన్న ఆంగ్ల పదానికి మనకో తెలుగు పదమున్నదని అది కేళాకుళి అని కవిత్వ గ్రంథనామ కరణం చేశారు మధునాపంతులవారు. చింతల వారి శ్రీమతి రాజ మండ్రిలో ఇంటి పొత్తపు గుడినిపెట్టి పదిమందికి సామాజిక సేవ చేయడంలో వెనుక హస్తం భర్తదే. ఆమె శాకాహార, మాంసాహార వంటలపై పుస్తకాలు వ్రాశారు. ఆ పుస్తకాలు ఆర్.వి.సుందరం గారికి మరికొందరికి ఇస్తే ఈ పుస్తకాలను మేము తింటామా అంటే గోపాల రావు ఆ పుస్తకాలలోని వంటలని ఇంట వండింపజేసి రుచులని అందిం చిన స్నేహశీలి, రావు. భార్య పద్మావతి మరణించాక ఆ విషాద నేపథ్యంతో ఎండ్లూరి సుధాకర్, సన్నిధానం నరసింహశర్మల సంయుక్త సంపాదకత్వంలో శ్రీమతి చింతల పద్మావతి స్మారక సంచికను తీసు కొచ్చిన భార్యాప్రేమికుడు గోపాలరావు గారు. ఆయనకు ప్రవీణ్, కళ్యాణ్ అనే ఇద్దరబ్బాయిలు, పద్మప్రియ అనే ఒక కుమార్తె ఉన్నారు.

## మయూరి కళా సమితి సంస్థాపకుడు

చింతల ఎన్నో సాహిత్య, సాంస్కృతిక సభలను పెద్ద ఎత్తున నిర్వహించారు. సభావేదికలపై ఎప్పుడూ ఆయన కనబడేవారు కాదు. ఛాయాచిత్రాలకు పోజులిచ్చే మోజులు లేని నిరాడంబరుడు ఆయన. ఆచార్య సి.నారాయణరెడ్డి, దాశరథి వంటి అగ్రశ్రేణి కవులతో సభను చేసిన సందర్భాలలో కూడా ఆయన ఎప్పుడూ వేదికను ఎక్కలేదు. ఒక పర్యాయం సి.నా.రె.వేదికపైకి గోపాలరావు గారు రావాలని గట్టిగా పిలిస్తే బాగుండదని, ఎక్కడ వేదిక ఎక్కాలో అని ఆనం వేంకటేశ్వర కళాకేంద్రం బయట దారి చూసుకుంటూ వెళ్ళిపోయిన సిగ్గరి ఆయన. ఒకవైపున విశ్వనాథ జగన్నాథ ఘనాపాఠి, మధునాపంతుల, మల్లంపల్లి, జ్యోతిష్యశాస్త్రవేత్త మధురకృష్ణశాస్త్రి వంటి వారితో సన్మాన సాహిత్య సభను నిర్వహించిన కార్యకర్త గోపాలరావు, ఆయన జయధీర్ తిరుమల రావు వంటివారి మార్గదర్శకత్వంలో– అతి సామాన్య జీవితం గడిపే గొప్ప కళాకారులని గౌరవిస్తూ ఉండేవారు. జయధీర్ గారి ప్రేరణతో చింతల నిర్వహించిన అద్భుత కళా విన్యాసాల 'గరగ'ల నృత్యాలు అప్పుడు చూసిన వారి స్మృతి పథానికి ఇప్పటికీ వస్తూనే ఉంటాయి. విబూతి భవాని లింగం వంటి కళాకారులపై శ్రీ తిరుమలరావు పుస్తకం వ్రాయడంలో చింతల వహించిన అనుసంధాన పాత్ర అవిస్మరణీయం.

## చమత్కార సంభాషణా విదూషకుడు

సాధారణంగా కవిత్వంలోను, రచనలోను శైలులుంటాయని అనుకుంటాం. కానీ సంభాషించటంలో కూడా ఒక ప్రత్యేక శైలి ఉన్న వ్యక్తి చింతలవారే. నడుస్తున్న చరిత్రకి చందా కట్టమని ఈ వ్యాస రచయిత ఒకరిని అడిగిన సందర్భంలో ఆ క్రొత్తవ్యక్తి అసలు ఈ పత్రికలో ఏముంటుందని అడిగాడు. వెంటనే చింతలవారు తడుముకోకుండా "మన నోళ్లలో సంస్కృతం ఉంటుంది కదండి..ఈ పత్రికలో మాత్రం తెలుగే ఉంటుంది" అని నర్మగర్భంగా చెప్పాక ఆయన చందా కట్టారు. రాజమహేంద్రిలో తెలుగుభాషోద్యమ సమాఖ్య సభలు పెద్ద ఎత్తున 2011లో జరిగినపుడు చింతల సేవాహస్తం కూడా ఉంది.

సాహిత్య ప్రియుడిగా, కళాభిమానిగా గురువులపట్ల క్రియాత్మక ప్రేమగల శిష్యునిగా కొన్ని దశాబ్దాలు కోస్తావాణి సంపాదకునిగా మరచిపోలేని సేవలు చేసిన అవిస్మరణీయ వ్యక్తి చింతల గోపాలరావు గారు. ఆయన సంపాదకుడిగా, క్రూసిబుల్ పారిశ్రామికవేత్తగా ఏమీ మిగుల్చుకోలేకపోయారు. కానీ మనకు మాత్రం అనంత విషాదాన్ని మిగిల్చి తన 69వ ఏట వెళ్ళిపోయారు.

వాడుకభాషలో వీరేశలింగం గారికి పూర్వం గ్రంథ రచన చేసిన సంఘసంస్కర్త సామినేని ముద్దునరసింహం నాయని విగ్రహం రాజ మండ్రిలో వుండాలని ఆయన భావించేవారు. ఆ విగ్రహాన్ని రాజ మండ్రిలో పెడితే గోపాలరావు ఆత్మ శాంతిదాయకం అవుతుంది.

---

రచయిత ఫోను : 92920 55531

ఇతర రాష్ట్రాల్లో తెలుగు

–బద్రి కూర్మారావు

# అండమాన్ నికోబార్ దీవుల్లో వన్నెతగ్గుతున్న తెలుగు పాఠశాలలు







**తె**లుగు ప్రజలు అన్ని దేశాలకు, ప్రాంతాలకు వలసపోయినట్లే అండమాన్ నికోబార్ దీవులకు కూడా వలసపోయారు. అండమాన్ దీవులు ఒకప్పుడు స్వాతంత్ర్య పోరాట ఖైదీలను సెల్యులర్ జైలులో నిర్బంధించిన ప్రదేశం. అటువంటి ప్రాంతానికి కూడా తెలుగు ప్రజలు వలసపోయారు. ఈ దీవులలో సుమారు 60 వేలమంది తెలుగు ప్రజలు ఉంటారు. హిందీ, బెంగాలీ, తమిళుల తరువాత తెలుగువారు నాల్గవ స్థానంలో ఉన్నారు. ముఖ్యంగా తెలుగు ప్రజలంటే శ్రీకాకుళం జిల్లా ఉద్దానం ప్రాంతం నుండి వలసవచ్చిన వారే 80 శాతం ఉంటారు. తరువాత విజయనగరం, విశాఖపట్నం, ఉభయగోదావరి, నెల్లూరు జిల్లాల వారు ఉన్నారు. ఉత్తరాంధ్ర ప్రజల వలస కేంద్రమే ఈ దీవులు.

శ్రీకాకుళం జిల్లా సోంపేట, మందస, పలాస, వజ్రపు కొత్తూరు మండలాలకు చెందిన ఉద్దానం ప్రాంత ప్రజలైన పల్లి (అగ్నికుల క్షత్రియ), వాడ బలిజ(మత్స్యకార) యాదవ(గొల్ల) కులాలవారు ఎక్కువగా ఉంటూ మిగతా కులాలు వారు తక్కువ సంఖ్యలో ఉన్నారు. వీరంతా తమ జన్మస్థానంలో ఎటువంటి ఉపాధికీ నోచుకోక ఈ దీవులకు చేరుకున్నారు. తెలుగువారు ఇంచుమించు అన్ని దీవులలోనూ అనగా పోర్ట్‌బ్లెయిర్, బెంబూ ఫ్లాట్, బకుల్‌తలా, రంగత్, మాయా బందర్, లిటిల్ అండమాన్ వంటి దీవులలో ఉన్నారు.

వీరంతా రెండు, మూడేళ్ళకు ఒకసారి స్వరాష్ట్రంలో గ్రామాలను సందర్శిస్తుంటారు. నెలకొకసారి కోల్‌కతా, చెన్నయ్, విశాఖపట్నం ఓడరేవుల ద్వారా ప్రయాణం సాగిస్తుంటారు. దీనికి అనేక వ్యయ ప్రయాసలకు ఓర్చుకుని జీవనం సాగిస్తుంటారు.

అయితే వీరందరూ అక్కడ తమ స్వరాష్ట్రంలో కంటే ఎక్కువగా తమ సంస్కృతి మూలాలను కాపాడుకుంటున్నారు. గ్రామ సంఘాలు, కుల సంఘాలు, పెళ్ళిళ్ళు, పండుగలలో వీరు సమైక్యంగా జరుపుకుంటారు.

ఇక స్వాతంత్ర్య తర్వాత ఈ దీవుల్లో తెలుగువారి కృషితో 12 ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలు, 4 ఉన్నత పాఠశాలలు, 2 సీనియర్ సెకండరీ పాఠశాలలు తెలుగు మాధ్యమంలో సాధించుకున్నారు. పోర్ట్‌బ్లెయిర్‌లోని డిగ్రీ కళాశాలలో తెలుగు మాధ్యమంలో పరీక్షలు వ్రాసుకునే సదుపాయం కూడా ఉండేది. కానీ ఇది ఒకప్పటి ఘనత.

**నేడు ఇక్కడ కూడా స్వరాష్ట్రంలో లాగానే ఆంగ్లమాధ్యమం, హిందీ మాధ్యమాలపై మోజు పెరగటంతో ఒకప్పుడు దేదీప్యమానంగా వెలుగొందిన తెలుగు మాధ్యమ పాఠశాలలు రోజు రోజుకీ అంతరించి వాటిస్థానంలో హిందీ, ఇంగ్లీషు, బెంగాలీ, తమిళ మాధ్యమ పాఠశాలలు వెలుస్తున్నాయి.**

ఈ దీవులలోని షోర్‌పాయింట్, చున్నాభట్టా, బాతుబస్తీ, సాదీపూర్, అబర్డీన్ బజార్, అన్నానగర్‌లలో 1వ తరగతి నుండి 5వ తరగతి వరకు ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలు (జిపియస్) తెలుగు మాధ్యమంలో నడుస్తున్నాయి.

బేంబూఫ్లాట్, డైరీ ఫాం, బకుల్‌తలా, హల్‌బేలలో 1 నుండి 10వ తరగతి వరకు ప్రభుత్వ సీనియర్ సెకండరీ పాఠశాలలు, హైడో, మాయాబందర్‌లలో 1 నుండి 12 వరకు సీనియర్ సెకండరీ పాఠశాలలు, నింబుతలా మొదలగు చోట్ల 1 నుండి 8వ తరగతి వరకు మిడిల్ స్కూల్ తెలుగు మాధ్యమంలో నడుస్తున్నాయి. అయితే రోజు రోజుకు ఈ బడుల్లో కేవలం నిరుపేద పిల్లలు మాత్రమే చేరుతుండటంతో తెలుగు విద్యార్థుల సంఖ్య తగ్గి ఆ పాఠశాలలు ఇంగ్లీసు, హిందీ, తమిళ, బెంగాలీ భాష పాఠశాలలుగా మార్చబడుతున్నాయి. ఈ పాఠశాలల్లో కనీసం తెలుగుభాషకు సంబంధించి ఒక సబ్జెక్టు కూడా లేకపోవడంతో చాలామంది తెలుగు ప్రజలు తెలుగులో మాట్లాడుతున్నప్పటికీ, రాయటం, చదవటం రావడం లేదు.

కాబట్టి రోజురోజుకి ఆదరణ కోల్పోతున్న తెలుగు పాఠశాలల పునరుద్ధరణకు అండమాన్ ఆంధ్ర అసోసియేషన్, కళాస్రవంతి వంటి సంస్థలు గ్రామ సంఘాలు, ఇతర భాషాభిమానులు అండమాన్ నికోబార్ దీవుల్లో తెలుగుభాష పరిరక్షణకు కృషి చేయగలరని, ఆంధ్రప్రదేశ్ నుండి కూడా సహాయ సహకారాలు అందగలవని ఆశిస్తున్నాం.

*రచయిత ఫోను : 97047 98643*

–దుగ్గిరాల రాజకిశోర్

# అనువదింప వీలుగాని పదాలు

**భా**ష అనేది మానవ జీవన గమనానికి, వైవిధ్యానికి, పరిణామానికి దర్పణం పడుతుంది. ప్రతి మనిషిలోను ఒక ప్రత్యేకత ఉన్నట్లే ప్రతి సమాజంలోని ఆలోచనల, భావవికాస ప్రత్యేకతలను అక్కడి భాష ప్రతిబింబిస్తుంది.

అలాగే ఒక భాషలో ఉండే ప్రతి పదమూ కూడా దాని అర్థానికి మాత్రమే పరిమితమైపోలేదు. ఏ భాషలోనైనా ఒక పదము ఏదైనా ఒక వస్తువుకో, జంతువుకో, ఒక వ్యక్తికో పరిమితమైనదిగా గాక వాటి పట్ల ఆ భాష మాట్లాడే వారిలో గల భావాన్ని వ్యక్తం చేసే క్రమంలో రూపుదిద్దుకున్న శబ్దం కూడా. ఉదాహరణకు 'సింహం' అంటే ఒక జంతువుగా మాత్రమే కాకుండా 'పరాక్రమాన్ని' సూచించే శబ్దంగా కూడా మనం ప్రయోగిస్తాం. అలాగే 'బుద్ధి గడ్డి తిని' అన్నప్పుడు 'గడ్డి'ని వస్తురూపంగా కాకుండా మనిషి ఆలోచన వక్రమార్గం పట్టిందన్న భావాన్ని సూచించేదిగా వాడుతున్నాం. ఈ నేపథ్యంలో చూసినప్పుడు ఒక భాషలోని పదాలకు వాటి అర్థాలతో గల సంబంధము చాలా ఆసక్తికరంగా, ఆశ్చర్యకరంగా ఉంటుందని, అది ఆ భాష మాట్లాడే ప్రజల భావ వికాసాన్ని సూచిస్తుందని భాషావేత్త లంటారు.

అంతేకాదు, ప్రపచంలోని ఎన్నో భాషలలోని కొన్ని కొన్ని పదాలకు ఇతర భాషలలో భావానువాదాలైతే ఉన్నాయి గానీ, వాటికి సమానార్థాలు సూచించే ఏకపద అనువాదాలు లేవని భాషావేత్తలు అంటున్నారు.

Through The Language Glass అన్న పుస్తకంలో Guy Deutscher వివిధ భాషలలోని కొన్ని పదాలగురించి వివరించేరు. ఇంగ్లీషులో గాని మరే భాషలో గాని ఈ పదాలకు ఏకశబ్ద అనువాదాలు లేవనీ, వాటి భావాన్ని సూచించే వివరణ మాత్రం ఇవ్వడం జరుగుతోందనీ ఆయన తన పుస్తకంలో పేర్కొన్నారు.

ఉదాహరణకు కొన్ని పదాలను చూద్దాం.

1. Waldeinsamkelf (జర్మన్ పదం) దట్టమైన అడవిలోకి వెళ్ళినప్పుడు ప్రకృతితో మమేకమైపోయిన క్షణంలో కలిగే ఏకాంత భావన. దీనిపై Raiph Waido Emerson ఒక చక్కటి కవిత వ్రాసేడు కూడా.

2. Culaccino (ఇటాలియన్ పదం) చల్లని నీరు లేదా శీతల పానీయం ఉన్న గ్లాసును బల్లమీద ఉంచినప్పుడు కొద్ది క్షణాల తరువాత గ్లాసు క్రింద ఏర్పడే పల్చటి తేమ మరక.

3. Iktsuarpok (ఇది Inuit భాషా పదం, గ్రీన్ లాండ్ నివసించే Arctic ప్రాంతానికి చెందినవారు మాట్లాడే భాష ఇది) వస్తారనుకున్న వ్యక్తి కోసం ఇంటి బయట నిలబడి ఎదురు చూస్తున్నప్పుడు కలిగే అసహన భావం.

4. Komerebl (జపనీస్ పదం) సూర్యుని కిరణాలు చెట్ల ఆకులను తాకినప్పుడు ఆ ఆకులలో జరిగే చర్య. దీనిని 'కిరణజన్యసంయోగ క్రియ'గా మన పాఠ్యపుస్తకాలలో అనువదించేరు.

5. Pochemuchka (రష్యన్ పదం) వదలకుండా అదేపనిగా ప్రశ్నల మీద ప్రశ్నలడిగేవాడు.

6. Sobremesa (స్పానిష్ పదం) సామూహిక వేడుకలు జరిగినప్పుడు భోజనానంతరం వచ్చినవారందరూ కాసేపు పిచ్చాపాటి మాట్లాడుకొనే సమయం.

7. Joyus (ఇండోనేషియన్ పదం) ఎవడైనా చెత్త జోక్ వేస్తే గత్యంతరం లేని పరిస్థితిలో పగలబడి నవ్వడం. ఉదాహరణకి 'సంతోషం' (అక్కినేని నాగార్జున) సినిమాలో కోట శ్రీనివాసరావు వేసే జోకులకి గతిలేని పరిస్థితిలో వాడి ఆఫీసు క్లర్కులు నవ్వుతారు కదా, అదన్నమాట.

8. Pana po's (హవాయియన్ పదం) తాళాలు ఎక్కడ పెట్టేమో మర్చిపోయి వెతుక్కుంటూ గుర్తుకురావడం కోసం బుర్ర గోక్కోవడం.

9. Depaysement (ఫ్రెంచ్ పదం) వేరే దేశంలో ఉన్నప్పుడు తాను పరాయివాడినే, తన దేశానికీ, తన వారికీ దూరంగా ఉన్నానే అని మనసులో కలిగే భావన.

10. Mangata (స్వీడిష్ పదం) నదిమీద గాని, సముద్రం మీద గాని ఒక దారిలా తళతళమని మెరుస్తూ కదలాడుతూ కనిపించే చంద్రుని వెన్నెల ప్రతిబింబం.

11. Mahmlhlapinatapai Tierra del Fuego-- దక్షిణ అమెరికా దక్షిణాగ్రాన ఉన్న దేశంలో మాట్లాడే Yaghan భాషా శబ్దం) ఇద్దరు వ్యక్తులు కలుసుకున్నప్పుడు తమ మనసులో ఉన్నది బయటపెట్టకుండా ఎదుటి వారు దానిని ప్రస్తావిస్తారేమోనని ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకోవడం.

12. Ashipda (కొరియన్ పదం) 'తాననుకున్నది చేతికి చిక్కినట్టే చిక్కి జారిపోయిందే' అన్న భావాన్ని ఇది సూచిస్తుంది. మనం ఆశిస్తున్నది ఆఖరి నిమిషంలో జరగనప్పుడు కలిగే భావన, పరీక్షలో 100 శాతం మార్కులు ఆశిస్తున్నప్పుడు 99 శాతం మార్కులు వచ్చినప్పుడు, 'ఒక్క మార్కు తేడాలో తప్పిపోయిందే' అన్న భావన.

ఇలా ప్రపంచంలోని ప్రతి భాషకూ ఆ సమాజంలోని భావ వికాసాన్ని ప్రతిబింబించే ప్రత్యేకత వుంది. ఆ భాషలన్నింటినీ రక్షించుకోవడం అంటే ప్రపంచ వ్యాప్యంగా మానవ జీవితంలోని వైవిద్యంలో గల అందాన్ని కాపాడుకోవడం అన్నమాట.

*రచయిత ఫోను : 80082 64690*

# గురజాడ నుడి-నానుడి

మహాకవి గురజాడ పేరు వినగానే మనకు గుర్తు వచ్చేవి ముత్యాల సరాలు, పుత్తడి బొమ్మా పూర్ణమ్మా. కన్యాశుల్కము, గిరీశమూను. వారు కన్యాశుల్కం నాటకంలో సనాతనులకి, మూఢాచారులకి తియ్యగా పెట్టిన వాతలు ఇప్పటికీ, వెనక్కి తిరిగి చూసుకుని విషాదంగా నవ్వుకునేవిగా ఉంటాయి. ఆ యుగకర్త కన్యాశుల్కంలో వాడిన కొన్ని సామెతలు, జాతీయాలు, నుడికారాలూ వేడివేడి పకోడీల్లా మనల్ని ఊరిస్తాయి. కొన్నిటిని రుచి చూడండి.

1. పప్పు వుడకడం
2. దేహశుద్ధి చేయడం
3. బిచాణా ఎత్తివేయడం
4. అట్నుంచి నరుక్కు రావడం
5. తప్పుల తడక
6. ఏకేయడం
7. కడుపుడుకు
8. దంగై పోవడం
9. ఒళ్ళు మండడం
10. పెట్టకైనా తెలియకుండా
11. అణా పైసలతో ఇచ్చేయడం
12. ఆబోరు దక్కడం
13. కోన్ కిస్కాహై గాడు
14. బొబ్లేరు ముక్కలు
15. దప్పిక్కి చేరి అరవ చాకిరి చేయడం
16. పెట్టి పుట్టడం
17. గుటుక్కుమనడం
18. లోకమంతా కోడై కూయడం
19. నువ్వులు జాగర్త చేయడం
20. కళ్ళు కాయలు కాయడం
21. అచ్చి రాకపోవడం
22. వోఘాయిత్తం మాటలు
23. పుచ్చకాయల దొంగ అంటే భుజాలు తడువుకున్నట్టు
24. శషభిషలు
25. బస చేయడం
26. ఓ ముక్క అబ్బడం
27. డబ్బు చేదా?
28. వట్టి అవకతవకల మనిషి
29. అరటిపండు విప్పినట్టు
30. ఖిర్రూ కుర్రూ మానడం
31. అమ్మా శిఖా తరగా
32. నుయ్యో గొయ్యో చూసుకోవడం
33. కొర్రు ఎక్కడం
34. తల చెడడం
35. పోకెట్లో వేయడం
36. ధుమధుమ లాడడం
37. కత్తు కలిపేయడం
38. కుంచం నిలువుగా కొలవడానికి వీల్లేనప్పుడు తిరగేసైనా కొలిస్తే నాలుగ్గింజలు నిలుస్తాయి
39. పదు పదు అన్న నా సవితే గాని, పద్ద నా సవితి లేదు
40. రొట్టి మీద నెయ్యి నేతి మీద రొట్టి
41. తిరపతి మంగలి క్షవరం
42. ఇల్లు గుల్ల చేయడం
43. బంగారప్పిచ్చిక
44. బాల్చీ తన్నేయడం
45. రామాయణంలో పిడకల వేట్లాట
46. పైకి పటారం లోన లొటారం
47. చెట్లకి చేవ నలుపు మనిషికి చేవ తెలుపు
48. చాప చిరిగినా చదరంత
49. వెర్రి కుదిరింది. రోకలి తలకి చుట్టమన్నట్టు
50. పట్టిందల్లా బంగారం
51. నమ్మంచోట చేస్తే మోసం- నమ్మించోట చేస్తే లౌక్యమూను
52. దీని తస్సాగొయ్యా
53. నారదుడు వచ్చిపాడితే నాలుగు దమ్మిడీలివ్వరు
54. ఉదర నిమిత్తం బహుకృతవేషం
55. తనకి రొట్టా ఒకడికి ముక్కాను
56. ఆడది మెచ్చిందే అందం
57. ఉప్పులేకనే ముప్పందుం
58. చక్రం అడ్డేయడం
59. ఎరువు సరుకు ఎరువు సరుకే
60. అదే పతకమైతే అమ్ముకు బతకనా అన్నాట్ట
61. బ్రహ్మ రథం పట్టడం
62. ముచ్చకాయ ముగ్గురు
63. అర్ధ చంద్ర ప్రయోగం
64. శాంతం బోషాణప్పెట్టె
65. పొమ్మనక్కర్లేదు పొగ పెడితే చాలు
66. కలికంలోకైనా లేకపోవడం
67. అందని పండుకు ఆసించడమెందుకు
68. తద్దినం కొనుక్కోవడం
69. సత్రం భోజనం మఠం నిద్రా
70. రండికి మొండికి ఓర్వడం
71. కీడెంచి మేలెంచమన్నారు
72. మాటలు నేర్పిన శునకాన్ని వేటకి పంపితే ఉసుకో అంటే ఉసుకో అందిట.
73. మతిలేని మాట శృతిలేని పాట
74. చెయ్యి ముట్టు సరసం
75. పుంజాలు తెంపుకుని పరుగెత్తడం
76. స్త్రీ బుద్ధి ప్రళయాంతక
77. ఎద్దు పుండు కాకికి రుచి అన్నట్టు
78. గాడిద అందిట "పాటకి నేను, అందానికి మా అప్పా"
79. నోటికి సుద్దీ బద్ధం లేదు
80. గడ్డిపరకంత ఖాతరీ చేయకపోవడం
81. రెడ్డొచ్చారు మొదలాడు అన్నాట్ట
82. కరారాప్రుడు చుట్టేయడం
83. బైరాయించడం
84. ఘంటా పథంగా చెప్పడం
85. కోరి అడిగితే కొమ్మెక్కుతాడు
86. పాలవంటిదానికి విరుగుడుంది
87. చదవేస్తే ఉన్న మతీ పోయినట్టు
88. ముదిమికి ముచ్చట్లు లావు
89. ఆడింది ఆట పాడింది పాట
90. గుబ గదవేయడం
91. నోట్లో గడ్డి పెట్టడం
92. వల్లకాట్లో రాయనాధాయ
93. పిండం పిల్లులకి పెట్టా
94. మనిషి కాటుకి మందు లేదన్నారు
95. మబ్బులేని పిడుగు పడ్డం
96. పెయ్యతో వచ్చిన ఆవు మేలుకాదా
97. తెగించిన దానికి సగుడు మోకాలి బంటి
98. పిల్లికి చెలగాటం ఎలక్కి ప్రాణ సంకటం
99. శ్రాద్ధం చెట్టుకింద పెట్టా
100. చేసేవి మాఘ స్నానాలూ, దూరేవి దొమ్మరి కొంపలూ
101. పాలముంచినా నీళ్ళ ముంచినా నీదే భారం

(మిగతా 46వ పుటలో...)

# శ్రీశ్రీ

-డా॥అవంత్స సోమసుందర్



వీరేశలింగం గారి సంఘ సంస్కరణోద్యమం, సమాజంపై దాని ప్రభావం, గురజాడ ఆధునిక కవితా ప్రారంభం, జైగీతి ముత్యాల సరాల రచన- తత్పూర్వ దశాబ్ది రచనలో నవ్య కవిత్వానికి అంకురార్పణ.

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు, కట్టమంచి రామలింగారెడ్డి-ముసలమ్మ మరణం, రాయప్రోలు సుబ్బారావు గారి తృణకంకణం, స్నేహలతాదేవి వగైరా వీరేశలింగం గారి సంఘసంస్కరణోద్యమ కార్యం, సత్యదేవుని దక్షిణదేశ యాత్ర వగైరాలు ఆనాటి యువజనంపై కలిగించిన ప్రభావం మర్చిపోలేనిది.

హెయిలీ అనే గొప్ప తోకచుక్క పొడవడం, మూఢ విశ్వాసంతో ప్రజలు దేశాలకు అరిష్టం వాటిల్లకలదని భీతిల్లడంతో బరంపురంలో జరిగిన సర్వవర్ణ ఏక పంక్తి భోజనవిందులో గురజాడ పాల్గొనడం, ఆంధ్రులలో మొదటి బారిష్టరు బెహరా నృసింహేశ్వరశాస్త్రిగారిని ఆహ్వానించడం గురజాడ 'తలుతు నేనిది సంఘ సంస్కరణప్రయాణ పతాకగా' అని చాటడం, దానితో ఆధునిక వివేచనతో కవితను వెలార్చడం తూర్పు బలబల తెలవారిన స్థితిని దర్శించడం ఇవన్నీ శ్రీశ్రీ మానసిక వికాసానికి తోడ్పడని జన్మకాల పరిస్థితులు.

infant terrible గా శ్రీశ్రీ పెరగటం 50 ఏళ్ళ తర్వాతనే గురజాడ ఆధునిక కవితను ప్రారంభించటం 54వ ఏటనే మహాకవి మరణించటం, శ్రీశ్రీ తన 15వ ఏట దివ్య లోచనాలు రచించి నర్మగర్భంగా దేశీయ స్థితిని ధ్వనింపజేయడం దానిని స్వశక్తి పత్రికలో శ్రీ పురిపండా అప్పలస్వామి 1925లో ప్రచురించడం.

1926లో కవితా సమితి సంస్థాపన శ్రీశ్రీ ప్రథమ కావ్యం ప్రభవను 1927లో పురిపండా పీఠికలో ప్రచురించడం అదే శ్రీశ్రీ కవితా యుగానికి ప్రారంభ గీతంగాను, భావకవితా యుగానికి భరతవాక్యంగానూ ఏకదేశంగా నిర్ధారణ కావడం. 1927 తర్వాత స్వర్గదేవతలు అనే రచనకు ప్రారంభం, అప్పటికి శ్రీశ్రీపై తేటగీతిని అందాల కళాఖండంగా తీర్చిదిద్దే శిల్పంతో కృష్ణశాస్త్రి ప్రభావం, పూర్తిగా వికసించింది. అలాగే విశ్వనాథ వారి పెటుకు సమాస రచనా ప్రభావము వచనము వలె సాగే పద్ధతి ఏకకాలంలో ద్యోతకమయ్యాయి.

1929 'సుప్తాస్థికలు' 'రచన' అవి ధరాగర్భమా మానవాస్తిక పరంపరలు శుద్ధ నిశ్శబ్ద సంపుటులు. అటనొకే దీర్ఘరాత్రి అనే గీతంలో అపూర్వ వస్తు శ్రీకారం జరిగింది. చారిత్రక జీర్ణ దశల్లో లక్షోపలక్షల మానవులు హతమైపోగా, వ్యర్థమైన జీవితాలు నశించి వారి అస్థి పంజరాలు పుడమి అడుగు పొరల్లో మెలకువే లేని దీర్ఘనిద్రలో దుసికెల్లిపోయాయి. ఆ అస్థి పంజరాలలో అవిస్మరణీయ మహాపురుషులెందరో? ఈ కవితా లఘుస్వరూపంలో ఒక అమేయ విశద వాతావరణం గాఢంగా చిత్రితమైంది. దానితోనే శ్రీశ్రీ అమోఘంగా ప్రజలకు ప్రథమావిష్కారాన్ని జరిపించాడనిపిస్తుంది.

(నల్గొండ జిల్లా మూడవ మహాసభలు సందర్భంగా 1983 ఏప్రిల్ 8,9,10 తేదీలలో ఒకనాటి ఉపన్యాసానికి నోట్సు)

# పంచాగ్నుల వారి ప్రాకృత భాషా వైవిధ్యం

సంఘ సంస్కరణరంగంలో యుగపురుషుడు కందుకూరి మ్రోగించిన జేగంటల ప్రతిధ్వనులు సర్వరంగాలకూ వ్యాపించాయి. భాషా సాహిత్య రంగాలలో ప్రజాస్వామిక దృక్పథానికి లక్ష్యభూతులైన గురజాడ వారు ప్రారంభించిన ఉద్యమానికి లక్షణ ప్రామాణికతను చేకూర్చి జగజ్జగీయమాన మొనర్చిన మహనీయుడు గిడుగు రాంమూర్తి.

భాషా పరంగా సైతం తొలి సంస్కార బీజాలు నాటినవారు వీరేశలింగం గారే. 1878లో రచించిన తొట్టతొలి ప్రహసనం అని వారే పిలిచి పెద్దయ పెళ్ళి నాటకంలో పాత్రోచిత సంభాషణలకు వ్యావహారికాన్నే వారు ప్రయుక్తం చేశారు. ఆ నాటకమే సర్వాంగీణంగా కన్యాశుల్కానికి ఆదర్శ శిఖరంగా నిలిచింది. ఆవేశ స్ఫూర్తిని అందించింది.

మహా పండితులు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి సైతం సంస్కరణ భావ పీడితులయ్యారు. గిడుగు రామమూర్తి గారి మహోద్యమాన్ని మనస్ఫూర్తిగా బలపరిచారు. నండూరివారి ఎంకి పాటలను సైతం తలపై నిడుకొని ప్రదర్శించగలిగారు. వారెంత మనీషాత్ములో అంత ఉదార హృదయులు. గి.రాంమూర్తి షష్టిపూర్తి సందర్భంగా వారికి కానుకగా 'ప్రాకృతి గ్రంథ కర్తలు-ప్రజాసేవ' అనే గొప్ప గ్రంథాన్ని సమీక్షించారు. ఇది ఎంతో చరితార్థకమైన సంగతి.

విద్యాభ్యాసంతో దానివల్ల అనుశృతంగా చేకొనే సమస్త చాదస్తాలతో పాటు రాటుదేలిన పండితులలో సంస్కరణ భావాలు పెంపొందటం వింతలలో వింత. అలాంటివారే పరప్రత్యయ న్యేయబుద్ధులు కాక, ప్రజాధురీణులు కాగలరు. అలాంటి గౌరవం కలిగిన కొద్దిమంది పండితులలో పంచాగ్నుల వారు ఒకరు. ఇది ఎంతో చరితార్థమైన సంగతి.

వీరు ప్రాకృతం, పాళి, పైశాచి, మున్నగు ఆదిమ భాషలలో నిష్ణాతులు. సంస్కృతంలో అతి అరుదైన పండితులు.

గిడుగువారు సప్తతి పూర్తి ఉత్సవం రాజమహేంద్రిలో 1933 డిసెంబరులో జరిగింది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని పంచాగ్నుల వారి గ్రంథాన్ని రచించి, సమర్పించారు. గి.రాం.మూర్తి గారి గ్రంథాలన్నీ అచ్చువేసి, రజిత మంజూషలో భద్రపరిచ వారికి ఉపాయనం అందించటం చరిత్రలో జరిగిన అరుదైన సత్కారం. అనిదంపూర్వమైన పరిశీలనతో పంచాగ్నులవారి గ్రంథం సాగింది.

ఇలాంటి మహత్తర గ్రంథాన్ని కూలంకషంగా వాక్యోపాఖ్యానంగా పరిశీలించవలసిన అవసరం వర్తమాన సాహితీవేత్తలకుంది. ❋

## ప్రశ్నలు-జవాబులు

## 'పాత్రికేయ పెద్ద' లేఖ

'అమ్మనుడి' ద్వారా వ్యక్తమయ్యే తమ ఆరాటం, తపన నేను ఈ నా కుదప వయసులో గమనిస్తున్నాను. మీకు కొన్ని నా సందేహాలు–
1. తెలుగు భాషలో ఈ ప్రాణాలను ఎవరు ఎప్పుడు ఎందుకు తొల గించారు? ఋ ౠ ఐ ....హల్లుల నుంచి ఙ, ఞ– క్రమంగా తొలగింప యత్నిస్తున్న హల్లులు– ణ అ ళ క్ష.
2. వ్రాతలో తరుణోపాయం, ఉచితం, ఉద్యోగం

ఇలాంటి వికృతాలు చూసే కాబోలు కొందరు ప్రముఖులు మృత్యు ముఖంలో వేగంగా పయనిస్తున్న తెలుగుభాష అని వాకొంటూ ఈ వేగం ఇలాగే దూసుకుపోతే 2050 నాటికి తెలుగు మృతభాష. అంటే ఇప్పుడున్న సంస్కృతం వలె మారిపోతుందని వ్యాఖ్యానిస్తున్నారు. దీనికి అమ్మనుడి సంపాదకులుగా మీ స్పందన యేమిటి?

**–బుద్ధవరపు వేంకటరత్నం,** సీనియర్ జర్నలిస్ట్, వయసు 91 సంవత్సరాలు

**సంపాదకుని స్పందన :** తాము ఓపికతో అమ్మనుడిని చదివి, తెలుగు ప్రజల మేలు కోరి తరచుగా లేఖలు వ్రాస్తున్నందుకు ధన్యవాదాలు. మీ సందేహాలకు నాకు తెలిసిన సమాధానాలు విన్నవిస్తున్నాను.
1. తెలుగు అక్షరమాల నుండి ఎవరూ అధికారికంగా ఏమీ తీసివేయ లేదు. ఎవరి ఇష్టం ప్రకారం వాళ్ళు వాడుకొంటున్నారు. తెలుగుభాషకు సంబంధించి పాఠ్యాంశాలనిర్ణయానికి గాని, భాషాభివృద్ధికి సంబంధించి గాని బాధ్యత తీసుకొని పనిచేసే ప్రాధికార సంస్థ ఏదీ లేదు. మన పాలకులకు ఒక భాషావిధానం లేకపోవడమే ఇందుకు కారణం. తెలుగు బోధనలో ఉపాధ్యాయులు శ్రద్ధ వహించటం కూడా తగ్గిపోయింది.
2. వ్రాతలో తరుణోపాయం ఉచితం, ఉద్యోగం వంటి వికృతాలను చూడలేకపోతున్నామన్నారు. సంస్కృత పదాల్ని గాని, మరే ఇతర భాష పదాల్ని గాని తెలుగువాడకంలోకి తెచ్చుకొనడంలో పరిమితుల్ని, మెలకు వలను తెలుసుకోవలసి ఉంది. సరళమైన తెలుగుభాష స్వభావానికి తగని మాటలను తెచ్చి పెట్టుకొంటే వాటి రూపురేఖలే మారిపోతాయి. అయినా ఇవి కాదు సమస్యలు.

విద్యలో, పాలనలో తెలుగును పూర్తిగా ఉపయోగించకపోవడం, నేటి అవసరాలకు తగ్గట్టుగా భాషను నిరంతరం పెంపొందించుకొని వినియోగించేందుకొక 'భాషాభివృద్ధి ప్రాధికార సంస్థ' లేకపోవడం – వెరశి పాలకులకు భాష రక్షణ, పెంపుదల పట్ల ఒక విధానం లేక పోవడం. ఇదీ అసలు సమస్య. –సం.

## ఆంగ్లపదాలు మన పత్రికలో ఎందుకు?

ప్రముఖ కథా రచయిత, భాషోద్యమ నేత శ్రీ తవ్వా ఓబులరెడ్డి గారి వల్ల నాకు 'నడుస్తున్న చరిత్ర'తో పరిచయమైంది. ఒక సంవత్సరం పాటు పత్రికను చదివాను. అందువల్ల నాకు తెలుగుభాషపై గల అభిమానం రెట్టింపయింది. అయితే అంతటి పత్రికలో కూడా ఇతరులు ఆంగ్లభాషా పదాల్ని ఉపయోగించడం చాలా బాధాకరమైన విషయం.

**–ఒక శ్రేయోభిలాషి,** తిరుపతి, వనిపెంట, ఫోను 9676305430

0 తెలుగుపై మీకు గల అభిమానం ఇతరులకు ఆదర్శంగా ఉంటుంది. పత్రికలో తప్పనిసరి అయినచోట్ల మాత్రమే ఆంగ్లమాటలు –తెలుగుతో సహా ఉంటాయి. గమనించండి. –సం.

## కలసికట్టుగా భాషాభివృద్ధి

'అమ్మనుడి' డిసెంబరు నెల సంపాదకహృదయం– 'తెలుగు కోసం రాజకీయ ఉద్యమం తప్పదు' చదువరులకు ఆలోచనాత్మకంగా ఉంది. భాషా విధ్వంసాన్ని, తద్వారా తెలుగుజాతి విధ్వంసాన్ని ఆపడం కోసం రాజకీయ ఉద్యమం అవసరమే.

'తెలుగు రాష్ట్రాలలో భాషావిధానం' వ్యాసంలోని వ్యాసకర్తల సూచనలను పాలకవర్గాలు స్వీకరించాలి. రాష్ట్రాలు వేరైనా భాష ఒక్కటే నన్న విషయాన్ని ఉభయరాష్ట్ర పాలకులు గుర్తించి కలసికట్టుగా భాషాభి వృద్ధి కార్యక్రమాలను చేపట్టాలి.

**–అమ్మిన వెంకట అమ్మిరాజు,** ఖమ్మం

### సాహితీ పురస్కారాల ప్రదానం

నవ్య సాహిత్య పరిషత్ కరీంనగర్ 2015 సాహితీ అవార్డులు తేదీ 28-11-2015 రాత్రి కరీంనగర్ ఫిల్మ్‌భవన్‌లో తెలంగాణ విద్యావంతుల వేదిక నిర్వహణలో జరిగిన సభలో ఈ క్రింది వారికి ప్రదానం చేయబడినవి.

1) డా॥వై. భానుప్రసాద్ (భద్రాచలం) గారికి– డా॥మలయశ్రీ ప్రగతిశీల సాహితీ అవార్డు, 2) శ్రీనాగిళ్ళ రామశాస్త్రి(హన్మకొండ) గారికి – కాళోజీ సాహితీ అవార్డు, 3) డా॥పోరెడ్డి రంగయ్య (ఆలేరు) గారికి– సురవరం సుధాకరరెడ్డి సాహితీ అవార్డు. అవార్డు గ్రహీతలకు వెయ్యి రూపాయల నగదు, శాలువా, మెమొంటోలతో సత్కారం జరిగింది. ఇదే సభలో డా॥మలయశ్రీ 125వ పుస్తకం 'మన మంచి తెలుగు', డా॥కె. శ్యాంసుందర్ శతకం 'నీతిపథం' గ్రంథాలు ఆవిష్క రించబడ్డాయి.

## ప్రకాశం జిల్లా రచయితల సంఘం స్వర్ణోత్సవాల కార్యక్రమం

2016 జనవరి 8,9,10 తేదీలలో ఒంగోలు టిటిడి కళ్యాణ మండపంలో జరుగనున్న ప్ర.ర.సం స్వర్ణోత్సవ సభలు జనవరి 8న సాయంత్రం గం.3.30 లకు మొదలై 10 ఆదివారం గం.7 లకు ముగియనున్నాయి. తొలి దినాన శ్రీ బి.హనుమారెడ్డి అధ్యక్షతన జరిగే స్వర్ణోత్సవ సభ ప్రారంభసభను ఆం.ప్ర. శాసనసభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ ప్రారంభిస్తారు. ఆచార్య కొలకలూరి ఇనాక్ కీలకోపన్యాసం చేస్తారు. స్థానిక రాష్ట్రమంత్రులు, లోక్‌సభ, శాసనసభ, శాసనమండలి సభ్యులు రాజకీయ పార్టీల, సంస్థల ప్రముఖులు పాల్గొంటారు. ఆరు రాష్ట్రాల్లో తెలుగుభాష రక్షణకై కృషి చేస్తున్న ఆరుగురు రచయితలకు సన్మానం, గజల్ శ్రీనివాస్ విభావరి ఉంటాయి. రెండవరోజు ఉ.10 గంటలకు ఒక సభ, సా.3 గంటలకు ఒక సభ ఉంటాయి. వీటిలో భాషా సాహిత్యరంగాల్లో పని చేస్తున్న ప్రముఖులు పాల్గొంటారు. సాయంత్రం నృత్యప్రదర్శన. మూడవరోజున ఉదయం జరిగే తెలుగు జాతీయ కవి సమ్మే ళనంలో అనేకమంది కవులు పాల్గొంటారు. ప్రకాశం జిల్లాకు చెందిన పన్నెండు మంది సీనియర్ కవులకు సన్మానం. సాయంత్రం 3.30 గంటలకు ముగింపు సభ, తర్వాత శ్రీ గరికపాటి నరసింహారావు సాంస్కృతికోపన్యాసంతో కార్య క్రమాలు పూర్తవుతాయి. బి.హనుమారెడ్డి(94402 88080), పొన్నూరు వేంకట శ్రీనివాసులు(94404 32939), యత్తపు కొండారెడ్డి(99890 48868) తదితరులతో కూడిన ఆహ్వానసంఘం అందరికీ స్వాగతం పలుకుతున్నది.

కవిత

## ఎరుక

ఆవేశం ఆకాశన్నంటుతున్నప్పుడో
ఆవేదన నా అంతరంగాన్ని అలజడిలోకి
నెట్టివేసినప్పుడో, నా భావాల్ని
అక్షరాల ఆసరాతో కాగితంపై పేరుస్తాను.
ఆ ప్రయత్నంలో ప్రతి ఒక్కసారీ
నన్ను నేను మరింతగా
అర్థం చేసుకుంటూ ఉంటాను.
అంతరంగం స్వచ్ఛమైనదైతేనే కదా,
ఆరోగ్యకరమైన ఆలోచనలు
కాగితం మీదకో
మరేదో గమ్యంలోకో
అనాయాసంగా ప్రయాణించగలిగేది.
ఎన్ని రాసినా, మరెన్ని చెప్పినా
కవిత్వం కంటే వ్యక్తిత్వం గొప్పది.
రచనకంటే రసావేశం ముఖ్యమైనది.
కథ కంటే జీవితం పరిపూర్ణమైనది.
నేరగాళ్ళు పెరిగితే
పుడమితల్లి మనసుకు
తీవ్రమైన భారం కానీ
అక్షరాలను ఆప్యాయంగా
ఆలింగనం చేసుకునే
సాహితీకారుల సంఖ్య ఎక్కువైతే
కలిగేది మానసికోల్లాసమే కదా!
రచనల్లోని సారాన్ని
మనలోకి రసనగా అనువదించుకోగలిగితే
లభిస్తుంది మనుగడకు ఒక ఫలసిద్ధి
అదే కదా మనం జీవితంలో
పొందగలిగే ఒక పరిపూర్ణ సంతుష్టి

**–శివ్,** 98485 27109

జనవాణి

## ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుకు ప్రాధాన్యత లేదా?

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమీలు తెలంగాణాకే పరిమితమై పోతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమీల స్థాపన అత్యంత అవసరం కానీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉర్దూకే ప్రాధాన్యతనిచ్చి కర్నూలులో ఉర్దూ విశ్వవిద్యాలయానికి శంకుస్థాపన చేసింది. హైదరాబాద్‌లో మౌలానా ఆజాద్ నేషనల్ ఉర్దూ యూనివర్శిటీ ఎప్పటినుంచో ఉండి, పలు రాష్ట్రాలలో అనుబంధిత విద్యా ప్రాంగణాలను ప్రారంభిస్తుంది. దానికి సొమ్ములు పుష్కలంగా కేంద్రప్రభుత్వం నుండి వస్తున్నాయి.

ఉమ్మడి తెలుగు రాష్ట్రంలో ఉర్దూకు, తెలుగుకు ఎటువంటి ప్రాధాన్యతలున్నాయో, వాటికి సమకూరిన ఈ క్రింది పట్టికలో చూపించిన నిధుల వివరాలు చూడండి.

**ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో విడుదల చేసిన నిధులు**

| సం. | 2011-12 | 2012-13 | 2013-14 |
|---|---|---|---|
| తెలుగు అకాడమీ రూ. | 14,29,000 | 20,11,000 | 1,14,58,000* |
| ఉర్దూ అకాడమీ రూ. | 14,35,00,000 | 6,30,00,000 | 18,83,00,000 |

జాషువా పీఠం మూలనిధికి ఒకేసారి కేటాయింపుగా ఇచ్చిన రు. 80,30,000తో కలుపుకొని

| సం. | 2010-11 | 2011-12 | 2012-13 | 2013-14 |
|---|---|---|---|---|
| తెలుగు విశ్వవిద్యాలయం రూ. కోట్లలో | తెలియదు | 13.08 | 22.4 | 23.00 |
| మౌలానా ఆజాద్ నేషనల్ ఉర్దూ యూనివర్శిటీ రూ. కోట్లలో | 43.72 | 55.15 | 83.57 | 97.87 |

ఉమ్మడి రాష్ట్రంలోనూ ఉర్దూతో పోల్చితే తెలుగుకు ఆదరణ తక్కువే. ఇప్పుడైనా– 11 జిల్లాల ఆంధ్రప్రదేశ్‌లోనైనా తెలుగు పోషింపబడుతుందా అంటే, అలా కాక కేవలం 9 శాతం మాత్రమే ఉన్న వారికై (అందులో సగంపైన ఉర్దూ రానివాళ్ళే, తెలుగు బాగా తెలిసినవారే) ఉర్దూ విశ్వవిద్యాలయం స్థాపించబడుతోంది. మొన్న అమరావతిలో రాజధానికి శంకుస్థాపన జరిగినప్పుడు ఆహ్వానాలు, సూచనపట్టికలు అన్నీ ఇంగ్లీషులోనే, తెలుగు ఊసే లేదు. తెలుగుభాషా పోషణను విస్మరించి రాజకీయ లబ్ధికోసమై ఇతర భాషలకు ప్రాధాన్యమివ్వడం తగని పని. రాజకీయ పార్టీ పేరు తెలుగుదేశమా? కానీ తెలుగుకు పోషణ లేదా? తక్షణమే ఆంధ్రప్రదేశ్ ప్రజలు ప్రభుత్వాన్ని నిలదీసి ఒక తెలుగు విశ్వవిద్యాలయాన్ని, ఒక తెలుగు అకాడమీని స్థాపించమని, వాటికై సముచితమైన నిధులను విడుదల చేయాలని కోరాలి.

**–త్రిపురనేని హనుమాన్ చౌదరి,** సికింద్రాబాద్, 040-6667119

**గురజాడ నుడి నానుడి** (43వ పుట తరువాయి)

102. బుద్ధి బుద్ధి కలిస్తే రాపాడుతుంది
103. కుక్కకి గంగిగోవుకి ఎంత వారో
104. నాలికా తాటి పట్టా
105. అంగడి వాడికి మిఠాయి మీద ఆశా, సానిదాని వలపూ మనసులోనే అణగారాలి.
106. చెడ్డవారివల్ల చెప్పు దెబ్బలు తినొచ్చు మంచివారి మాట కాయడం కష్టం.
107. చేతికి ఎముక లేదు
108. నీ ఇంట కోడి కాల్చా
109. శల్య సారథ్యం
110. తుని తగువు
111. తెల్ల బియ్యం పాటి మానికా

( ఉత్తరాంధ్ర వారికి సర్వ సామాన్యంగా కనిపించవచ్చు. ఇతర ప్రాంతాలలో కన్యాశుల్కం నాటకంతో అంత పరిచయం లేని వారికి ఉపయోగకరంగా ఉంటాయనే ఉద్దేశంతో సేకరించడం జరిగింది)

–సేకరణ : **పాలెపు బుచ్చిరాజు**

పుస్తక పరిచయం

## బంకుపల్లి మల్లయ్యశాస్త్రి జీవిత దృశ్యం




ఉత్తరాంధ్రకు, అందులో శ్రీకాకుళానికి చెందిన ప్రముఖులలో బంకుపల్లి మల్లయ్య శాస్త్రి ఒకరు. 1876 ఏప్రిల్ 9న జన్మించిన ఆయన ఒక విశిష్ట వ్యక్తి, పండితుడు, మానవతా వాది, సంస్కర్త.

తెలుగుదేశంలో వేదాలను అనువదించే కృషి 1890-1940 మధ్యకాలంలో జరిగింది. ఈ అనువాద ప్రయత్నాన్ని 'ఉద్యమం'గా భావించారు మల్లయ్య శాస్త్రి. శ్రీకాకుళం జిల్లా నరసన్నపేట నుండి కృష్ణాజిల్లాలోని కావూరు దాకావచ్చి, ఏడునెలల్లో ఋగ్వేద అనువాదాన్ని పూర్తి చేశారు (పుట 102). దాదాపు వెయ్యి సంవత్సరాల కిందట విద్యారణ్య స్వామి వేదాంత తత్వాన్ని వివరించటానికి ఒక గ్రంథాన్ని సంస్కృతంలో శ్లోకాల్లో రాశారు. దీని పేరు అనుభూతి ప్రకాశము. 1943లో మల్లయ్య శాస్త్రి చిత్తూరు జిల్లా ఏర్పేడులోని వ్యాసాశ్రమంలో ఆరునెలలుండి ఈ గ్రంథాన్ని అనువదించారు (పుటలు 108,109)

మల్లయ్య శాస్త్రి గారు గొప్ప సంఘ సంస్కర్త. కూతురికి బాల్యంలోనే వైధవ్యం ప్రాప్తించగా, పునర్వివాహానికి ఆమె అర్హురాలని 'వివాహ తత్త్వం' అనే గ్రంథాన్ని శాస్త్రయుక్తంగా వ్రాసి, పీఠాధిపతులనే ఒప్పించడం గమనార్హం. తన ఇంట్లో అన్ని కులాల వారికి చోటిచ్చారు. సంప్రదాయవాదులను ఎదిరించి వేదాలను తెనిగించారు. అంటరానితనం ధర్మశాస్త్రాలకు సమ్మతం కాదన్నారు (పుట-89). హరిజన పక్షంలో వున్నాడు కాబట్టి అతనికి కులంలోనే హరిజన స్థాయిని కట్టబెట్టారు (పుట93)

మల్లయ్య శాస్త్రి గారు 1946 సెప్టెంబర్ 9న పరమపదించారు. ఘనమైన కీర్తిగల శాస్త్రిగారిని తెలుగు సమాజం మరచిపోయింది. ఆయన ఉత్తరాంధ్ర వీరేశలింగం అన్నారు ప్రముఖ చరిత్రకారులు ఆచార్య వకుళాభరణం రామకృష్ణ... ఎన్నో గ్రంథాలు, పత్రికలు చదివి మల్లయ్య శాస్త్రి గారి గురించి సమగ్రమైన సమాచారం అందించిన రచయిత డా॥కె.ముత్యం అభినందనీయుడు. ఇది ఒక పరిశోధనా గ్రంథం గనుక గ్రంథాలయాలలో వుండదగినది. పుటలు : 172, ధర : రు.150/-లు. లభించుచోటు : కె.స్వయంప్రకాష్, సంపాదకుడు, అగ్నిపూలు, 6-19-58, ఆదర్శనగర్ నిజామాబాద్-503 002.

-డా॥ఇమ్మానేని సత్యసుందరం

## స్పందనను వ్రాయండి

'అమ్మనుడి'లో రచనలపై
మీ స్పందనను వ్రాసి పంపండి!
సంపాదకుడు
'అమ్మనుడి', జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ
కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520 004.
ఇ-మెయిల్ : *ammanudi@gmail.com*

## సత్యశోధనలో పల్నాటి నాయకురాలి చరిత్ర - రెండు పుస్తకాల పరిచయం




నాయకురాలు నాగమ్మను సరి అయిన తీరులో అర్థం చేసుకోవాలంటే పల్నాటి వీరగాథపై ఇటీవల వచ్చిన రెండు రచనలను ఆకళింపు చేసుకుంటే సరిపోతుంది. వీటిలో మొదటిది "తొలి మహామంత్రిణి నాయకురాలు నాగమ్మ" రెండవది "శాంతిదూత నాయకురాలు". వీటిని రచించినవారు వై.హెచ్.కె.మోహనరావు. మొదటిది 2011వ సం॥లో, రెండవది 2015వ సం॥లో వెలువరించినవి. పల్నాటి చరిత్రపై దాదాపు 150 వరకు రచనలు వచ్చినప్పటికీ చేతి వేళ్ళపై లెక్కించదగిన నాలుగు రచనలు పాక్షికంగానూ, మిగిలినవన్నీ పూర్తిగా వక్రీకరణకు లోబడి నడిచినవేనని, పల్నాటి చరిత్రపై కలం పట్టిన అనేకమంది రచయితలు బ్రహ్మనాయుడి పట్ల సానుకూల దృక్పథంతోనూ, నాయకురాలి పట్ల అకారణ వ్యతిరేక వైఖరితో కథాంశాన్ని నడిపించారని ఈ రచయిత అంటున్నారు. తొలి గ్రంథకర్త శ్రీనాథ మహాకవి పలనాటి వీరచరిత్రలోని రెండు అధ్యాయాలు మాత్రమే మనకు లభ్యమైన పూర్వరంగంలో నాయకురాలు గురించి ఔన్నత్య విశేషాలు మనం సంపూర్ణంగా తెలుసుకోలేక పోతున్నామని వీరి అభిప్రాయం.

పల్నాటి రచయితల సంఘం అధ్యక్షులు వై.హెచ్.కె. మోహనరావు అయిదు సంవత్సరాల పాటు పల్నాటి చరిత్రపై వచ్చిన అనేక రచనలను అధ్యయనం చేసి ఈ విశ్లేషణ చేశారు. నాయకురాలి మహోన్నత సుగుణ సంపదనూ, శాంతి దౌత్యాలను, అభివృద్ధికర పాలననూ విశదీకరిస్తూ, బ్రహ్మనాయుడి తప్పిదాలనూ, అవాంఛనీయ పోకడలను సైతం వెలుగులోకి తెచ్చారు. జనశృతిలో ప్రచారంలో ఉన్న నాయకురాలి ప్రతికూల ప్రచారమంతా దోషభూయిష్టమని ఈ రచనలు స్పష్టం చేస్తున్నాయి. అదే విధంగా బ్రహ్మనాయుడి, బాల చంద్రుడి నేరాలను పరిగణించని రచయితలు వారిపై అమితమైన వాత్సల్యాన్ని కురిపించారని రచయిత ఆధారాలతో నిరూపించారు. నాయకురాలిపై మోపబడిన నేరాలన్నింటిని ఉపపత్తులతో ఖండించారు. నాయకురాలి స్వచ్ఛమైన వ్యక్తిత్వాన్ని పల్నాటి చరిత్రలో వెలుగు చూడని నిజాలనూ, నవ్యరీతుల్లో నిజ చరిత్రనూ తెలుసుకోగోరువారు తప్పక చదవవలసిన రచన ఇది. ఈ పుస్తకాలు కావలసిన వారు క్రింది చిరునామాను సంప్రదించగలరు.

1. తొలి మహామంత్రిణి నాయకురాలు నాగమ్మ. పుటలు:68, వెల రూ 100/-లు, 2. శాంతిదూత నాయకురాలు. పుటలు : 112, వెల రూ.100/- పోస్టేజ్/ కొరియర్‌తో సహా.

చిరునామా- వై.హెచ్.కె. మోహనరావు, డి.నెం.11-61/3, జానపాడు రోడ్డు, పిడుగురాళ్ళ- 522413, గుంటూరు జిల్లా, ఎ.పి. చరవాణి :94401 54114

❋

## పుస్తక సమీక్ష

# "రేగడి నీడల్లా"

"రేగడినీడల్లా"- ఇవి కొంగునాడు తెలుగు కథలు. తమిళనాడులో వుండే 5 తావులలో (కొంగు, మొరసు, చోళ, తొండ, పాండ్య) ఒక్కొక్కచోట ఒక్కొక్క తీరు. తెలుగు పడమటి దిక్కున వుండే పాతసేలం, పాత కోయంబత్తూరు జిల్లాలే కొంగునాడు. కోయం బత్తూరుకు దగ్గరలో వుండే ఉడుములపేటలో వుండే మార్టూరి సంజనాపద్మం అనే ఏడవ తరగతి చదువుతున్న అమ్మాయి రాసిన కత లివి. ప్రస్తుతం ఉడుములపేట తాలూకాలో 49 శాతం తెలుగువారు వున్నప్పటికి వాళ్లం దరూ ఇంట తెలుగు, బయటికొస్తే తమిళమే మాట్లాడుతారు. ప్రస్తుతం అక్కడ ఒక్క తెలుగు బడి అయినా లేదు.

సంజనాపద్మం తన సామల (అమ్మమ్మ, నానమ్మ) దగ్గర తెలుగులో విన్న కతలను తెలుగు లోనే రాయాలనే తపనతో ఆ ప్రాంతంలో స.వెం.రమేశ్ ఆధ్వర్యంలో 'తెలుగువాణి' ట్రస్టు నడుపుతున్న తెలుగు తరగతులకు హాజరై తెలుగు రాయటం నేర్చు కుని ఈ కొంగునాడు తెలుగులో రాసింది.

సంజన మొదటి కతలోనే మన బుర్రకు పదును పెట్టే ప్రశ్న వేసింది. టెంకాయల దొంగను సామ చెప్పినట్లు "దొంద (బొజ్జ) వినాయకుడే పట్టిచ్చినాండా" లేక అమ్మ చెప్పినట్లు "వాండు సారాయిని తాగేసి వచ్చి మబ్బులా పండేసినాండా" అంటుంది.

"టెంకాయలదొంగ" కతలో మనం మాత్రం చిక్కటి, చక్కటి, టీ, కాఫీలు తాగాలి పనిమనిషికి మాత్రం వాడేసిన టీయాకుతో టీ చేసి పొయ్యాలనే కొందరు ఆడవాళ్ళ మన స్తత్వాన్ని చక్కగా పట్టి చూపించింది. "ఉడుకు నీళ్ళు" కతలో, ఎవరినీ చిన్నచూపు చూడ కూడదు అని "కుక్కకు ఒకనాండు" కతలో చెబుతుంది. "దూరన్న దూరి" కథలో సెల్వి ఆమె భర్త వూరి వాళ్ళ బట్టలు వుతుకుతూ వాగు ఒడ్డునే వుంటుంటారు. ఏడాది బిడ్డను వుయ్యాలలో వేసి, కుక్కను కాపలాపెట్టి నాయుడు అంపిన పొట్టేలు కండను (మాంసం) పొయి




మీద పెట్టే లోగానే ఆమె పన్నగాండు (భర్త) వాగుకు పయిన కట్ట తెగి వెల్లువ వస్తుంది అనగానే నోటికాడి కూడు పోగా బిడ్డను, బతుకు తెరువు నిచ్చే ఇస్త్రీ పెట్టెను తీసుకుని వూర్లోకి పరుగెత్తుతారు.

"నాకు ఇంగిలీసు, అరవము చదువు లొద్దు తెలుగు చదువే కావాలని ఇల్లు విడిచిన గొడ్లతాత కతే "ఏది ఉన్నమ" కత. తాతల కాలంలో మంగలోడికి ఇచ్చిన రెండుగుంటల చేను దండగ. ఇప్పుడు ఇంటిలో అంతమంది క్షవరం చేయించుకునే వాళ్లులేరు గదా అని నాయుడు మంగలోడికి పని ఎక్కువ చేయా లనే దురాలోచనతో తన ఒళ్ళంతా గొరగ మంటాడు. తర్వాత ముళ్ళ మాదిరి గుచ్చు కుంటున్న ఒళ్ళుచూసి భార్య మొగుడిని అంటే దానికే భయపడింది. దానితో నాయుడు మూడు రోజులకొకసారి ఒళ్లు గొరిగించుకో వాల్సి వచ్చింది.దానితో రెండుగుంటల చేనుకి మూడురోజులకకొకసారి ఒల్లంతా గొరగటం నావల్ల కాదు. ఒక ఎకరా చేను ఇస్తేనే గాని కుదరదంటాడు మంగలోడు. చచ్చినట్లు ఎకరా ఇచ్చి "పడిని చూసి బల్లపోయె" అని వాపోతాడు నాయుడు ఈ కతలో.

"జయించితేను మరియాద" కతలో అప్పటివరకూ ఎగతాళి చేసిన కుంటోడి కుంటి పుంజు గెలవటం "పెనవులుండి పొయి లోకి" కతలో రేణు పడ్డ కష్టాలు, "ఇనుములా తేమ" కతలో రూకలమ్మ అవస్తలు, కలిసి వుంటేనే ఏదన్నా సాధించవచ్చు అనే "మూడు బావిలాండ్లు"కత, మూధనమ్మకంతో తనను తానే గాకుండా ఇంటివారందరిని బాధపెట్టిన వెంకటమ్మ కతే "గోవిందా గోవిందా" కత.

దీపాలపల్లి, దిన్నెపల్లి, రాగలబావి, పూలనూతి, బోడిపల్లి, పాంతూరు, ఇప్పల నగరం, చక్కటి తెలుగుపేర్లు వున్న పల్లెలన్నీ ఇప్పుడు తమిళపేర్లతో పిలవబడుతున్నాయి. అట్లాంటిదే "దొరకట్టినకొత్తూరు". విల్లిదొర వేటలో తనపరువు నిలిపిన జక్కండికి దొర కట్టిన ఈ వూరినే ఇచ్చినాడు. అదే ఇప్పుడు "సర్కార్ పుదూర్" గా పిలవబడుతుంది. తన అవసరాలన్నీ తీరిపోయినాక పెళ్లికాని అక్క ముత్తమ్మను ఏ మాత్రం పట్టించుకోని తమ్ముడు చివరకు "ఆడబతుకే కొలబతుకు" అని బాధపడుతుంది ముత్తమ్మ. చివరిగా సంజనా వాళ్ళ సామ ఐస్ం తినాలనే కోరికను ఏ విధంగా తీర్చుకుందో చెబుతుంది "జిల్లని ఒక ఆస" కత. ఈ సంకలనంలో మొత్తం 16 కతలున్నాయి.

చిన్నారి రచయిత్రి సంజన ప్రతి కత ఎత్తుకున్న తీరు చూస్తుంటే ఒక చేయి తిరిగిన రచయిత్రి రాసినట్టుంది. ఈ కొంగునాడు కతలలో ఎన్నో అప్పటపు తెలుగు మాటలు న్నాయి. ఈ కతలలో మనము ఒకప్పటి రచ నలలో చూసిన అరసున్నా స్థానంలో నిండు సున్నాలు కనిపిస్తాయి. ఉదా : వాండు, ఒంగడు, కూంతురు, వేంట. పుస్తకం చివ రిలో కొంగు తెలుగు పదాలకు వాడుక తెలుగు మాటలు అర్థాలు ఇవ్వటం వలన పాఠకుడు ఇబ్బంది లేకుండా చదవటానికి వీలయింది. ఈ కతలకు "పినిశెట్టి" గారు వేసిన బొమ్మలు అదనపు ఆకర్షణ. ఈ పుస్త కంతో పాటు తెలుగు చదవటం రాని వాళ్ళకు కతలను వినిపించే సి.డి.గూడా వుండటం ఒక విశేషం.

పుస్తకం పేజీలు 131,
వెల 100/-రూ.
దొరుకుచోటు-M.V.Vasanthnaidu,
No.7, Sairam layout,
Dhali road, Udumulapeta-
642126126, Tiruppur Dt.
Tamilnadu.
Cell : 919442627001.

-సమీక్ష : **పూదోట శౌరీలు,** బోధన్
90101 53505

# తెలుగు భాషాభివృద్ధికి 'అరసం' సూచనలు

విశాఖపట్నంలో విశాలాంధ్ర పబ్లిషర్స్ 16వ పుస్తక మహోత్సవం (డిసెంబరు 5వ తేది) సందర్భంగా, అరసం విశాఖ శాఖ ఆధ్వర్యంలో 'తెలుగుభాషను రక్షించుకుందాం' పేరిట సాహితీ సభ జరిగింది. ఈ సభలో సాహితీవేత్త డి.వి.సూర్యారావు ప్రసంగిస్తూ– మన మాతృభాషను రక్షించుకోవడం సెంటిమెంటు కాదు. సామాజిక బాధ్యత. కుటుంబ బంధాలను తెలుసుకోవడం కోసం, మానవ సంబంధాలను కాపాడు కోవడం కోసం భాష అవసరం. భాషోన్మాదం వద్దు...భాషాభిమానం కావాలి అన్నారు. ప్రస్తుతం వాడుకలో తెలుగుభాష దుస్థితిని వివరిం చడంతో పాటు, భాషను రక్షించుకునేందుకు పలు నిర్మాణాత్మక సూచనలు చేశారు.

సభకు అధ్యక్షత వహించిన సాహిత్యవేత్త, అరసం విశాఖశాఖ అధ్యక్షుడు ఆచార్య చందు సుబ్బారావు మాట్లాడుతూ– ఈనాడు భాష ఈ స్థితిలో ఉండడానికి పూర్తిగా ప్రభుత్వానిదే బాధ్యత అన్నారు. తెలుగు మాధ్యమంలో నడిచే ప్రభుత్వ పాఠశాలల్లో పరిస్థితులు అధ్వాన్నంగా వుండడం, తగిన ఆధ్యాపక సిబ్బంది లేక పోవడంతో, అన్ని వర్గాల వారు కార్పొరేట్ విద్యాసంస్థల వైపే మళ్లిపోతున్నారు. అలాగని ఆంగ్లభాషలో చదువుకుంటున్న విద్యార్థినీ విద్యార్థులు తమ దైనందిన జీవితంలో ఆంగ్లాన్నీ ధారాళంగా మాట్లాడలేక పోతున్నా రన్నారు. చివరికి తమ సెల్‌ఫోన్‌లలో కూడా తెలుగు భావాల్ని ఆంగ్ల భాషలో సందేశాలుగా తెలియజేసుకుంటున్నారని చమత్కరించారు.

తెలుగును ఒక అంశంగా చదువుకోకుండా డిగ్రీ ఉత్తీర్ణులయ్యే సౌలభ్యం, దౌర్భాగ్యం ఒక్క తెలుగు రాష్ట్రాల్లోనే కొనసాగుతోందని, మరే రాష్ట్రంలోనూ ఈ అవకాశాలు లేవని ఆచార్య శ్రీమతి కె.మలయవాసిని ఆవేదన వెలిబుచ్చారు. సాహితీవేత్త దేవరకొండ సహదేవరావు మాట్లాడుతూ– ఒడిశాలో భాగమైన బరంపురం వంటి ప్రాంతాల్లోని తెలుగువారు భాషాభివృద్ధి పట్ల చూపే శ్రద్ధాసక్తుల గురించి వివరించారు. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, ఉప్పల




లక్ష్మణరావు వంటి సాహితీ స్రష్టల కృషి, స్ఫూర్తి, ప్రోద్బలంతో ప్రవాస తెలుగువారు తెలుగు భాషను ఇప్పటికీ రక్షించుకుంటున్నారన్నారు. ఆచార్య కె.పాండురంగ విఠల్‌మూర్తి, రష్యా భాషను అభ్యసించడంలో తన తెలుగు భాషావగాహన ఎలా సహకరించిందీ తన స్వానుభవాలను వివరించారు. కార్పొరేట్ కళాశాలలో తెలుగు అధ్యాపకులను నియ మించడానికి కూడా యాజమాన్యాలు ఇష్టపడని వైనాన్నీ తెలియజేశారు.

"ఒకటో తరగతి నుండి డిగ్రీస్థాయి వరకు తెలుగు భాష అమలు జరిగేలా రాష్ట్రప్రభుత్వం నిర్బంధ విధానం రూపొందించాలి" "తమిళ నాడులో తెలుగు భాషకు ఎదురౌతున్న ఇబ్బందులు తొలగించడానికి ప్రభుత్వము, తెలుగు భాషాభిమానులు, సాహితీవేత్తలు తగిన కార్యా చరణ చేపట్టాలి" అన్న రెండు తీర్మానాలు చేశారు. అరసం శాఖ సహాయ కార్యదర్శి విరియాల గౌతం స్వాగతం పలికిన సభకు, కార్యదర్శి ఉప్పల అప్పలరాజు వందన సమర్పణ చేశారు.

**–బి.వి.అప్పారావు**, సెల్ : 7799835066

## భాషా సాహిత్య పరిశోధన/సాహిత్య విమర్శన పురస్కారాల పోటీకి ఆహ్వానం

తెలుగు భాషాసాహిత్య పరిశోధన గ్రంథానికి 'శ్రీమతి కొలకలూరి విశ్రాంతమ్మ పురస్కారం 2016' సాహిత్య విమర్శన గ్రంథానికి 'శ్రీమతి కొలకలూరి భాగీరథి పురస్కారం–2016' – ఆహ్వాన ప్రకటన మా కార్యాలయానికి డిసెంబరు 15న చేరింది. పోటీకి పుస్తకాలను స్వీకరించడానికి వ్యవధి జనవరి 8 వరకే. ఈ మాసపత్రిక పాఠకులకు అందేసరికి వ్యవధి అతి తక్కువగా ఉండవచ్చు. లేకపోవచ్చు. వివరాలకు: పరిశోధనా గ్రంథం గురించి: డా॥కొలకలూరి సుమకిరణ్ (99635 64664) గారిని, సాహిత్య విమర్శన గ్రంథం గురించి ఆచార్య కొలకలూరి మధుజ్యోతి (94419 23172) గారిని సంప్రదించవచ్చు.

## జి.నరసింహస్వామికి మల్లెతీగ పురస్కారం

నిజామాబాద్‌కు చెందిన జి.నరసింహస్వామి రచించిన 'పుట్టినట్లు' కవితకు మల్లెతీగ ప్రధాన పురస్కారం లభించింది. ఆత్మీయ పురస్కారానికి డా॥యం.బి.డి.శ్యామల (తెనాలి) రచన 'వర్ణాలను రాశిపోసినవాడు', చిన్ని నారాయణరావు (నెల్లూరు) రచన 'మహోదయాన్ని సృష్టిద్దాం', సరికొండ నరసింహరాజు (నాగార్జునసాగర్) రచన 'కవిత్వమే నా ఊపిరి', సవ్యసాచి (హైదరాబాద్) రచన 'బలిచక్రవర్తి', సిరికి స్వామినాయుడు (పార్వతీపురం) రచన 'ఎదురీత' కవితలు ఎంపికయ్యాయి.

ప్రధాన పురస్కారానికి రు.5000/–నగదుతో సత్కారం, ఆత్మీయ పురస్కారానికి రు.1000/–ల నగదుతో సత్కారం వుంటుంది. త్వరలో విజయవాడలో జరిగే ప్రత్యేక సభలో పురస్కారాలను ప్రదానం చేయడం జరుగుతుందని మల్లెతీగ సాహిత్యవేదిక అధ్యక్షుడు కలిమిశ్రీ తెలియజేశారు.

# "డాక్టరేట్ కాదు, డి.లిట్ ప్రదానానికి అర్హమైనది స.వెం.రమేశ్ రచన **ఎల్లలు లేని తెలుగు**"

ప్రముఖ తెలుగు ఆచార్యులు, పరిశోధకులు, బహుగ్రంథకర్త
**డా॥యార్లగడ్డ బాలగంగాధరరావు గారి ప్రశంస**




**శ్రీ** స.వెం.రమేశ్ గారి రచన 'ఎల్లలు లేని తెలుగు' నాకు నాలుగు దినాల క్రిందటే అందింది. ఆ గ్రంథం పూర్తిగా చదివానని తెలియ పరుస్తూ, ఈ నాలుగు వాక్యాలు వ్రాయాలనిపించి వ్రాస్తున్నాను.

శ్రీ రమేశ్ గారి 'ఎల్లలు లేని తెలుగు' చదివి నేను ఆనందించానని చెపితే, అది అతి సాధారణమైన మాట. అది చదవకుంటే నేను చాలా నష్టపోయేవాడిని. చదివి ఎంతో లాభపడ్డాను. అయితే అందులోని వ్యాసాలు పూర్వం 'నడుస్తున్న చరిత్ర'లో వచ్చినప్పుడు కొన్ని చదివినవే. కానీ ఇప్పుడు అన్నీ ఒకచోట చేర్చి ప్రచురించటంతో చెప్పదలచుకున్న విషయానికి ఒక సమగ్రత్వం ఒనగూడింది. చదువరి అవగాహనా సమష్టికి పూర్ణత్వం సమకూర్చింది.

అది అలా వుంచితే, తెనుగు మూలాలను, వ్యాప్తిని, ప్రాచీనతను తెలుసుకోవటానికి తనకు తెలిసిన దానిని తన జాతి వారికి తెలియ జెప్పాలనే రమేష్‌గారి తహతహకు, నెనరుకు జాతియావత్తూ కృతజ్ఞతా బద్ధమై వుంది. ఆ కృషి వెనుక ఎంతటి అచంచలమైన దీక్ష, కఠోరమైన శ్రమ అంచనాకు అందేవి కావు. అక్షరంలోకి ఒదిగి వస్తే చదువుకోవటం సులభమే. కానీ దాని వెనుకగల సమయ, ధనవ్యయాల మాట. ఆపైన శారీరక శ్రమ, ...ఒక తపన–వ్యథ. ఇదంతా రమేశ్ గారు ఎందుకు చేస్తున్నట్లు? ఆ తపన ఎందరికి అర్థమవుతుంది. సామాన్యులకు అర్థమైతే కలిగే ప్రయోజనం ఏపాటిది గనుక? అందవలసింది ప్రజా ప్రతి నిధులకు. ఈ విషయం అర్థం చేసుకోవటానికి, స్పందించటానికి వారికి తీరిక ఎక్కడ? ముందు మనసుండాలి కదా! అది వుంటే – రాష్ట్రానికి ఆవల వున్న తెనుగు వారి గతి అలా ఎందుకుండేది. రమేశ్ గారి ఆవే దన మనసున్నవారి హృదయాలను ద్రవింపజేస్తుంది. ఇప్పటి నా స్థితి అదే. అందుకే ఇది వ్రాయడం. అది అలా వుండగా, తన పరిశోధనలో వెల్లడైన, అందివచ్చిన విషయాలను ఎరుక పరచటానికి ఆయనకు అంది వచ్చిన భాషా వ్యవహారం అద్భుతం. విషయం తెలుసుకోవడం, అవగతం చేసుకోవడం, అనుభూతిని పొందడం వేరు. అక్షరంలోనికి ఒదిగించటం – అదీ పాఠకునికి హత్తుకునేట్లుగా – చాలా గొప్ప విషయం. ఎందరికో వలను పడనిది.

విశ్వవిద్యాలయాల్లో ప్రభుత్వము చేయించవలసిన పనిని, రమేశ్ గారు ఒక్కరై చేస్తున్న కృషి ఎంతైనా ప్రశంసనీయం. ఆయన చేసిన కృషికి నిజంగా ఒక డాక్టరేట్ కాదు, డి.లిట్ ప్రదానానికి అర్హమైనది. అలా ప్రదానం చేసేటంతటి సహృదయతను, సుమనస్కతా భావాన్ని మన విశ్వవిద్యాలయాలు అందుకోలేదు. దానికి ఎంతో పలుకుబడి కావాలి. ఇంకా ఎన్నో కావాలి. అవి రమేశ్ గారికి లభ్యపడేవి కావు. కానీ ఒకటి నిజం. ఒకరు కాదు, ఒక ఆచార్య బృందం – అంటే ఒక సామాజిక ఆచార్యుడు, ఒక మానవీయ శాస్త్రజ్ఞుడు, ఒక నామ విజ్ఞాన వేత్త కలిసి చేయదగిన కృషిని మన స.వెం.రమేశ్ గారు ఒకరై చేశారు, చేస్తున్నారు. దానికి వారు అభినందనీయులు. ఆచార్య పదంతో సంభా వింపనర్హులు. ఆ పదవిని విశ్వవిద్యాలయాలే ఇవ్వనక్కరలేదు. ప్రజా హృదయమే ఇచ్చింది. కనుక నేనలాగే వారిని సంబోధించదలచు కున్నాను. వారు చేస్తున్న కృషి మరింత ఉత్సాహంగా కొనసాగించాలని కోరుకుంటూ–

**–ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు,**
(నాగార్జున విశ్వవిద్యాలయ ఆచార్యులుగా, బహుగ్రంథకర్తగా, పరిశోధకులుగా ప్రసిద్ధులు) విజయవాడ.
ఫోను : 98494 99169



Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362

# తెలుగు ప్రజలకు అవమానం జరుగుతున్నా ప్రభుత్వమూ, పార్టీలు పట్టించుకోవు!



అటు కేంద్ర ప్రభుత్వమూ, ఇటు రాష్ట్ర ప్రభుత్వమూ– ఎవరి విధానం వారిదే. కేంద్రం ఆధ్వర్యంలో నెలకొల్పే సంస్థలకు, పనులకు శిలాఫలకాల్ని హిందీ, ఇంగ్లీష్‌లతో పాటు రాష్ట్ర అధికారభాషలో కూడా వెయ్యాలనే విధానం ఒకటి ఉంది. దాన్ని వారు పాటిస్తున్నారు.

మరి, మన రాష్ట్ర ప్రభుత్వానికి కూడా ఒక 'పాలసీ' ఉందనుకొంటే...అది– మన రాష్ట్రంలో ప్రభుత్వ ఆధ్వర్యంలో జరిగే కార్యక్రమాల్లో శిలా ఫలకాల్ని ఇంగ్లీషులోనే వెయ్యాలనేనా? ఎందుకంటే మనది అంతర్జాతీయ స్థాయి కదా... అందుకే ఆ విధానం!

ఎవరి విధానాన్ని వారు పాటిస్తున్నారు. ఇటీవల జరిగిన జాతీయ రహదారి విస్తరణ కార్యక్రమంలో కేంద్రం తెలుగులో కూడా రాతిపలక పెట్టగా, మంగళగిరిలో జరిగిన 'ఎయిమ్స్' ఆస్పత్రి శంకుస్థాపనలో తెలుగు మాయమై పోయింది. ఇదిగో– పై ఫొటోను చూడండి.

ఒక్క సంగతి గమనించారా?

తెలుగుదేశం పార్టీకి సంబంధించిన ఏ నాయకుడైనా అమరావతి కార్యక్రమంలో ఎక్కడా తెలుగు లేదన్న సంగతిని ఎక్కడైనా, ఎన్నడైనా ప్రస్తావించారా? తక్కిన పార్టీలవారు సైతం ఈ అంశంపై మాట్లాడటం లేదు. ఎందుకంటే ఇది తమ రాజకీయాలకు, స్వార్థాలకు అంతగా పనికొచ్చే అంశం కాదు గనుక.

ఇంతకూ రచయితలు, కళాకారులు– అంతా ఏమయ్యారు?

నిత్యమూ తెలుగుభాషా రక్షణ గురించి, ఉద్ధరణ గురించి మాట్లాడే పెద్ద మనుషులు అంతా ఎందుకు నోరు విప్పడం లేదు? ముఖ్యమంత్రి గారికి ఈ సంగతి చెప్పడానికి ఉన్నతాధికారులు, మంత్రులు, నాయకులు కూడా జంకుతున్నారా?

ఇక సింగపూర్ స్థాయిలో రాజధాని అమరావతి నిర్మాణం జరుగబోతున్నది గనుక– అక్కడ తెలుగు ఎక్కడా కనిపించదా? ఇది తెలుగు రాష్ట్రం కాదా? మనం తెలుగువాళ్ళం కాదా?

నవంబరు, డిసెంబరు 'అమ్మనుడి' సంచికల్ని మీరు చదివే ఉంటారు. అమరావతి శంకుస్థాపనలోనూ, వ్యవసాయ విశ్వవిద్యాలయ శంకుస్థాపనలోనూ ఇంగ్లీషే కనిపించింది. తెలుగు మాయమైపోయింది. మరి, మన రాష్ట్ర ప్రభుత్వ భాషా విధానం ఏమిటో తెలిసిపోవడం లేదూ! ఇదంతా తెలుగు ప్రజల్ని ప్రభుత్వమే మోసం చేస్తున్నట్లు కాదూ?!

